# KAKATI PROLARAJU





By

Vidwan

SRI VEDULA SURYANARAYANA SARMA



PUBLISHERS:

[illegible]RANADHA SAHITYA MANDALI,

TANUKU.

1962

# శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి.

"ఇలను బాలించెడి నరేంద్రు లెంచరున్న
ఎదల బాలించెడి నరేంద్రు డితడు నిజము".

ఈ పేరు చూడగనే... వింత వింత భావము లుదయించును.

ఇది రాజుల, జమీందారుల సాహిత్యసంస్థయా — అని మొదటి యూహ. కాని ఇందట్టి అడంబరములు, అతిశయములు వాసనకేని పొడ గట్టకుండుటచే ఇదియొక పుణ్యస్మృత్యంకమని ఇంచుక యాలోచించిన మీదట స్పష్టమగును.

భారత విజ్ఞాన ప్రదీపమై, ఖండాంతరముల తన తేజఃపుంజముల వెదజల్లి, ఆర్యకీర్తి కర్పూరపతాకమును స్థాపించి వచ్చిన శ్రీ వివేకానందుని పూర్వాశ్రమ నామధేయము నరేంద్రుడు. ఆపవిత్ర నామమందలి అఖండ గౌరవాదరముల ఫలితముగా శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారింట నుద్భవించిన చిన్ని ముక్తాఫల మీ బాలనరేంద్రుడు.

బాల్యదశలోనే ఈ జాతిరత్నము వయస్సునకు మించిన కాంతులను విరజిమ్మినది.

రేకులు పూర్తిగ విచ్చికొనకనే అపూర్వసువాసనల విసరిన దీ చిన్ని పూవు.

పూపప్రాయముననే వింత మాధుర్యము నందిచ్చిన దీ తీయ మామిడి పసికాయ.

తల్లిదండ్రులేకాదు — ఆప్త స్వజనమేకాదు — తోడివిద్యార్థులే కాదు — అతని సౌజన్య సౌశీల్యముల చవిచూచిన ప్రతిప్రాణియు ఆ బాలనరేంద్రునిపై ఎన్నియో ఆశలు పెట్టుకొని మమత పెంచుకొన్నది.

ఈ నరేంద్రుడు ఋషీవాలి గురుకులమున విద్యార్థిగా నున్నప్పుడే కొందరాతని ముఖముపై దానవీరుడగు జీమూతవాహనుని, దయావీరునైన బుద్ధదేవుని పసిగట్టిరి. కొందరు విజ్ఞానమూర్తియైన వివేకానందుని భావించిరి. మరికొందరు జాతిపురోభివృద్ధికి అగ్రగామియైన దేశనాయకుని పొడగాంచిరి.

అందరు మనసున నెంచినదొకటి, దైవము నిర్ణయించినది వేరొకటి. ఆ పసి యాణిముత్యము కాలసముద్రమున లీనమైపోయినది. ఆ చిన్ని పూవు నొక యీదురుగాలి త్రుంచివేసినది. ఆ రసాలశలాటు వొకనాడు హఠాత్తుగా నేలగూలినది.

అష్ఠల యాశలన్నియు కలలైపోయినవి. తక్కిన యంపతిమాట నట్లుంచి ప్రాణములన్నియు నాతనిపై బెట్టుకొన్న నా తలిదండ్రుల కేమి మిగిలినది ? అమృతమును హాలాహలమును మెనిచి ముక్తచేసిన ఆ బాల సుకృతి స్మృతిలోనే వారి శేషజీవితము నిండిపోయినది.

బాలనరేంద్రుడు ఋషీవాలిలో విద్యానిమిత్తమై తనసన్నిధిని వచ్చి చేయిచాచిన హరిజనబాలకునకు తడవుకొనకొండ ఇచ్చివేసిన పొత్తియుంగరపుకధ, వినోదయాత్రకై ఢిల్లీవెళ్ళి వచ్చుచు చలికి వణకు ముసలికి కాశ్మీరుశాలువను, ఒడలినిండ బట్టలేని ఇరువురు పేదరాండ్రకు తన అక్కలకై కొన్న పట్టుచీరలను నిశ్చింతగ దానముచేయుటయు, అట్లనే నుదురుపగిలిన మిత్రునకు విలువైన చొక్కా చించి కట్టుకట్టుటయు ఆ స్మృతిలోని విస్ఫులింగములు.

శ్రీ తిమ్మరాజుగారు అతిప్రేమాస్పదుడైన తమ చిన్ని నరేంద్రుని స్మృతిచిహ్నముగ నెట్టి ధర్మసంస్థనైన అవలీలగ నెలకొల్పగల శ్రీమంతులు. కాని ఇతర సంస్థలన్నింటికన్నను అఖండ విజ్ఞాన ప్రచారకశక్తిసంపన్నుడు పూర్వనరేంద్రుని నామధారియగు బాలనరేంద్రునకు తగిన స్మృతిచిహ్నము బహుగ్రంధ ప్రచార ప్రయోజకమైన ఈ సాహిత్యసంస్థయే యని ఆయన



అమరజీవి:

శ్రీ ముళ్లపూడి నరేంద్రనాధ చౌదరి

భావించి 29—1—1947 తేదీని శ్రీ నరేంద్రనాధ సాహిత్యమండలి అను నొక సాహిత్యసంస్థను స్థాపించిరి. దానికి నాటి మద్రాసు ముఖ్య మంత్రి శ్రీ పూసపాటి కుమారస్వామిరాజాగారు అధ్యక్షత వహించుట ఒక విశిష్టసంఘటనము.

ఈ సంస్థకు శ్రీ తిమ్మరాజుగారు 6000 రూపాయలు రొక్కమును 50,000 రూప్యముల విలువజేయు రాయల ముద్రణాలయమును మూల బలముగా నిలిపిరి.

నాటినుండి ఉత్తమగ్రంధ ప్రచురణ శ్రద్ధగలిగి — చాణక్యుడు, ఆదర్శగృహిణి మున్నగు చక్కని గ్రంధములెన్నియో వెలువరించినారు. ఇంకను అపూర్వములును, ప్రయత్నసాధ్యములును అగు గ్రంధముల నెన్నింటినో ప్రచురింపనై యున్నారు.

శ్రీ తిమ్మరాజుగారికి చరిత్రరచనమునిన మిక్కిలి మక్కువ. ఎంత దూరమునుండియైనను ఉద్గ్రంధములను, చరిత్రజ్ఞులను తమవద్దకు రప్పించుకొన సమర్థులైనను ఆయన స్వయముగా ఆయాస్థలములకు వెళ్ళి విద్యావేత్తలను కలసి వారితో చర్చించి గ్రంధములు పరిశీలించి సత్య విషయముల నిర్ణయించుకొనుట ఆయనకు పరిపాటి.

ఈ సాహిత్యమండలి ముఖ్యాశయము సద్గ్రంధప్రచురణమేయైనను దీని యాజమాన్యమున తరచుగ సమర్థులగు పండితుల యుపన్యాసములును సారస్వత గోష్ఠులునుగూడ నిర్వహింపబడుట పేర్కొనదగిన యంశము.

పుస్తకప్రచురణసంస్థ యనగనే ధనాపేక్షలేకుండ కేవల విజ్ఞాన ప్రచారమునకే వ్యవహరించుటయన్నది మిక్కిలి యరుదైన విషయము. కాని ఈ సాహిత్యమండలి ఏకైకలక్ష్యము లాభమపేక్షింపని విజ్ఞానగ్రంధ ప్రచారమే యని నిశ్చయముగ తెలుపవచ్చును. ఆదృష్టితోనే ఇది ఇంత వరకును వ్యవహరించుచున్నది.

ఆంధ్రభాషలో అమూల్యగ్రంధముల వెలువరించి ధనికనిర్ధన భేదములేకుండ సర్వపాఠకులను పుస్తకపఠనమునకు ప్రోత్సహించుటయే ఈసంస్థ పరమాదర్శము. ఈ లక్ష్యసాధనమునకు ఎంతధనవ్యయమైనను ఎంత శ్రమపడవలసివచ్చినను ఈమండలి వ్యవస్థాపకులు వెనుకాడరు.

ఇట్టి భాషాసేవాదృష్టిని, ఉన్నతాశయములను గుర్తించి ఆంధ్ర ప్రజానీకము చేయూత నొసంగినకొలదియు ఒక పవిత్రసేవకుని స్మృతి చిహ్నమైన ఈ సాహిత్యసంస్థ ఇతోధిక సాహిత్యసేవచేయుచు తన ప్రయత్నమును సఫలము చేసికొనెను.

రామచంద్రపురం,<br>
30—5—1962.

ఇంద్రగంటి హనుమచ్ఛాస్త్రి.



'విద్వాన్, సరస్వతీకంఠాభరణః'
శ్రీ వేదుల సూర్యనారాయణశర్మ.

ఈ కాకతిప్రోలరాజు గ్రంథము వ్రాయుటకు నాకుఁ గాకతీయులెవరో ముందు తెల్సుకొనవలసి వచ్చినది.

'కాకతీయులు ఎవరు?' అనువిషయము వివాదాంశమై చిరకాలమునుండి అపరిష్కృతముగానే యుండిపోయినది. కొమ్ములు తిరిగిన చారిత్రిక పరిశోధకులందఱుఁ దలకొక దారిని ప్రదర్శించిరి.

కాకతీయులు క్షత్రియులని; కాదు, శూద్రులని; రెండువిధములగు వాదములకు విద్యానాథుని ప్రతాపరుద్ర యశోభూషణమను అలంకారగ్రంథములోని శ్లోకములను ముఖ్యాధారములుగాఁదీసికొని ఆంధ్రసాహిత్యపరిషత్పత్రిక (X. P. 215) లో శ్రీ వత్సవాయి నీలాద్రిరాజుగారు, శ్రీ జయంతి రామయ్యపంతులుగారు వాదోపవాదములు వెలువరించిరి. ఇరువురు తమ వాదముల కుపపత్తులుగా శాసనాధారములుకూడఁ జూపించిరి. చరిత్రజ్ఞులలోఁగొందఱు రాజుగారిని, కొందఱు పంతులుగారినిఁగూడ సమర్థించిరి.

కాకతీయులు క్షత్రియులేయని అంగీకరించినవారుఁగూడ కొందఱు 1. ఏకామ్రనాథ శాసనము, (Ind Anti XXIP 197) 2. మోటుపల్లి శాసనము, (Ep Ind XII.P 188) 3. పాఖాల శాసనము, (Hyd. Arch Series No. 4, 1919) 4. ఏకశిలానగర

వృత్తాంతము మొదలగువాని నాధారములుగా సూర్య వంశ క్షత్రియులని నిరూపించిరి. మఱికొందఱు 1. ఒక్కరు శాసనములలోని దంతేశవర్మ శాసనము (Ep. Ind. IX.P 163) 2. సోమదేవ రాజీయము, 3. ప్రతాపచరిత్ర, 4. సిద్ధేశ్వర చరిత్రము మొదలగువాని నాధారములుగాఁ జంద్రవంశ క్షత్రియులనిరి. మఱికొందఱు ఇరువురకు మధ్యగా సూర్య చంద్ర వంశములకు భిన్నమగు వేఱొక క్షత్రియ వంశము కాకతీయులది కావచ్చుననిరి.

కాకతీయులు దుర్జయకులస్థులు, నతనాటి వంశీకులు నగు వారితో బాంధవ్యము నెఱపిరనియు, దుర్జయ నతనాటి వంశములు చతుర్థకులములగుటచే కాకతీయులు శూద్రు లని కొందఱు శాసనము లుదాహరించిరి.

శూద్రులనువారిలోఁగూడ కొందఱు కాకతీయులు కమ్మవారని, కొందఱు రెడ్లని నిరూపించిరి. A.R.C.No. 204 of 104 లోను, I bid Vol VI P. 84 లోను కాకతీయులకు కమ్మ వారితో బాంధవ్యమున్నట్లు సాక్ష్యముచూపుచు కాకతీయులు కమ్మవారని కొందఱనిరి. మఱికొందఱు దక్షిణపాడులోని నాగనాథ దేవాలయములోని చెన్నూరు శాసనములో ప్రతాపరుద్రునికొడుకుపేరు చివర 'రెడ్డి' యని యున్నదనియు ఆతనిపేరు 'జుట్టయలెంకగొంకారెడ్డి' యనియు, రెడ్లతో కాకతీయులకు బాంధవ్యముఁగూడ నున్నదనియు దెలుపుచు 'కాకతీయులు రెడ్లు' అని యనుచున్నారు.

కాకతీయరాజ్యము తరువాత వచ్చినది రెడ్డిరాజ్యము కదా! కాకతీయులే రెడ్లయినచో కాకతీయరాజ్యము వేఱుగను, రెడ్డిరాజ్యము వేఱుగను పేరుపడుట యెట్లుపొసగును? అని కాకతీయులు రెడ్లుకాదను వారు కొందఱు ప్రశ్నించుచున్నారు.

ఈవిధముగా కాకతీయులు క్షత్రియులైనయెడల సూర్యవంశస్థులని, చంద్రవంశస్థులనికూడ ఆధారములున్నవి. కాకతీయులు శూద్రులైనయెడల కమ్మవారనుటకు, రెడ్డివారనుటకుఁగూడ ఆధారములున్నవి. అన్ని వాదములకు శాసన వాఙ్మయాధారములు లభించుట చిత్రముగానేయున్నది. వేదమతస్థులని, జైనులని, శైవులని, వీరశైవులనికూడ కాకతీయుల మతములు భిన్నములుగాఁ గన్పట్టుచున్నవి. పూర్వాపరములనుబట్టి పైమతములన్నియు నొకరికే రావచ్చునని చెప్పవచ్చును గాని, క్షత్రియశూద్రజాతులను కమ్మ రెడ్డి కులములను ఒకరికేయుండునని చెప్పుట యెట్లు సరిపడును?

పురాణములలోని వంశానుకీర్తనములతో శాసన వాఙ్మయాధారములను జోడించి పరిశోధనముఁ జేయఁగాఁ జేయఁగా నాకు పైవాదములనన్నిటిని ఒకే సూత్రమునకు గ్రుచ్చి అన్నిటను సత్యత్వము నిరూపించుటకు తగిన ఆధారములు లభించినవి.

నాకు లభించిన ఆధారములతో అన్ని వాదములను సమన్వయపఱచితిని. కాకతీయులు రజిరాజుకుమారులు.

క్రముఁడను రాజుపేరుతో కమ్మవారని ప్రసిద్ధికెక్కిన క్షత్రియులు; వారు సూర్యవంశస్థులు చంద్రవంశస్థులుఁగూడ నై బలిజులై-అత్యర్కేందుకులస్థులైరి. ఆపైని వారికి శూద్రత్వము సిద్ధించినది. వారే రాష్ట్రులై రెడ్లను పేరుఁగూడ వహించిరి. ఈ సమన్వయమార్గమును పురాణాధారములతో విపులముగా 'కాకతీయులు ఎవరు?' అను నొక వ్యాసమును వ్రాసి 1961 జూలై నెల భారతిపత్రికలో ప్రకటించితిని. నా వ్యాసముపై నింతవరకు ప్రతికూల విమర్శ రానేలేదు. పెక్కురు చరిత్రజ్ఞులగు విజ్ఞులు నా సమన్వయ కథనమునకు మెచ్చుకొని 'కాకతీయులనుగూర్చి విభిన్న వాదములకు పరిష్కారమార్గము నేఁటికి మీచే వెలువరింపఁబడినది'అని అభినందించిరి.

నా పరిశోధనమును ఇంకను విపులముగా గ్రంథాధారములన్నిఁటితో 'కాకతీయవంశము'అనుపేరున ప్రత్యేకగ్రంథముగా మునుముందుఁ బ్రకటింపఁదలఁచియున్నాను.

చారిత్రక పరిశోధనమునఁ దేల్చినసత్యము చేఁదుమాత్రవంటిది. అది కేవల చరిత్రజ్ఞులకేకాని అందఱకు రుచింపదు. సామాన్య ప్రజలలో పాఁతుకొనిపోయి యున్న విషయ విశ్వాసములను ఎన్ని సత్యహేతువులు చెప్పియును తొలఁగించుట సులభసాధ్యముకాదు. రోగిచే రోగనిరాసమునకు చేఁదుమాత్ర మ్రింగించుట వంటిదే యగును. రోగి హితవుగా మ్రింగుటకై చేఁదుమాత్రకు పంచదారపూఁత వెట్టినట్లు చారిత్రిక పరిశోధనవలనఁ దేలిన సత్యమును సామాన్యపాఠ

కులచే నమ్మించుటకై యొక కథతో జోడించి మనోహర త్వముఁ గల్పించు టావశ్యకమని తోచి కాకతీయులను గూర్చిన నా విమర్శనమును ప్రోలరాజు కథతో జోడించి ఈ గ్రంథమును రచించితిని.

కాకతిరాజులలో రెండవ ప్రోలునకు కాకతిప్రోలుఁ డనిపేరు. కాకతీయులలో నీతఁడాంధ్రరాజ్య స్థాపనాచార్యు లలోఁ బ్రథముఁడు. ఈతని చారిత్రము మిగుల రమ్యమైనది. శాసనాధారముచే సుస్థిరమైనది.

కాకతీయచరిత్రమును సమగ్రము రచింపించి ప్రక టింపవలెనని శ్రీ నరేంద్రనాథ సాహిత్యమండలి వ్యవస్థాపకు లగు శ్రీ ముళ్ళపూడి తిమ్మరాజుగారు చిరకాలమునుండి అభిలషించుచు, నన్ను రచనమునకు ప్రోత్సహించుచువచ్చిరి. ఒకే పెద్దసంపుటముగాఁ బ్రకటింప ముందు సంకల్పించిరి. కాని కాకతీయ వంశకథనము, కాకతీయశిల్పము, కాకతీయ సంస్కృతి అను విమర్శాత్మక గ్రంథములను, వివిధ కాకతీయ రాజులచరిత్రములను పాఠకుల యుపయోగార్థము విడివిడిగా ప్రకటించి, అన్నిఁటినికలిపి 'కాకతీయసర్వస్వము'గా పెద్ద సంపుటమును వెలువరించుటకు తరువాత నిశ్చయించిరి. కాకతీయ వంశ నిరూపణముతో 'కాకతిప్రోలరాజు' అను ఈచరిత్రాత్మకమగు నవలను ముందు ప్రకటింపఁ దలఁచి ఐదుసంవత్సరములకు క్రితమే నన్ను రచనమున కుద్యమింపఁ జేసినారు.

కాకతీయవంశమునుగూర్చిన భిన్నభిన్న వాదములను సమన్వయపఱచుటకై పెక్కుపురాణములను, చారిత్రక గ్రంథములను, కావ్యములను పరిశోధింపవలసి వచ్చినది; విద్యానాథుని ప్రతాపరుద్ర యశోభూషణమను అలంకార శాస్త్రగ్రంథమును తలస్పర్శముగా విమర్శింపవలసివచ్చినది; ఇందులకు మూఁడు సంవత్సరములు పట్టినది. నా పరిశోధనమువలనఁ దేలిన సమన్వయసారమును భారతిపత్రికలో ప్రకటించి ఒకటిన్నర సంవత్సరము దానిపై వ్యతిరేకవిమర్శలేమైన వచ్చునేమోయని వేచియుండవలసివచ్చినది.

దౌర్వ్యాసదేవీపురాణము సంపూర్ణగ్రంథము ఎచ్చటనైన లభించునేమోయని పెక్కుప్రయత్నములు చేయవలసి వచ్చినది. శ్రీ మామిడిపల్లి దొరసామినాయునిచేఁ బ్రకటింపఁబడిన వంశానుచరితము అను భాగముకల అసంపూర్ణ గ్రంథ ప్రతి కాక మఱియొకటి ఇంతవరకు లభింపనేలేదు. కాని అందలి విషయములు యథాతథముగా మార్కండేయ పురాణములోఁగూడ లభించినవి. భాగవత బ్రహ్మపురాణములలోఁగూడ లభించినవి. లభించిన దౌర్వ్యాసదేవీపురాణము అసంపూర్ణప్రతియగుటచే నీ విధముగా ఒకగ్రంథమునఁగలవి పెక్కుగ్రంథములలో సంపాదింప యత్నింపవలసివచ్చినది.

"అత్యర్కేందుకుల ప్రశస్తి మసృజద్యం కాకతీయాన్వయమ్' అత్యర్కేందుకుల ప్రసూతి మసృజద్యం కాకతీయాన్వయమ్" అని విద్యానాథుని కావ్యము ప్రశస్తి,

ప్రసూతిపాఠములతో రెండువిధములుగా ముద్రింపఁబడి ప్రకటింపఁబడియున్నది. ఈ రెండుపాఠములలో నేది సరియైనది? అని నేను చేసిన పరిశోధనవలన నాకు 'కాకతీయులెవరు?' అన్న సమస్యలోని చిక్కు విడిపోయినది. 'ప్రసూతి'పాఠమే సరియైనది అని పురాణకథలు ధ్రువపఱచినవి. ప్రసూతిపాఠము అర్థముకాక 'ప్రశస్తి'పాఠము తర్వాత ముద్రాపకులు పరిష్కరించినదిగా కన్పట్టినది. ప్రసూతి, ప్రశస్తి పాఠములలో నేది ప్రాచీనమైనదో తెలిసికొనుటకు వివిధ ముద్రాపకులు ముద్రించిన ప్రతాపరుద్రీయముయొక్క వివిధ ప్రతులను సంపాదించి పరిశీలించిచూచితిని. 'ప్రసూతి'పాఠమన్నిటికన్న ప్రాచీనమగుప్రతిలోనున్నది. దాని ప్రాచీనతను మద్రాసు ఓరియంటలు లైబ్రరీవారు రికార్డుచేసియున్నారు. ఈవిధముగా 'ప్రసూతి' పాఠమును స్థిరపఱచుకొనుటకు మఱికొంతకాలము ఆలస్యము కాకతప్పినదికాదు.

ఆపైని మతవిస్తరణముతో రాజ్యవిస్తరణము సాగినట్లు తెలుపు గ్రంథములను, జైన, బౌద్ధ, శైవ, వీరశైవ మతగ్రంథములను పెక్కు చదువవలసి వచ్చినది.

ప్రజలలో ప్రచారముననున్న గాథలను దెలుపు చిన్న చిన్న పాఠ్యగ్రంథములను, కైఫీయతులను పెక్కింటినిచదివి బహుళప్రచారమున్న గాథలకు చారిత్రిక సత్యత్వమును నిరూపించుకొనవలసి వచ్చినది.

నాఁడు రజిరాజు కుమారులగు క్రమవారు ఇంద్రపదవి నధిష్ఠించి 'ఇంద్రు'లను పేరు పెట్టుకొని పాలించియుండు

టకును నేఁడు కమ్మవారిలో మాత్రమే పెట్టుకొనఁబడుచున్న 'ఇందర్రియ్య' అను పేరునకును సంబంధమున్నట్లు కన్పట్టుచున్నది. ఇట్లే నేఁడును దక్షిణాదిని కమ్మవారిలోఁ గల రేణుకాసమారాధనము మొదలగు నాచారములకు పౌరాణ చారిత్రక సంబంధములు కన్పట్టుచున్నవి. వీనిని నిరూపించి నిర్ణయించుకొనుటకు కమ్మవారు విశేషముగాఁగల గ్రామములలోని పెద్దలకు వ్రాసి వ్యవహార బాహుళ్యము తెలిసికొనవలసివచ్చినది. ఈవిధముగా నా పరిశోధనా సర్వస్వమును నిరూపించుకొనుటకు ఎంతెంతో ఆలస్యము కాకతప్పినదికాదు. వ్రాసినగ్రంథము చిన్నదియైనను వివాదాంశముల పరిశోధనము పెక్కుగానే జరుపవలసివచ్చినది. నా గ్రంథమున కాధారములు గ్రహించిన గ్రంథములు పెక్కు లుండుటచే వాని పట్టికగూడఁ దెలిపికొని యున్నాను. ముఖ్యములైన ఆధారములకు మూలశ్లోకములనుగూడ యథాతథముగా చివర ప్రకటించియున్నాను.

నా యీ గ్రంథమున కాధారములైన గ్రంథములను రచించిన కవులకును, ముద్రించి ప్రకటించిన ప్రకాశకులకును నా కృతజ్ఞతను దెలుపుకొనుచున్నాను.

నా పరిశోధనములోని గుణములను, దోషములను సహృదయముతోఁ దెలుపఁగలందులకు పాఠకమహాశయుల నర్థించుచున్నాను.

తణుకు,
23—3—1963.

ఇట్లు,
వేదుల సూర్యనారాయణశర్మ.

# ఈ గ్రంథ రచనమునకు తోడ్పడిన గ్రంథములు.

## సంస్కృత గ్రంథములు.

1. శ్రీమద్భాగవతము.
2. వాయుపురాణము.
3. బ్రహ్మ పురాణము.
4. మార్కండేయ పురాణము.
5. దౌర్వాస దేవీ పురాణము
6. మార్కండేయ పురాణము—భవిష్యోత్తర ఖండము.
7. ప్రతాపరుద్రీయ యశోభూషణమ్ — విద్యానాథుఁడు.

## తెలుఁగు గ్రంథములు.

8. బలివంశపురాణము.
9. బసవపురాణము — శ్రీ పాల్కురికి సోమనాథకవి.
10. శివయోగసారము-తాళపత్రగ్రంథము — శ్రీ కొలని గణపతిదేవుఁడు
11. ఆంధ్రులచరిత్ర - సంస్కృతి —
    ఆచార్య ఖండవల్లి నిరంజనంగారు, M. A.
    and
    ఖండవల్లి బాలేందుశేఖరంగారు, M. A.
12. ఆంధ్రులచరిత్రము — శ్రీ చిలుకూరి వీరభద్రరావుగారు
13. ప్రతాపరుద్రీయము (నాటకము)—శ్రీ వేదము వేంకటరాయశాస్త్రిగారు.
14. శ్రీ పుష్పగిరి సంస్థానంవారి విజ్ఞాపనపత్రిక.
15. ఆంధ్రనాయకుల చరిత్ర— శ్రీ కొడాలి లక్ష్మీనారాయణగారు, బి.యే.
16. వేదభూమి — శ్రీ అచ్యుతం వేంకటచలపతిరావుగారు.
17. తెలుఁగు వెలుఁగు — శ్రీనివాస సోదరులు.
18. కాకతీయ సంచిక—సంపాదకులు శ్రీ మారేమండ రామారావుగారు.
19. ప్రతాపచరిత్ర — ఏకామ్రనాథుఁడు.
20. ఆంధ్రపత్రిక ప్రజోత్పత్తి సంవత్సరాదిసంచిక.
21. కమ్రరాజము — శ్రీ చాపరాల వేంకటాద్రివర్మగారు.

22. కమ్మవారిచరిత్ర — శ్రీ సూర్యదేవర రాఘవయ్యచౌదరిగారు.
23. డిటో శ్రీ కొత్త భావయ్యచౌదరిగారు.
24. జయార్థప్రకాశిక —శ్రీ స్వామి జి. యస్. సరస్వతి.
25. సప్తపర్ణి -- శ్రీమతి కుమారి మల్లాది వసుంధరగారు.
26. బ్రహ్మసూత్రభాష్యము-ఆంధ్రీకరణము—
శ్రీ పురాణపండ మల్లయశాస్త్రిగారు.
27. ఆంధ్రశారీరము — శ్రీ వల్లూరి జగన్నాథరావుగారు.
28. సోమదేవరాజీయము — జగన్నాథకవి.
29. సిద్ధేశ్వర చరిత్ర — Edited by ఆచార్య
ఖండవల్లి లక్ష్మీనిరంజనంగారు, M. A.
30. ఆంధ్రసాహిత్య పరిషత్పత్రికలు.
31. భారతి పత్రికలు.

## ఆంగ్ల గ్రంథములు.

32. Quarterly Journals of the Andhra Historical Research Society Vol. III parts 2, 3 & 4, 1928-29.
33 Brief Survey of Indian History by Phanikkar.
34 History of Medieval India of Eswara Prasad.

## శాసనములు.

1. ఖాజీపేట శాసనములు.
2. గూడూరు శాసనము.
3, అనుమకొండ శాసనములు.
4 మామిళ్లపల్లి శాసనములు.
5. గణపవరము శాసనము
6. పిల్లలమర్రి శాసనము.
7. కుందవరము శాసనము.
8 ఉప్పరపల్లి శాసనము.
9. పాఖాల శాసనము.
10. ఏకామ్రనాథ శాసనము.
11. పాలంపేట శాసనము.
12. మల్కాపుర శాసనము.
13. కలువచేరు శాసనము.
14. బస్తరు శాసనములు.



శ్రీ ముళ్లపూడి తిమ్మరాజు చౌదరి.

# కాకతి ప్రోలరాజు

మొదటి ప్రకరణము.

## జైనమతవ్యాప్తి.

వేదమతస్థులు ఆత్మవాదులు, కర్మవాదులును. ఆత్మసాక్షాత్కారముఁగూర్చి వేదాంతములు ఘోషించుచున్నవి. మంత్ర తంత్ర జప హోమములు యజ్ఞములు దేవతాప్రీతిఁ గల్గించి సర్వఫలముల నొసఁగగల కర్మకాండకు వేదములు నిలయములు. శత్రునిర్మూలనమునకు, కీర్తి ప్రాప్తికి, స్వర్గసుఖానుభవములకు అన్నికామ్యములకు అన్నివిధములగు యజ్ఞములు వేదములందుఁ జెప్పఁబడినవి. చాతుర్వర్ణ్యము వేదమున విధింపఁబడినది. ఆత్మ ఆకాశమువలె సర్వవ్యాపకము. అగోచరము, నిరాకారము నని, సృష్టి సర్వమును పరమాత్మస్వరూపమని వేదాంతములు చెప్పుచున్నవి. ఆత్మదర్శనమునకు బాహ్యేంద్రియములు పనికిరావు. అందులకు సూక్ష్మేంద్రియమొకటి కావలెను. ఆ యింద్రియమును గుర్తించుటకు నిష్కామయోగము, ప్రవ్రజ్య, తపస్సు సాధనములు అని వేదాంతములు వెల్లడించుచున్నవి.

వేదమతము ప్రజాదరణము పొందినంతనే రాజులు ప్రజామనస్సును తమ కభిముఖముచేసికొని రాజ్యములు స్థిరపఱచుకొనుటకు, విస్తరించుకొనుటకు, వేదమతవ్యాప్తికి మిక్కిలి తోడ్పడిరి. రాజులు రాజ్యవిస్తరణకాంక్షులై మతమును స్వప్రయోజనమునకు వ్యాప్తిచేయుచువచ్చిరి.

వేదమతస్థుల ఆత్మవాదము నొప్పుకొనని కేవల భౌతికవాదులును ఆత్మవాద మవతరించిన యదేకాలమున లేకపోలేదు. భౌతికవాదులు

ఇంద్రియగోచరములగు భౌతికపదార్థములనుదప్ప ఆత్మనుగాని, స్వర్గ నరకములనుగాని, పునర్జన్మమునుగాని, వేదప్రామాణ్యమునుగాని, వర్ణ భేదమునుగాని యొప్పుకొనరు. నాఁడు ప్రజలలో వీరి వాదము వ్యాపింపకపోవనులేదు. కాని రాజప్రాపకములేని కారణమున భౌతికవాదము రాజప్రాపకముగల ఆత్మవాదము నెదిరించి విశేషవ్యాప్తిని మాత్రము గడించుకొనలేకపోయినది.

గౌతమబుద్ధుఁడు తరువాత బయలుదేఱి అనాత్మవాదమును లేవఁదీసెను. ఈ అనాత్మవాదము ఆత్మవాదులకు భౌతికవాదులకును మధ్యమార్గము నేర్పఱచినది. గౌతముఁడు ఆత్మవాదులవలె పునర్జన్మము, స్వర్గ నరకానుభవములు నంగీకరించి వారితో నేకీభవించినాఁడు భౌతిక వాదులవలె ఈశ్వరుఁడు, ఆత్మ మొదలగు నిత్యపదార్థముల నొప్పుక వేద ప్రామాణ్య మంగీకరింపక యజ్ఞాది కర్మకాండను, వర్ణవ్యవస్థను నొల్లక వారితోడను నేకీభవించినాఁడు.

ఉభయులకు మధ్యగానుండి యుభయుల సిద్ధాంతములను కొన్ని విడిచి కొన్ని స్వీకరించి యేర్పఱచినదగుట నీ బౌద్ధమత ముభయమతస్థుల యొక్క విశ్వాసమును పొందగల్గినది.

జైనమతప్రవక్త వర్ధమానమహావీరుఁడు. ఈతఁడు గౌతమబుద్ధుని సమకాలికుఁడే.

పరమాత్మ లేఁడని చెప్పుట, వేదప్రామాణ్యమును కాదనుట, వర్ణవ్యవస్థ లేకపోవుట, బౌద్ధ జైన మతముల రెండిటను సమానమే. బౌద్ధ జైనములలో కులధనములచే న్యూనాధిక్యములులేవు. వారు మానవుల గుణములకే ప్రాధాన్యమిత్తురు. అతని విజ్ఞానము, అతని సుగుణసంపత్తి మాత్రమే అతఁడు సంఘమున గౌరవనీయుఁడుగ భావింపఁబడుటకు కారణములగును. నైతికప్రవర్తనము జైన బౌద్ధముల రెండిటియందు ప్రాముఖ్యము వహించినది.

వర్ధమానమహావీరుఁడు జైనమతప్రవక్తగ పేరువడినను ఆతనికిఁ బూర్వము ఇరువదిముగ్గురు తీర్థంకరు లవతరించియేయుండిరి. ఇరువది మూఁడవ తీర్థంకరుఁడు పారశ్వనాథుఁడు. ఈతని తరువాతివాఁడే వర్ధమానమహావీరుఁడు. కాన బౌద్ధముకంటె జైనము ప్రాచీనమని చెప్పనగును.

సర్వము నంతలోఁబుట్టి నంతలో నశించునని బౌద్ధులనఁగా సర్వము ననేకరూపములు గలదని జైనులందురు. సప్తభంగీనమను న్యాయమున కలదు లేదను విరుద్ధధర్మములు సర్వమునందు గల్గునుగాన సర్వము ననేక రూపములు గలదను జైనము సర్వము నేకరూపమనిచెప్పు వేదమతమును ఖండించుచున్నది.

' పుద్గలము ' అను పేరుగల పరమాణువులవలన సంఘాతములు (పృధివ్యాధులు) పుట్టుచున్నవని జైనుల వాదము. ఈ యణువాదము వేద మతస్థులగు తార్కికులయందును గలదగుటచేఁ జాలమంది ప్రజలలో నీ జైనమతము సులభముగ వ్యాపించినది.

అర్హతులు (జైనులు) జీవునకు బంధనాశనము వలన నూర్ధ్వగామిత్వము కలుగునని చెప్పుదురు. వీరి మతమున జీవుఁడు కలఁడుకాని పరమాత్మలేఁడు. వేదమతస్థులు నరపశు పక్ష్యాదులలో జీవమున్నదన, జైనులు మొక్కలలో, నీటిలో, గాలిలో, లోహములలో, రాళ్ళలోఁగూడ జీవమున్నదనిరి.

ఈ సమస్త ప్రపంచమును కారణసముదాయము ననుసరించి పుట్టినదేకాని భగవంతుఁడనువాఁ డొకఁడు సృష్టికి కారణుఁ డున్నాఁడని బౌద్ధ జైను లొప్పుకొనరు. ఈ ప్రపంచము ప్రతీత్యసముత్పాదనమని వారందురు. ప్రతీత్యసముత్పాదనమనగా కారణసామగ్రినుండి కార్యము పుట్టుటయని యర్థము.

"బీజమునుండి యంకురమును, అంకురమునుండి పత్రమును, పత్రమునుండి నాళమును, నాళమునుండి శూకమును, శూకమునుండి

పుష్పమును, పుష్పమునుండి ఫలమును, ఫలమునుండి తిరిగి బీజమును చక్రభ్రమణమున నుత్పత్తి యగుచుండును. ఇందు బీజాదులులేక అంకురాద్యుత్పత్తి కాఁజాలదు. ఇందు బీజాదులకుగాని, తత్కార్యములకుగాని పరస్పర కారణకార్యజ్ఞానములేదు. లేకున్నను క్రియమాత్రము సిద్ధించుచునేయున్నది. ఇందు చేతనసహాయమేమియు లేదు" అని వారి వాదము.

"బీజస్థములగు గుణములకు షడ్ధాతువులు కారణములు. బీజమునకు పృథివి కాఠిన్యమును, జలము రసమును, తేజస్సు పరిపాకమును, గాలి ఉద్భిజ్యత్వమును, ఆకాశ మవకాశమును, ఋతువు పరిణామమును కలుగ జేయుచున్నవి. ఇందుఁ గారణసామగ్రియంతయు యుక్తస్థితిలో నున్నప్పుడే బీజము లంకురించుచున్నవి. లేనిచో నంకురింపకయున్నవి. ఇందీషడ్ధాతువులకుఁగాని, బీజమునకుఁగాని కార్యకారణజ్ఞానము లేదు. లేకున్నను క్రియాకారులగుచున్నవి. కావున చేతనకారణ మీ ప్రపంచ సృష్టికిలేదు" అని వారి వాదము.

"అవిద్య (మాయ) వల్ల రాగద్వేష మోహాత్మకములగు సంస్కారములు గలుగుచున్నవి. ఆ సంస్కారమువలన గర్భస్థమగు వస్తువునకు ప్రాథమికవిజ్ఞానము గలుగుచున్నది. ఈ విజ్ఞానమువలన పృథివ్యప్తేజో వాయురాకాశసంఘము కలిగినది. ఈ సంఘమునకే 'నామ' మని సంకేతము. నామమువలన రూపము కలుగుచున్నది. జాతమైన జన్మకుఁ గల పరిపాకమే జర. జన్మనాశమే మరణము. చనిపోయినవానినిగూర్చి కలుగు సంతప్తాపమే శోకము. అందువలనఁ గలుగు ప్రలాపనమే పరిదేవన. ఇట్లు అవిద్యాజన్మము లితరేతర హేతుకములు. మఱియు నివి పరస్పర నిమిత్త నైమిత్తిక భావమునుపొంది ఘటీయంత్రము (గడియారము) వలెనే అనిశ మావర్తమానములై సంఘాతమును జేయుచున్నవి. కాని అట్లు చేయుటతో వానికి పరస్పర కార్యకారణజ్ఞానముకాని, చేతనాంతరాపేక్షగాని లేశమును లేదు" అని వారి వాదము.

పైవాదములవలన ప్రపంచసృష్టికి భగవంతుఁడొకడున్నాఁడనుట అసంగతమని వారి మతము తేల్చుచున్నది.

ఇఁక జైనము విగ్రహారాధన ముజ్జగింపలేదు. జైనమతమెప్పుడును హిందూమతమునకు వ్రేళ్లు తెగగొట్టలేదు.

తమ్ము హిందువులుగా జెప్పుకొనినను వారికి పట్టింపులేదు. తమ సిద్ధాంతముల నాచరించుటే వారికిఁగావలసినది. ఈకారణములచేతఁగూడ జైనమత సిద్ధాంతములు సులభముగా హిందువులలో వ్యాపించినవి.

మానవునిలోని మహోన్నత సుగుణరాశియే భగవంతుఁడని జైన మత విశ్వాసము. అందుచేతనే జైనమతమునకు ' మానవమత ' మనియుఁ బేరుగల్గెను.

అహింస జైనమతములో నెంత ప్రాధాన్యమువడసినను విధాయక కృత్యమున కీయహింసా ధర్మము వారి కడ్డురాదు. రాజు నిందితు నురి దీయుట, భటుఁడు యుద్ధములో శత్రువులఁజంపుట అనునవి అహింసా సిద్ధాంతము నతిక్రమించుటగా వారు తలంపరు. ముగ్గురకు మేలుచేయు టకు నిద్దఱను తప్పక చంపవలసినను జైనమతము దానికి కాదనదు.

మోక్షమన జైనుల యర్థమువేఱు. కర్మనాశన పూర్వకముగ జీవుఁడు అలోకాకాశ గమనముఁజేసి దానిలో సంతతోర్ధ్వ గమనము చేయుటే మోక్షము వారికి. జీవుఁడెప్పుడు నూర్ధ్వగమనశీలుడు కాన ఊర్ధ్వ గమనమే జీవునకు మోక్షమని వారి సిద్ధాంతము. సృష్టి, జీవుఁడు అనాదు లనియే వారి యాశయము.

ద్వైతులలోను, విశిష్టా ద్వైతులలోను జీవాణుత్వ వాదమున్నది. తార్కికులందఱు అణువాదులే. జైనులు జీవున కణుత్వ మంగీకరించి జీవా వయవములకు సంకోచ వ్యాకోచములు కలవని చెప్పుదురు. జీవాణువాద ములో జైనులొక అద్వైతులగు వేదమతస్థులతోఁదప్ప మిగిలిన వేదమతస్థు

లందఱితోడను గలిసియే యున్నారు. ఈ కారణముచేతఁగూడ జైన మతము హైందవులలో విశేష ప్రజాదరణము పొందఁగల్గినది.

జైన, బౌద్ధములకేమంత హెచ్చు భేదములేదు. బౌద్ధుల అహింసా సిద్ధాంతమును జైనులు మఱింత ప్రాధాన్యముగా స్వీకరించిరి. జైనులు గాలినుండి సూక్ష్మజీవులు లోనికిఁబోయి నశించునని నాసాగ్రముల గుడ్డలతోఁగట్టుకొందురు. దీపములు వెలిగించిన పురుగులు వానిపైనిఁబడి నశించిపోవునని వారు సూర్యాస్తమయమునకుఁబూర్వమే భోజనములు నిర్వర్తించి రాత్రులు దీపములు లేకుండగనే నిద్రింతురు. కాలిక్రిందఁబడి జీవులు నశింపుగాకుండ వారు దారినంతయు మెత్తని నెమలి కుంచెలతో దుడుచుచు నడుచు చుందురు అహింసా సిద్ధాంతాచరణమున నెక్కుడు దీక్ష జూపినదగుట జైనమతము ప్రజామనస్సును సుశీఘ్రముగా మార్పు గల్గించి తనకభిముఖము గావించుకొనఁగల్గినదికూడ.

యజ్ఞాది కర్మకాండను నెంత నిష్ఠగాఁజేసినను చెప్పిన ఫలితములు జరుగకుండుటచేతను, ఎంత ధ్యానముచేసినను ఆత్మసాక్షాత్కార మెవ్వరికిని సిద్ధింపకుండుటచేతను క్రొత్తసిద్ధాంతములపై మోజుపడి కొందఱు, ప్రాఁత మతములో నింకను లోపములెన్ని కొందఱు, వర్ణవ్యవస్థవలన గౌరవ ప్రతిష్ఠలు కోలుపడి కొందఱు, ప్రాఁతరోఁత క్రొత్తవింతయై కొందఱు, తెలిసి కొందఱు, తెలియకకొందఱు, గతానుగతికముగా కొందఱు నిట్లు పెక్కురు హైందవ వేదమతస్థులు స్వమతమువిడిచి జైన మతస్వీకరణముఁగావించిరి. జైనయతుల మతప్రచారము బహుముఖముల మూడు పూవులు ఆరు కాయలుగా వ్యాప్తినంది ఫలవంతమైనది.

ప్రజామనస్సును తమ కనుకూలము గావించుకొని తమ పరిపాలనము సుప్రతిష్ఠితముఁజేసికొనుటకై పెక్కురు చక్రవర్తులు వేదమతమును విడిచి జైనమతమును చేఁబట్టి పోషించిరి. రాజాదరణముతో జైన భిక్షు

వులు పదింతలు ప్రచారము లేవఁదీసిరి. రాజునండఁజూచుకొని క్రమ ముగా జైన భిక్షువు లన్యమత హింసకుఁగూడ సిద్ధమైరి.

రాజుల ఆలంబనము గల్గినప్పటినుండి అహింసా ప్రధానమైన జైనము క్రమముగా మతప్రచార తీవ్రతలో హింసకుఁబూనుకొని వీర రూపముఁదాల్చినది. అసలు సిద్ధాంతములు లోపించినవి. మతమెంత వ్యాప్తియైనది యనునదే ప్రధానముగ ప్రచారము సాగినది. రాజుల రాజ్యవిస్తరణ మీ మతప్రచారముపై నాధారపడినది. ఎంతరాజ్యము సాధింపవలెనన్న అంతగా ప్రజామనస్సు రాజునకు స్వాధీనపడవలెను. ప్రజామనస్సు స్వాధీనపఱచుకొనుటకే ప్రధానముగా మతప్రచారము రాజులు చేపట్టిరి. ముందు మత ప్రవక్తలను పంపి ప్రజాశక్తి వశపఱచు కొని ఆపైని జైన రాజులారాజ్యములపై దాడివెడలి సులభముగా వానిని స్వాధీనపఱచుకొనఁజొచ్చిరి.

ఆంధ్రదేశమున జైనమతము విశేష వ్యాప్తినందగనే జైన చక్రవర్తు లగు పెక్కురు ఇక్ష్వాకులు దక్షిణకోసలము మీదుగా ఆంధ్రదేశము చేరి కొనిరి. సులభముగా నిచ్చటి రాజులను జయించి వారిదేశమును పెక్కేండ్లు పాలించిరి.

ధర్మాశోకుఁడను జైనరాజు 'వజ్రాలదిన్నె' కడ దేవాలయము (అమరావతిస్తూపము) నిర్మించెను.

యశోధరుఁడను జైనరాజు 'ప్రతిపాలపురము' (భట్టిప్రోలు) నిర్మించెను.

'శ్రీపర్వతము', 'సిద్ధవటము' జైన చక్రవర్తులు నిర్మించినవే.

ఇక్ష్వాకవంశీకుఁడు 'ధనదుఁ' డను జైనరాజు ప్రతిపాలపురము రాజధానిగా 'వేంగి' రాజ్యమును బాలించెను.

'కుబేరకుఁ' డను రాజు ధనదుపురము (గుంటూరు మండలము లోని చందవోలు) రాజధానిగా నాంధ్రదేశము నేలెను.

# కా క తి ప్రో ల రా జు

ఋషభనాథతీర్థుఁడను జైనయతి రాజమహేంద్రవరము నుండి అనుమకొండ రాజధానికి వలసపోయి అనుమకొండ రాజ్యము నేలు కాకతి రాజులను జైనమత ప్రవిష్ఠులనుజేసి వారి జైనమత వ్యాప్తికిఁ దాను తోడుపడెను.

కాకతి రాజులలోని పూర్వులు జైనమత ప్రాబల్యము నందఁగాఁ జూచుకొని స్వరాజ్యములను స్థిరపఱచుకొని వృద్ధికిఁదెచ్చిరి.

కాకత్యగుండన, ఆ గుండ్యన వంశమున జనించిన మొదటి బేతరాజు, ఆ బేతరాజు కుమారుఁడు మొదటి ప్రోలరాజు, అతని కుమారుఁడు రెండవ బేతరాజు, వీరందఱు జైన మతస్థులుగనే రాజ్యములు పాలించి జైన మతమును వ్యాప్తికిఁదెచ్చిరి.

రెండవ బేతరాజు తన పూర్వవంశము దలఁచుచు అనుమకొండ నగరమును కాకతిపురమను పేరుతోఁ బాలించెను. ఈతఁడు చాల కాలము జైన మతస్థుఁడుగనే యుండి జైన మతవృద్ధి గావించెను. తన కాలమున నప్పుడే నూతనముగ ప్రచారదశ నందుకొన్న శైవ మతమును గూడ నాతఁడు కాదనక యాదరించి అల్పసంఖ్యాకులగు శైవుల మన్నన లనుగూడఁ బొందగల్గెను.

అంతవరకు జైన మతపాలకుఁడుగనున్న బేతరాజునకు శైవ మతాభిమానము కలుగుచున్నందులకు జైన గురువులు నొచ్చుకొనిరి. జైన యతులు బేతరాజు మనసుఁద్రిప్ప యత్నించి విఫలులైరి. దూరదృష్టిగల బేతరాజునకు భవిష్యత్తు గన్పట్టినది. జైనములోనున్న లోటులు శైవములోఁ దీఱి ముందుకాలమునఁ బ్రజలు శైవమతమును విరివిగా నాదరింపఁగలరను సూచన యాతని మనోనేత్రమునకుఁ బొడఁగట్టి దానిని చేబట్టినాఁడు. 'ప్రజామతం మతం రాజ్ఞః' అనికదా రాజ్యాంగ శాస్త్రము తెలుపుచున్నది! శైవము నాదరించినను బేతరాజు శైవ మతగురువగు రామేశ్వర దీక్షితు

లకు వశపడిపోలేదు. వీరశైవమున కాతని ద్రిప్పఁదలఁచినను ఆతఁడు గురునకు లోబడలేదు. అల్పసంఖ్యాకులగు శైవ మతస్థులనుగూడ నాదరించి వారి యక్కఱలు దీర్చుటకై బేతరాజు పెక్కు శివాలయములు నిర్మించి శైవగణములకై పురములును గట్టించి శైవప్రచారమునకు నాందీ శ్లోకము పలికినాఁడు. రాజధర్మముగా రాజ్యసుస్థిరతను, విస్తరణమును భావించి బేతరాజు శైవ మతాదరణమును కొంత ప్రదర్శించుచు వచ్చినను అతని మనస్సు తన పితృపితామహులు చేపట్టిన జైన విశ్వాసమునుండి పూర్తిగా సడలలేదు.

చిరకాలము బేతరాజునకు సంతానము కలుగకుండుటచేత తమ ఆదిపూర్వ కాకతిరాజు లారాధించిన శైవశక్తిని తానారాధించిన పుత్రుడు కలుగునని యెంచి కూష్మాండినీ అంబిక యను జైనశక్తిని మార్చివైచి శైవశక్తిని ప్రతిష్ఠించి కాకతి శక్తియను పేరున నాపె నారాధించెను. ఆ యారాధనా ఫలితముగా బేతరాజునకు కుమారుఁడుదయించెను. ఆతడె కాకతిప్రోలరాజు.

రెండవ ప్రకరణము.

# హృదయమథనము.

సిద్ధాశ్రమము సిద్ధులకు పార్వతీపరమేశ్వరులు సాక్షాత్కరించిన క్షేత్రమని స్థానికుల విశ్వాసము. అది హనుమద్గిరియని చరిత్రలో ప్రసిద్ధికెక్కియుండెను. తరువాత నది అనుమకొండనగరముగ విలసిల్లి అనుమకొండరాజ్యమునకు రాజధాని యయ్యెను. కృష్ణా, గోదావరీ మధ్య దేశమునఁగల పెక్కు పుణ్యక్షేత్రములలో అనుమకొండ యొకటి. దానికి నైరృతిదిక్కున క్రోశత్రయదూరమున హిడింబాశ్రమము ననుపేరఁ బరఁగిన ముదిగొండ గలదు. హనుమాద్రికి మధ్యభాగమున సిద్ధేశ్వరునిగుడి, పూర్వభాగమున భద్రేశ్వరునిగుడి, దక్షిణమున గోపాలమూర్తిగుడి, పడమరదిశగా పద్మాక్షీదేవిగుడియు గలవు. ఇవన్నియు జైనమతము విస్తరించినంతనే జైనశిల్పములతో, జైన సాంప్రదాయములతో క్రొత్తరూపములను క్రొత్తనామములను ధరించినవి.

హనుమాద్రిని వెలసిన పద్మాక్షీదేవి నేమినాథుఁడను జైన తీర్థంకరునకు నౌపచారికగ నుండిన 'కూష్మాండిని' 'అంబిక' యను పేరులు గల జైనశాసనదేవిగా మాఱిపోయినది, రెండవ ప్రోలరాజువరకు జైనులగు కాకతిరాజులందఱు నీ కూష్మాండినీ అంబిక నారాధించినవారే.

అనుమకొండనగర బాహ్యప్రదేశమునఁ జక్కఁగఁ దీర్చిపెంచిన యుద్యానమొకటి గలదు. ఇది రెండవ బేతరాజుచే నిర్మింపఁజేయఁబడినది. సుందరములగు పొదరిండ్లతో, పుష్పఫలభరితములగు వృక్షములతో, వివిధశకుంతసంతానముతో విశాల జలాశయములతో నాయుద్యానము చూడముచ్చటగనుండును. జైనమతస్థులగు కాకతిరాజులు నాటించిన యుద్యానమది. ఉద్యానవనమధ్యమున నొక గున్నమామిడిచెట్టు కలదు.

డానికంటమునా నొక మాధవీలత యల్లుకొనియున్నది. చెట్టుమొదట చంద్రకాంతశిలావేదిక బహురమ్యముగఁ గట్టఁబడెను.

అనుమకొండనగరమును కాకతిపురమను పేరుతో పాలించిన రెండవ బేతరాజు ప్రతిదినము సాయంసమయమున నా యుద్యానవనమునకు వినోదార్థము వచ్చుచుండును. ఏకాంతమున నొకింతసేపావేదిక మీఁద విశ్రమించును. వేదికకెట్టయెదురుగా దూరమున నగరమందలి *1 కాకతిశక్తి ఆలయము ఎత్తుగా మెట్టపైని కనుపట్టుచుండును. ఈకాకతి ముందు పద్మాక్షి, తరువాత కాకతీయ జైనచక్రవర్తులచే *2 అంబిక యను జైనయక్షిణిగా మార్పఁబడినది. తరువాత బేతరాజు అంబికను కాకతిగా మార్చెను. వేదికపైఁ బద్మాసనస్థుఁడై దేవిని ప్రతిదినము బేతరాజు సాయంకాలము ధ్యానము సల్పుచుండును. సరిగా సూర్యాస్తమయకాలమున కాకతి దేవికి నాలయమున నర్చన మారంభింతురు. అదేసమయమున బేతరాజు ఉద్యానవనమున వేదికపై దేవీధ్యాననిమగ్నుడై యుండును. అచటపూజ నిచట ధ్యానము నొకేసారి యారంభమగును. పూజానంతరము మ్రోగు ఘంటానాదము విని బేతరాజు ధ్యానముద్రవీడి చేతులు శిరమునఁజేర్చి కాకతి శక్తికి నమస్కరించి వెడలిపోవుచుండును.

కాకతి ప్రోలరాజును ప్రతిదినము నాయుద్యానమునకు వచ్చి తన తండ్రివలెనే ధ్యాననిమగ్నుఁడగుచుండును.

ఆది వసంతకాలము. సాయంసమయము. ఉద్యానవన ప్రకృతి బహురమణీయముగనున్నది. గున్నమామిడిచెట్టుపైని కోకిలజంట 'కుహూ' కార మొనర్చుచుండెను. సహకారముతోపాటు మాధవీలతయుఁ బుష్పించినవి. మలయమారుతాహతికి నెడనెడ పూవులు రాలుచున్నవి.

---

*1 కాకతియను రాజుచే ప్రతిష్ఠింపఁబడిన 'శక్తి' దేవత. ఈపెకు 'కాకతి' యని 'కాకతమ్మ' యని వాడుక పేర్లు. కాకతిరాజు సంతతివారగు కాకతీయులకు ఈపె కులదేవత.

*2 అంబిక జైన యక్షిణి. ఈమెకు కూష్మాండినీ శక్తియనియు పేరు.

నాఁడు ప్రోలరాజేదో ఆలోచనానిమగ్నుఁడై యుండెను. అతని ధ్యానము నాఁడు కాకతి చరణములపైని నిలువలేదు. అతని మనమున తాను స్థాపించిన స్వతంత్రరాజ్యము తరతరములు విచ్ఛిత్తి గాకుండుట కాలోచన మెదలఁజొచ్చెను. తన పూర్వులవలె మొదట దానును పశ్చిమ చాళుక్య సామంతుడుగనున్నను ఆఱవ విక్రమాదిత్య చక్రవర్తి యనంతరమున తాను స్వతంత్రుడయ్యెను. అతని హృదయమున కంత మాత్రమున శాంతి గలుగకుండెను. తనరాజ్యము వృద్ధిగావలెను. అపై నది తరతరములు నిలువవలెను. అతని యాకాంక్ష యది. పూర్వ స్వాతంత్ర్యరుధిర మాతనినాడులలో కవోష్ణముగఁ బ్రవహించుచుండుటచే నాఁటికి తాను స్వతంత్రరాజు కాఁగల్గెను. కాని తనవంశ మీ స్వతంత్రరాజ్య మవిచ్ఛిన్నముగ తరతరములు నిలఁబెట్టుకొని పాలింపఁగలదా యను సంశయము బాధింపఁజొచ్చెను. ప్రోలరాజు నాలోచనలు తరంగములవలె వచ్చుచు విచ్చుచున్నవేకాని స్థిరరూపము నొందకుండెను. కాకతిమందిరాలయమునుండి ఘంటానాదము వినఁబడినతోడనే అప్రయత్నముగ రాజు లేచి శిరసున కేలుజోడించి మ్రొక్కెను. అతని మనసు కాకతి ధ్యానమున లేదు. నమస్కారక్రియమాత్రము యాంత్రికముగ జరిగిపోయినది.

ప్రోలరాజు తిరిగి వేదికపై నాసీనుఁడై యాలోచన నుపక్రమించినాఁడు. అతని మనోయవనికపైని కులముపెద్ద లొకరితరువాతనొకరు పొడచూపసాగిరి. ఆదిపురుషుఁడు కాకత్యగుండన యవనికపైని ముందుఁ బ్రవేశించినాఁడు. ఈ గుండ్యనపితృపితామహులు రాష్ట్రకూటులు. నాఁడు గ్రామోద్యోగులకు రాష్ట్రకూటులని పేరు. గుండ్యన రాష్ట్రకూటుఁడుగా గాక రాష్ట్రాధిపతియే కాఁగలిగెను. ఈ గుండ్యన తన పూర్వులవలెనే జైన మతస్థుఁడు. తాను కాకతిరాజు వంశీకుఁడగుటచే రాజరికమందగనే గుండ్యన కాకత్యపదమును తన నామమునకు ముందు ధరించెను. కాకతి రాజులు జైనమతావేశముతో పద్మాక్షీదేవిని జైనయక్షిణియైన కూష్మాండిని (అంబిక) గా మార్చివైచిరి. ఆయాలయమున కెదుట పెక్కు జైనవిగ్రహ

ములను స్థాపించి ఆలయమును జైనసాంప్రదాయమున దిద్దితీర్చిరి. తన పూర్వులవలె గుండ్యన అంబికాజైనయక్షిణికి పరమభక్తుఁడు.

గుండ్యన ముందు తూర్పుచాళుక్యరాజులకు లోఁబడి * నతవాటి సీమను పాలించెను. చాళుక్యరాజు మరణానంతరమున వేంగిదేశమున నల్ల కల్లోలములు బయలుదేఱినసమయముకని పెట్టి గుండ్యన స్వతంత్రుడుగాఁ బ్రకటించుకొని దానిని పాలించెను. ప్రోలరాజు స్వతంత్రకాకతీయ పునస్థాపకులలో నాదిపురుషుఁడగు గుండ్యనకు చేతులుజోడించి నమస్కరించెను. గుండ్యన తరువాత నాస్వతంత్రరాజ్యము నిలువనందులకతడు మిక్కిలి విచారించెను.

పిమ్మట నాతని మనఃఫలకముపైని గుండ్యన వంశమున కొన్ని తరములతరువాత జనించిన తన ముత్తాత బేతరాజు (మొదటిబేతరాజు) కనుపట్టెను. ఈతనికి ఎఱుకదేవరాజను నామాంతరముకూడ కలదు.

ఈతఁడు చాళుక్యరాజగు జయసింహునకు మొదట సేనాధిపతిగా నుండెను. పిమ్మట చోళరాజును జయించుటలో సాయపడి జయసింహునిచే సామంతునిగా స్వీకరింపఁబడి కొఱవిదేశము సబ్బిమండలమును బాలించెను. బేతరాజు సామంతుఁడుగా అస్వతంత్రుఁడైనను ఆతని పరాక్రమగాథలు ప్రోలరాజు మనసు నుత్తేజపఱచెను.

తరువాత తన తాత మొదటిప్రోలరాజాతని మనోవీథిని విహరించినాఁడు. మొదటిప్రోలరాజు పశ్చిమ చాళుక్యప్రభువగు మొదటి సోమేశ్వరునకు సామంతుఁడై అతనినుండి అనుమకొండరాజ్యమును పొంది కాకతివల్లభుఁడని పేరుమ్రోగినాఁడు. భువనైకరాయఁడు, భువనైకమల్లుఁడు నను అన్వర్థనామములు ధరించినాఁడు. ఈతని సేనాని రేచర్లవంశీకుఁడగు బమ్మిరెడ్డి. ఈ బమ్మసేనాని చోళరాజును జయించి కాంచీనగరకవాట

* వరంగల్లుజిల్లాయందలి మధిరతాలూకా.

మును దెచ్చి కాకతివల్లభుఁడగు ప్రోలరాజునకు విజయలక్ష్మిని వివాహము గావించినాఁడు. ప్రోలరాజు గోదావరికుత్తరభాగమున రాజ్యము సంపాదించి స్వపరిపాలనము విస్తరింపఁజేసెను. రాజ్యవిస్తరణము గావించిన తన పేరింటివాఁడగు తాతకు ప్రోలరాజు శిరమువంచి చేతులు జోడించెను.

పిమ్మట తన తండ్రి రెండవబేతరాజు ప్రోలరాజు హృదయపీఠము నధిష్ఠించెను. క్రొత్తగా సంపాదించిన రాజ్యమునందు ప్రశాంతపరిస్థితు లేర్పడకుండఁగనే తన తాత మరణించినాఁడు. చిన్నవయసువాఁడగుట తన తండ్రి శత్రుమధ్యనుండి రాజ్యము నిలఁద్రొక్కలేకపోయెను.

శత్రువులు నలువైపులముట్టడించి రాజ్యమాక్రమించుకొని బేతరాజును పదభ్రష్టునిఁజేసిరి. ఆ యాపత్సమయమున బేతరాజునకు మేనత్త భర్తయు చోడరాజవంశస్థుఁడును కరికాలచోడుని సంతతివాఁడును * దుర్జయకులాభరణుఁడును విరియాలగోత్రీకుఁడునగు ఎఱ్ఱభూపతి పెద్దప్రాయమువాఁడై శత్రునిర్జితుఁడైన బేతరాజును జేరఁదీసి, ఆశ్రయమిచ్చుటేగాక శత్రువులనెల్ల నిర్జించి తిరిగి కొలువిసింహాసనమునఁ బ్రతిష్ఠించి స్వామిభక్తి ప్రభావముగ బ్రకటించినాఁడు. ఎఱ్ఱభూపతి యనంతరము తిరిగి శత్రువులావరింప అతని భార్య కామసానమ్మ వారి నెదుర్కొనినది. ఆమె సాహసవంతురాలు. మహాశక్తివలె విజృంభించి స్వయముగ యుద్ధరంగమున శత్రువులకు ప్రళయతాండవము సలిపినది. శత్రువులగు కాదవనాయకులను, భాస్కరచక్రవర్తిని కాలరాచివైచి మేనల్లుఁడగు బేతరాజును తిరిగి కాకతివల్లభునిఁజేసి రాజ్యము వశపఱచినది. సంతతిలేకుండుటచే తమరాజ్యమును బేతరాజునకొసఁగి పుత్రునిగ భావించినది.

పిమ్మట బేతరాజు శత్రురాజులను నిర్జించి 'చలమర్తిగండ' బిరుదమును సంపాదించెను. తన్నంత ప్రేమించి పాలించిన ఎఱ్ఱన కామసానులకు బేతరాజు పుత్రుఁడుగ నేర్పడి వారికిఁగూడ వంశకర్తయై పితృఋణము

* దుర్జయుఁడను రాజు ఈవంశమున పుట్టుటచే దుర్జయకులమను పేరు వచ్చెను.

దీర్చెను. కాకతి దుర్జయవంశముల రెండిటికి తానే యుద్ధారకుఁడై బేతరాజు * ద్వ్యాముష్యాయణుఁడయ్యెను.

వంశవిచ్ఛిత్తి గాకుండ అడ్డుపడి తన తండ్రి కాశ్రయమిచ్చి రక్షించిన ఎఱ్ఱన కామసానులకు ప్రోలరాజు చేమోడ్చి కృతజ్ఞత నెఱపెను.

బేతరాజు జైనచక్రవర్తియైనను పెక్కు శివాలయములు గట్టించి వర్ణాశ్రమాచారములు పాలించి శైవమునుగూడ నాదరించెను. తమ పూర్వ దేవతయగు కాకతిశక్తిని తిరిగిప్రతిష్ఠించి పూర్వరాజుల ప్రతిష్ఠ నిలిపెను. 'మహామండలేశ్వర, అనుమకొండ పురవరేశ్వర, పరమమాహేశ్వరాచార' అను బిరుదములతో మొదట స్వతంత్రుఁడుగనే రాజ్యము పాలించెను, తరువాత త్రిభువనమల్ల విక్రమాదిత్యునకు సామంతుఁడు కావలసివచ్చినది. సామంతుఁడుగనున్నను చాల స్వతంత్రుఁడుగనే యాతఁడు వ్యవహరించెను. అప్పుడే అతడు అంబికకు కులదైవమగు కాకతిపేరును రాజధానికి కాకతిపురము అను నామమునిడి తాను కాకతిపురాధినాధుఁడని పేరు మోసెను.

విక్రమాదిత్యుని కాలమున చాళుక్య సామ్రాజ్యము విజృంభించి కళ్యాణినుండి వేంగిదేశము వరకు వ్యాపించెను. ఆ చాళుక్య విజృంభణమునకు నడుమనుండుటచే కాకతిరాజ్య మడ్డువచ్చెను. చాళుక్యరాజు బహు బలవంతుఁడు. అతని సేనావాహిని పొంగులువారి వచ్చుచున్నది. ఎదిర్చిన కాకతిరాజ్యము నాశనమగుటతప్ప ప్రయోజనములేదు. ఈసందర్భమున బేతరాజు దూరమాలోచించినాఁడు. తన మంత్రియగు వైజదండనాధుని సంధానకర్తఁజేసి త్రిభువనమల్లుని శరణుజొచ్చినాఁడు. పిమ్మట నాతని యనుగ్రహమువడసి సహస్రగ్రామపరిమితమగు సబ్బిమండలము బహుమతిగఁ బడయుటయేకాక ఆతనికున్న త్రిభువనమల్ల బిరుదమునుగూడ వహించినాఁడు.

---

* రెండు వంశములకు ప్రవర్తకుఁడు.

తనవంశీకు లందఱిలోను స్వతంత్రరాజ్యస్థాపన మేదోవిధముగ జరుగుచునేవచ్చినను అవిచ్ఛిన్నముగ మాత్రము నిలబడలేకపోవుట కెంతయు ప్రోలరాజు చింతించెను. తమ మూలపురుషుడగు గుండ్యనతో ప్రారంభమైన కాకతీయరాజ్య పునస్సంస్థాపనాకాంక్ష తన తండ్రికాలమునకు గొంత రూపస్థాయికి వచ్చినది. కాని యింతలో విచ్ఛిత్తిగలిగినది. తాను ఇక విచ్ఛిత్తిలేని రాజ్యమును తరతరముల స్థాపించవలెను. అదియే తన జీవితాకాంక్ష. గుండ్యనతోనే యావిర్భవించిన కోరిక యింతవరకు రూపుతాల్పకుండుటకు అవరోధమేమైయుండునా యని యూహాపోహలు చేసెను. లౌకికపరిస్థితులు కొన్ని కారణములుగా పైకి గోచరించుచుండవేమో దైవికమగు నవరోధముండియే తీరవలెనని యాతడు దృఢముగా విశ్వసించెను. తన తాత భువనైకరాయడు, తండ్రి త్రిభువనైకరాయడు నను బిరుదులు వహించిరి. తనవంశములో నీబిరుదనామము అవిచ్ఛిన్నముగ దాల్పబడవలెనని అతడు కాంక్షించినాడు.

తాను తండ్రివలెనే జైన, శైవ మతములకు మద్దతుగానున్నాడు. తండ్రికున్నంత జైనమతవిశ్వాసము, శైవమతవిశ్వాసమునుగూడ తనలో లేవు. తన తండ్రివరకు అందఱు జైనచక్రవర్తులే. తానును కొంతవరకు జైనచక్రవర్తియే. కాని జైనములోగల తాంత్రికములు, బ్రాహ్మణమంత్రములకు సాటిగావని యాతనికి దరువాత దోచినది. జగత్సర్వము దైవాధీనము, దైవము మంత్రాధీనము, మంత్రము బ్రాహ్మణాధీనము కాన బ్రాహ్మణశక్తి యనల్పమని యాతడు తలపోసెను.

తనకువలెనే నాటిప్రజలకుగూడ జైనమతవిశ్వాసము సన్నసన్నగా సడలజొచ్చినదికూడ. అప్పటికే వీరశైవ, వీరవైష్ణవ మతములు వ్యాప్తిలోనికివచ్చుచున్నవి. జైనములోవలెనే వీరశైవమునను కులభేదరాహిత్యము ప్రవేశపెట్టబడినది. పెక్కు ఉన్నత * ప్రభుకుటుంబములు వీరశైవ

* జైనమువీడి వీరు వీరశైవమునఁ బ్రవేశించినపుడును వైదికప్రజలు చతుర్థకులజులుగ ఈ అగ్రకులజులను గ్రహించిరి.

మున నప్పుడే ప్రవేశించినవి. అమరావతీప్రాంతమున కోటవంశజులు, మడపల్లెయందు నతనాటిరాజులు, బుద్ధవర్మవంశస్థులు, దుర్జయకులస్థులు, చోళరాజులు, కొండపడమటిరాజులు; గుడిమెట్టయందలి చాగివంశజులు, పెక్కురు నందుఁ బ్రవేశమునొందిరి. వీరందఱు తమ కాకతిరాజులతో ప్రముఖబాంధవ్యముగల రాజప్రముఖులే. ఇఁక తానుమాత్రమేల జైనము నకుఁ గట్టుపడియుండవలెను? ప్రోలరాజు మనమున ప్రశ్నపరంపర యుదయించెను.

తనకు ఏమతమైన నొక్కటే. తనవంశ మవిచ్ఛిన్నముగ స్వతంత్ర రాజ్యమును బాలింపవలె నంతేతనకుఁగావలసినది. అందులకు వేదమత మందలి మంత్రబలము, దేవతాప్రసాదమును సంపాదించుట కాతఁ డుద్దేశించెను. అందులకై తాను చేయవలసినదేమి? అతఁడట్టె యాకాశము వైపు దృష్టి సారించి యాలోచనమున కుపక్రమించెను. ఆతని తలఁపునకు రామారణ్య శ్రీపాదులవారు తగిలిరి. వారి నాశ్రయించి తన యుద్దేశ మును నెఱవేర్చుకొనుట కాతఁడు నిశ్చయించెను.

అప్పటికే జాము రాత్రి గడచినది. ప్రభువంతకాల మెప్పుడు నా వేదికపైనిఁ గూర్చుండియుండలేదు. అతఁడావేదికపై నాసీనుఁడైనంత పరిజను లెవ్వరాప్రాంతమున నుండరు. వారీవలావల ప్రభునిరాకకై కనిపెట్టుకొనియుందురు. నాఁడంతయాలస్యమగుట కందఱును వింతపడిరి.

ప్రోలరాజు వేదిక దిగినంతనే పరిజను లిటనటనుండి వచ్చి చేతులుకట్టుకొని సమీపమున నిలఁబడిరి. అందఱిని కనుసన్నల నాదరించి చేసంజ్ఞల సెలవొసంగి అశ్వారూఢుఁడై రాజు మందిరమునకుఁ జేరుకొనెను.

మూఁడవ ప్రకరణము.

# గురుప్రసాదము.

ప్రోలరాజేంద్రునకు రాత్రి నిద్దురపట్టలేదు. హృదయమేదో బరువు మోయుచున్నట్లుండెను. ఆబరువేదో దానిని దింపుకొను తెరువేదో అతనికిఁ దోఁచకుండెను. అడపతడప నొక కునుకుపట్టినదే కాని పట్టినకునుకులో సుఖములేదు. ఎదుట చీఁకటి, చీఁకటివెనుక జ్యోతి మనసునఁ గానిపించెను. ఎదుటి చీఁకటియే దైవమేర్పఱచిన ప్రతిబంధకము. దాని వెనుక కనుపడు జ్యోతియే కానున్న అవిచ్ఛిన్నరాజ్య ప్రతిష్ఠాపనము. ఎదుటిచీఁకటి పోఁగొట్టుటకు చేతికొక కరదీపిక కావలెను. ఇట్లాలోచించుకొనునంతలోనే ఆతని స్మృతిపథమున కాళేశ్వర నివాసులైన రామారణ్య శ్రీపాదులవారు మెలఁగిరి. శ్రీపాదులవారే చీఁకటి పోఁగొట్టు కరదీపికయని ప్రోలరాజు భావించెను. అతనికాజ్యోతి మినుకుమినుకుమని చీఁకటిని భేదించుచున్నట్లు దోఁచెను.

తెల్లవారుజామైనది. రాజు త్వరపడి కాల్యములఁదీర్చి సుస్నాతుఁడై వినీతవేషము ధరించి ధవళాశ్వమునెక్కి తూర్పుదిశగా సరణ్యమువైపు పయనించెను.

రాజు శ్రీపాదులవారి యాశ్రమము చేరుకొనునప్పటికి జాము పొద్దుండెను. అప్పుడే వారు శిష్యులకు వేదరహస్యముల విప్పిచెప్పుట కుపక్రమించిరి.

రాజునుగాంచి శిష్యులు ప్రక్కలకొదిగిరి. వచ్చుచునే ప్రోలరాజు శ్రీపాదులవారి పాదములు పట్టుకొని 'ప్రోలరాజు అభివాదనము చేయు చున్నాఁడు' అని పలికి నమస్కరించి వినయవినమితగాత్రుఁడై నిలఁబడెను.

శ్రీపాదులవారాతనిని కడగంటఁ జూచి 'ఆచంద్రార్క వంశాభివృద్ధిరస్తు, అవిచ్ఛిన్నరాజ్యపాలనాప్రాప్తిరస్తు' అని చేయెత్తి దీవించి కూర్చుండుమని యాసనముఁ జూపెను. వ్యగ్రమనస్కుఁడగు ప్రోలరాజునకాదీవెన లమృతమువలె నుత్సాహముఁ గల్పించెను. రాజు వ్యగ్రమనస్కుఁడైయుండుట నారసి తత్కారణ మేకాంతమున నారయఁదలఁచి "నేఁడు శిష్యాధ్యయనము మీరు వెడలవచ్చు" నని పలికి గురువు శిష్యులను బంపివైచెను. శిష్యు లధ్యయన విఘ్నమునకు నొచ్చుకొనుచు నిష్క్రమించిరి.

ప్రోలరాజు తాను జైనమతస్థుఁడగుట తన్ను రామారణ్యులవారంతగా నాదరింతురని తలంపలేదు. వారి కరుణారసదృష్టి యాతని కపారభక్తిభావము కలిగించినది. కాని స్వేచ్ఛగ తన మనోభావమును వెల్లడించుటకు తన జైనమింకను తనకు ప్రతిబంధకమగుచున్నట్లు భావించి యాతఁడు కళవళపడెను. దీక్షితులవారాకళవళిక గ్రహించి కన్నులుమూసి ధ్యానములో రాజు మనోగతమెఱిఁగి 'రాజా! నీచిత్తము స్థిమితమగుగాక! నీకు వచ్చినభయములేదు, నీ మనోగత మెఱిఁగితిని. నీకోరిక సిద్ధింపఁగలదు. కొంచెము దైవికమగు ప్రతిబంధకసామగ్రి యున్నది' అని పలికెను.

ప్రోలరాజు వదనము వికసించెను. ఆశ్చర్యముతో మనసు ఆనందపడెను. మఱొకసారి శ్రీపాదులవారి పాదస్పర్శ చేయుటదప్ప నాతనికి కృతజ్ఞత దెలుపుటకు మఱొకసాధనము కనుపడలేదు. ఆ పాదాభివందనములో నాతని కనులనుండి జాఱిన రెండు బాష్పబిందువులు గురుపాదముల కభిషేకక్రియనుగూడ నెఱపెను. చల్లగదాఁకిన యయ్యశ్రు బిందువులు రెండును శ్రీపాదులవారి హృదయమునుండి గట్టుతెగిన కరుణాస్రవంతి నుబికించినవి. దివ్యదృష్టికి రాజమనోగత మద్దమునగోచరించినట్లు వారికి గోచరించెను.

రాజేమియు పలుకకుండఁగనే శ్రీపాదులవారిట్లు తిరిగి పలికిరి. "రాజా! ఇఁకనీవేమియుఁ జెప్పుకొననక్కఱలేదు. నీయదృష్టము పంటముఖ మునకు వచ్చినది. మాహృదయ మింతగ నెప్పుడును ద్రవింపలేదు. ఇఁక నీకోరిక నెఱవేరకతప్పదు. దైవము మాహృదయము నిట్లు ప్రేరేపణము గావించినాఁడు. ఇఁక భయములేదు. మీది క్రమురాజవంశము. అది పురాణ ప్రసిద్ధమైనది. బ్రహ్మ వాయు మార్కండేయాది మహాపురాణములలోను, సౌర్యాసాది ఉపపురాణములలోను మీకమ్రవంశచరిత్ర తెలుపఁబడి సుప్ర సిద్ధమైయున్నది. మీపెద్దలు పెక్కురు స్వమతమువీడి జైనమతప్రవిష్ఠులై యున్నకారణమున మీవంశ ప్రాచీనచరిత్రను మీవారు విస్మరించినారు. జైన మతస్థులు హైందవపురాణముల నాదరింపకపోవుటచే నవి వ్యాప్తినుండి తప్పిపోయినవికూడ. మీకుల ముత్తమోత్తమమైన కమ్రరాజవంశమందుఁ బుట్టిన కాకతీయకులము. అర్ధకాముల శాప మాసన్నమై మీ రాజవంశము ప్రచ్ఛన్నమైనది. అయినను మీకుల మూలపురుషుఁడగు కాకతిరాజు కృత యుగముననే కావించిన ఋషిసవనసత్కర్మమునకు ఫలిత మిప్పుడే ఫల దశకు వచ్చుచున్నది. అన్ని కర్మములఫలము ననుభవింపవలసినదే. ఏది బలవత్తరమైన యాకర్మఫలమును ముందనుభవింపవలసియున్నది. అర్ధ కాముల శాపఫలమును కొంత ముందునకునెట్టి సప్తర్షుల అనుగ్రహఫలము తోసికొనుచు వచ్చుచున్నది. మీ ముత్తాత (మొదటి) బేతరాజుకాలముననే ఋషిసవనఫల మారంభమైయున్నది. సప్తర్షులలో మొదటివాఁడగు కశ్య పుఁడు నీ ప్రపితామహునిపై తన ప్రభావమును ప్రసరింపఁజేసినాఁడు. కశ్యపుఁ డుజ్జ్వల ప్రతిభావంతుఁడే. ఆతనిప్రభావ మద్భుతఫలము నీయ వలసినదే. కాని మొదటి బేతరాజు మొదలుకొని నీతండ్రివరకు మీవారు జైనులై బ్రాహ్మణావమానమునకును హింసకును బూనుకొనినారు. నీతండ్రి వేదమతము నాదరించి కొంతదృష్టి మరల్చుకొనెను. కాని పైతరముల వారందఱు తీవ్రముగా వేదబ్రాహ్మణ విరుద్ధవర్తనులగు జైనమతస్థులే.

అందుచే వారు ఋషులనుండి వచ్చు అనుగ్రహప్రభావమును తమవైపున కాకర్షించుకొనలేకపోయిరి, ఇప్పుడు భరద్వాజముని ప్రభావము నీపైఁ బ్రసరింపనున్నది. భరద్వాజుఁ డఖండ ప్రతిభాసంపన్నుఁడు. ఆతనిప్రభావము నీవెంతగా నాకర్షించుకొనఁగలిగిన నంతటియభివృద్ధి నీకొనఁగూడఁ గలదు. నీహృదయములోని కోరిక సఫలమునుగాగలదు.'' అని యెడఁద నుబికిన కరుణాస్రవంతి కనుల నుడులుదిరుగ నుడివెను.

ప్రోలరాజున కానందము పట్టరాకుండెను. అంతకంత కాశ్చర్య మధికము కాఁజొచ్చెను. తానేమియు మాటలాడకుండనే తావచ్చినపని జరిగిపోవుచుండెను. ఒక్కింత మనసు స్థిమితముచేసికొని ఆనందపార వశ్యమునుండి తేఱుకొని ప్రోలరాజు కృతజ్ఞతాభావముతో అంజలిబద్ధుఁడై 'మహర్షి చంద్రా! మీకు నేనేకాదు, రాఁబోవు మాతరములవారందఱు కృతజ్ఞత చూపకతప్పదు. నామనసు మీ వాగ్దానముతో నిప్పుడు కుదుటఁ బడినది. మీ మాటలు అమృతంపుతేటలైనవి. మీరు నేఁటినుండి నాకు గురుదేవులు. ఈశిష్యుని దిద్దితీర్చు భారముమీదే. మీ యడుగుజాడలలో నడుచుకొనువాఁడను. మీప్రసంగము వినినంత మీవలన మావంశచరిత్ర మొదటినుండి తెలిసికొనవలెనను వాంఛ ప్రబలమైనది. స్వతంత్రరాజ్య స్థాపనమునకు ఏదో దైవప్రతిబంధకముండునని తలంచియే మీశరణముఁ గోరివచ్చితిని. అర్థకాముల శాపమంటిరే? అవృత్తాంతమేమి? సప్తర్షుల యనుగ్రహము కలదంటిరి. అప్పుడే యది ఆరంభమై పనిచేయుచుండెనని సెలవిచ్చితిరి. ఆచరిత్ర యెట్టిది? సర్వము సవిస్తరముగఁ దెలుప నీ మీ ఛాత్రుఁడు వేఁడుకొనుచున్నాఁడు. అనుగ్రహింపరే!' అని ప్రార్థించి మూఁడవమాఱు మఱల పాదస్పర్శఁజేసి కన్నులకద్దుకొనెను.

రామారణ్యశ్రీపాదులవారు ప్రోలరాజు వెన్నునిమిరి 'బిడ్డా! నిన్ను శిష్యునిగా స్వీకరించుచున్నాను. ఇదే విభూతిధారణము సేయించు

చున్నాను.' అని ప్రక్కనున్న మారేడుకాయబుఱ్ఱ నందుకొని యందున్న తెల్లని భస్మముఁదీసి రాజునుదుట నడ్డముగఁ ద్రిపుండ్రములు దీర్చెను. జలకుండిక నందుకొని నీరు చేతిలోఁబోసి ఆచమింపఁజేసి గాయత్రితోఁగూడ పంచాక్షరీమంత్ర మువదేశించి ముమ్మారుచ్చరింపఁజేసి నిత్యపునశ్చరణ విధానము బోధించి శివదీక్ష నొసంగెను.

ప్రోలరాజు మనసు శుద్ధపఱచుకొని జైనమును మనసునుండి పూర్తిగాఁ ద్రెంచిపాఱవైచినట్లు భావించుకొని బ్రాహ్మణమతమును స్వీక రించెను. గురుచరణములే స్మరించుచు అష్టోత్తర శతపర్యాయములు గురు సన్నిధిని మంత్రము పునశ్చరణమొనర్చెను.

జపానంతర మొకింతకాలము గురుశిష్యులు మౌనమువహించిరి. ప్రశాంతచిత్తమున శిష్యుండు శ్రవణముసేయ గురుం డిట్లుపన్యసించెను.

'వత్సా ! మీవంశము బహుపురాతనచరిత్ర గల అత్యర్కేందువంశ ము. సూర్యునుండి యుత్పన్నమైన మీకులము కాలకర్మవశమున తిమిర ముచే నావరింపఁబడవలసివచ్చినది. సూర్యుఁడెక్కడ? తిమిరావరణ మెక్కడ? కాలము, కర్మము అంతబలీయములైనవి. ఎంతవారికి నవి దురతిక్రమములు. కలియుగమున మీవంశము అర్థకాముల శాపమున ప్రచ్ఛన్నము కావలసిన కర్మవిధి యున్నది. మహాపద్మనందుని కాలమున ఆకర్మవిధి కనుబడదశ ప్రారంభమైనది. అప్పటినుండి క్షత్రధర్మమణఁగి నది. క్షత్రియధర్మ మస్తమింప శాపము నర్థకాము లొసంగియుండుటచేతనే మీ క్షత్రియవంశముల మహాపద్మనందుఁడు శూద్రవంశములుగఁ జేయు టయు తటస్థించినది. "వేదబ్రాహ్మణావమానము మీ కులప్రతిష్ఠ తగ్గిం చును. జాగ్రత్తవహింపుఁ" డని వశిష్ఠుఁడు మున్ను మీ కులపురుషుఁడగు కాకతిరాజునకు హెచ్చరికజేసియే యున్నాఁడు. మీరదియెఱుఁగక కొఱవితోఁ దలగోకికొనినారు, అయిన నింకను మీకు ఋష్యనుగ్రహము పూర్ణముగఁ

గలదు. మీరాకర్షించుకొనుకొలఁది యది యనంతముగ ఫలింపఁగలదు. కాన నీవు భయపడవలసిన పనిలేదు. ఋష్యనుగ్రహమును నీవాకర్షించుకొను విధానము నేను నీ కుపదేశించెదను.

దౌర్వాస, మార్కండేయపురాణోక్తమగు మీ కర్మ కాకతిరాజు వంశవృత్తాంతమును దెలుపుచున్నాను. సావధానుఁడవై వినుము. అని రామారణ్యులొకింతసేపు పురాణోక్తవిషయములను స్మృతికిఁదెచ్చుకొనుటకు మౌనమును వహించిరి.

నాల్గవ ప్రకరణము.

# అత్యర్కేందు కులస్థులు.

ప్రోలరాజు గురుని ముఖమున దృష్టినిలిపి సావధానుఁడై తమ పూర్వకథ వినుటకు కుతూహలము ప్రకటించెను. రామారణ్య శ్రీపాదు లిట్లు చెప్పనారంభించిరి.

"వత్సా! సూర్యభగవానునకు వైవస్వత మనువు జన్మించెను. అతనికి 'ఇక్ష్వాకుఁడు, నృగుఁడు, శర్యాతి, కరూశకుఁడు, అరిష్యంతుఁడు, నాభాగుఁడు, పృషధ్రుఁడు, ధృష్టుఁడు' అను నెనుమండ్రు కుమారు లుదయించిరి. ఈ యెనుమండ్రతోఁ దృప్తిపడక మనువు వీరందఱికన్న విశిష్టుఁడగు మఱియొకపుత్రునిఁ బడయఁగోరి 'మిత్రావరుణేష్టి' యను యజ్ఞమును గావించెను. మనుపత్నియగు శ్రద్ధాదేవి యజ్ఞకాలములో 'కొడుకుగాదు, కూఁతురుకావలెను' అని హోతను (యజ్ఞకుండమున వ్రేల్చు వానిని) వేఁడుకొనెను. ఆమెకోరికను మన్నించి హోత వారికి కూఁతురు కావలెనని ధ్యానించి హోమముఁ గావించెను. ఆయ్యజ్ఞఫలముగ వారికిఁ 'ఇళ' యను పుత్రిక జన్మించెను.

కొడుకును గోరిన మనువు కూఁతురుగలుగుటకు శోకంచి క్షీవడి యజ్ఞ దేవతలగు మిత్రావరుణులను బ్రార్థించెను. మిత్రావరుణులు మనువుపైనిఁ గరుణవహించి యాకన్నెను పురుషుని గావించిరి. మనువాతనికి సుద్యుమ్నుఁ డని పేరు పెట్టెను.

సుద్యుమ్నుఁ డొకనాఁడు వేఁటకువెళ్ళి కుమారవనంబు ప్రవేశించి నంతనే యాఁడుదిగా మారిపోయెను. కుమారవనంబున పార్వతీపరమే శ్వరులు క్రీడించుచుందురు. ఒకప్పుడు కొందరు మునులు కుమారవనంబు

నకు పరమశివుని దర్శింపవచ్చిరి. వివస్త్రయైయున్న పార్వతి దూరముననే వారింజూచి లజ్జితయై మహాదేవుని యంకతలమునుండి తటాలున లేచి పోయెను. ఆసమయమున వచ్చితిమని మునులు స్వాపరాధమును గుర్తించి వచ్చినదారినే వెడలిపోయిరి. అప్పటినుండి శివుఁడు పార్వతికి ప్రియమ్ము సేయుటకై కుమారవనంబున బురుషులెవ్వరేని నడుగిడిన నాఁడురూపముఁ దాల్తురని శాపంబిచ్చెను. సుద్యుమ్నుఁడు శివశాపంబు నెఱుంగక యందుఁ బోవుటచే వెంటనే యాఁడుదియయ్యెను.

ఆఁడురూపమునకు ఖిన్నపడి సుద్యుమ్నుఁ డింటికిఁబోక కుమార వనమువాటి దూరముగా వనముల సంచరింపసాగెను. అంత చంద్రుని కుమారుఁడగు బుధుఁ డయ్యటవిలో నొకచో నతిలావణ్యవతియగు నాపెను గాంచి కామించి గాంధర్వవిధిని పరిణయమై స్వగృహమునకుఁ దోడ్కొని పోయెను. కొంతకాలమునకు వారికొక పుత్రుఁడుదయించెను. అతఁడే పురూరవుఁడు. చంద్రపౌత్రుఁడగు నీ పురూరవుఁడే చంద్రవంశమునకు మూలపురుషుఁడు.

పూర్వమందొకటిగనేయున్న అగ్నిని పురూరవచక్రవర్తి ఆవహ నీయము, దక్షిణాగ్ని, గార్హపత్యము నని మూఁడుగా భాగించెను. అగ్ని త్రివావిభక్తమైనందున నాకాలమునకు త్రేతాయుగమని పేరువచ్చెను. ఈవిధముగా పురూరవచక్రవర్తి యుగప్రవర్తకుఁడయ్యెను.

కొంతకాలమునకుఁ బిమ్మట ఆఁడురూపముననున్న సుద్యుమ్నుఁడు తొల్లిగావించిన అశ్వమేధాది యజ్ఞఫలముచేతను, ఈశ్వరానుగ్రహము చేతను తిరిగి పురుషుఁడుగా మారెను. పురుషుఁడుగా సుద్యుమ్నుఁడు సూర్యపౌత్రుఁడుగాన సూర్యవంశ్యుఁడు. అప్పటి యాతని సంతానము సూర్యవంశమునకుఁ జెందినదే. ఇఁక స్త్రీగా మాఱినప్పుడు చంద్రపుత్రుని బుధుని పెండ్లియాడుటచే నాతనివలనఁ గన్న పురూరవుఁడు చంద్రవంశము

ఏకుఁ జెందినవాఁడు. సుద్యుమ్నుఁడు సూర్యవంశమునుండి అతిక్రమించి చంద్రవంశమునకును ప్రవర్తకుఁడైనాఁడు.

చంద్రవంశ మూలపురుషుఁడగు పురూరవచక్రవర్తి ధర్మము నాల్గుపాదముల నిలువ రాజ్యమును పాలించెను. ఒకప్పుడాతనియొద్దకు ధర్మార్థకామములను పురుషార్థత్రయము మూర్తిరూపములను ధరించి వచ్చిరి. పురూరవుఁడాముగ్గుర నమితక్షేమ నాదరించెను. అందులో ధర్మునకొక్కింత గౌరవాధిక్యము నెఱపెను. అందువలన అర్థకామము లిరువురు కినిసి ఈర్ష్యాపరవశులైరి. వారు 'నీవంశమువారు క్షత్రధర్మము విడిచి కృషిపాశుపాల్యములచే జీవింతురు' అని పురూరవుని శపించిరి. తనకొసంగిన గౌరవమునకు సహింపక అన్యాయముగా రాజును శపించుటను విచారించి ధర్ముఁడు 'కలియుగమునమాత్రమే నీవంశమున నీశాపము వర్తించును. మహాపద్మనందుఁడు మీ క్షత్రియకులములను శూద్రకులములనుగా జేయును. క్షత్రియనామము వహింపకున్నను నీవంశము క్షత్రియ కృత్యముమాత్రము విడువదు. మీవంశమున రుద్రుండనువాఁడు మహా ప్రతాపవంతుఁడుదయించును' అని స్వశక్తిచే శాపప్రభావమును కొంతవరకుఁ దగ్గించి సాంత్వవచనములఁ బురూరవు ననునయించెను.

మఱికొంతకాలమునకు పురూరవుఁడు భరతముని శాపమువలన భూలోకమున జనించిన ఊర్వశిని పరిణయమయ్యెను. వారిరువురకుఁ బుట్టినవారిలో 'అయుఁ' డనువాఁ డగ్రజుఁడు, వంశకరుఁడు నయ్యెను. ఈ అయునిపిమ్మట నాతని వంశజులందఱు నాయులని పేరువహించిరి.

అయుని వంశముగాన అయవంశము. అయశబ్దమునకు శుభమని కూడ అర్థమున్నది. శుభమైన అయవంశమను నర్థమున అయఅయవంశ మనుపేరు వారి కులమునకును, అయఅయదేశమని వారు పాలించు దేశమునకును నామములు వ్యవహారమున స్థిరపడినవి. ఈ అయఅయ పదమే 'హైహయ' గా రూపాంతర మందినది.

హైహయ వంశమున జన్మించిన కార్తవీర్యార్జునుఁడు జమదగ్ని యాశ్రమముఁ బ్రవేశించి హోమధేనువును హరించి జమదగ్నిని సంహరించెను. జమదగ్ని మహాముని భార్య రేణుకాదేవి మహాపతివ్రత. భర్తను చంపిన కార్తవీర్యుని సంహరించుటకు కుమారుఁడగు పరశురాముని నియోగించిన దామె.

పరశురాముఁడు కార్తవీర్యుని సహస్రబాహువుల ఖండించుటయే కాక క్షత్రియుఁడగు కార్తవీర్యునిపైఁగల పగచే ముయ్యేఁడు మాఱులు క్షత్రియ సంహారమొనర్చెను. పిమ్మట రేణుకాదేవి మహాశక్తియై వెలసినది.

రేణుకాదేవి కోపముననే తమవంశస్థులు హతులగుటచే నామెను శాంతింపఁజేయుటకై హతశేషులగు హైహయ వంశస్థులు రేణుకను కుల దేవతగా స్వీకరించి పూజింపసాగిరి. నాఁటినుండి రేణుకాదేవి యనుగ్రహము వారిమీఁద ప్రసరించి, వారి వంశములు నిలిచినవి.

అయునకు నహుషుఁడు, క్షత్రవృఁడు, రజి, రంభుఁడు, అనేనసుఁడు (విపాప్మ) అను నైదుగురు పుత్రులు జనించిరి.

అయుని పుత్రులలో రజియను వాఁడత్యంతబలుండు, మహాశూరుండును. అకాలంబున దేవాసురుల మధ్య భయంకరమగు యుద్ధ మొకటి జరిగెను. రాక్షస భయంబున నింద్రుఁడు దేవతలతో భూలోకమునకు వచ్చి రజిరాజు నాశ్రయించి 'రాక్షసులఁ జంపి రక్షింపు' మని వేఁడుకొనెను. దేవాసురులకు జరిగిన పండ్రెండు యుద్ధములలో నిది యాఖరుది. "స్వర్గరాజ్యమును నీవేయేలుకొనవచ్చును. రాక్షసులను జయించుట నాకు కావలసినది" అని యింద్రుఁడు రజిరాజునకు యుద్ధానంతర మింద్ర పదమొసంగుట కొప్పుకొని యుద్ధమునకుఁ బురి యెక్కించెను. రజియును జయానంతర మింద్రపద మధిష్ఠింపవచ్చునను నుత్సాహముతో మహాసైన్యమును దీసికొని రాక్షసులతో యుద్ధముఁగావించి వారిని స్వర్గమునుండి పాఱఁద్రోలి విజయమును సాధించెను. జయానంతరము మహౌదార్య

ముతో నింద్రునిఁబిలిచి రజిరాజు నీరాజ్యము నాకక్కఱలేదు నీవేయేలు కొమ్మని పలికెను. ఇంద్రుఁడంత ప్రసన్నుఁడగుచు ఆయనరాజు బ్రదికి యున్నంతవరకు తన్ను బాధింపక మానఁడని భయపడి రజిరాజును బలవంతపఱచి యింద్రపదము నాతఁడే యధిష్ఠించి పాలించుట కొడంబఱచెను. అంత రజిరాజింద్రుఁడయ్యెను. చిరకాల మాతఁడు స్వర్గరాజ్యమును బాలించెను. పిమ్మట అసురపరాజయము చేసెను. ఇంద్రుఁడంత రజిరాజు నాశ్రయించి 'నన్ను నీ పుత్రునిగా సంగీకరించి స్వర్గరాజ్యము నాకు ప్రసాదింపు' మని సవినయముగ నర్థించెను. స్వర్గసుఖముల ననుభవించి విరక్తుఁడగుటచే రజిరాజు ఇంద్రుని కోర్కె నంగీకరించి పుత్రునిగా భావించి స్వర్గరాజ్య మాతనికి పుత్రభాగముగ నొసఁగి తాను భూలోకమునకుఁ జేరుకొనెను.

రజిరాజునకు అయిదువందల మంది పుత్రులు గలరు. వారి సంతాన మగుట వారికి రాజులు, రాజేయులనను పేర్లు పడినవి. ఈ రజియే రాజవంశములకెల్ల మూలపురుషుఁడు. రాజవంశ మీతని నుండియే జనించినది. రజిపుత్రులలో క్రముఁడు, కాంపుఁడు, అతిపుడు, అనువారు ముఖ్యులు. క్రముఁడందఱిలోను శ్రేష్ఠుఁడును, బలిష్ఠుఁడును. ఈతని ప్రభావము దశదిశల వ్యాపించినది. ప్రతిభాప్రభావ సంపన్నుఁడగుటచే నీతని పేరున నీతని సోదరు లైదు వందల మందికి గాక పిదప వారి వంశస్థులందఱకుఁగూడ 'క్రమ్మవారు' (క్రమాః) అను వ్యవహారనామము సిద్ధించినది.

రజిరాజు మరణానంతర మీ యైనూరుగురు క్రమ రాజులును తమ తండ్రిచే సంపాదింపఁబడి చిరకాల మనుభవింపఁబడిన స్వర్గరాజ్యము తమకే దక్కవలెననియు, రజిరాజునకుఁ దామైదు వందల మంది పుత్రులుండగా ఇంద్రుని పుత్రునిగా స్వీకరించుట యాతఁడాడిన కపటనాటక ఫలితముగాన నది చెల్లదనియుఁ దలంచి యింద్రునిపై కసిమసఁగి వా

వెడలిరి. ఇంద్రుఁడెంత చెప్పుకొనినను వినక ఆతనిని సింహాసనమునుండి దిగఁద్రోసి వారిలో పెద్దవాఁడగు క్రమరా జింద్రపదవి నలంకరించెను. నూరేండ్లవిచ్ఛిన్నముగ క్రమ్రమహారాజు స్వర్గరాజ్యమును బాలించెను.

ఇంద్రునకు వచ్చిన తక్కువపాటునకు బృహస్పతి యెంతయుఁ గుంది అయిదువందల మంది క్రమ్రరాజులును మతిభ్రంశమ్ము నొందునట్లు భిచారహోమమ్ముఁ గావించెను. తత్ఫలితముగా వారు మార్గముఁదప్పి మతిచెడి దుర్ణయపరులై యాహోమాగ్ని తాపమ్మున నొడళ్ళపై మంటలులేచి యొక్కరు నిలువక యందఱును భస్మీభూతులైరి. ఆ భస్మరాశి భూలోకమునకుఁ ద్రోయఁబడి బూడిద కొండగా నేర్పడెను.

ఇఁక సూర్యవంశచరిత్ర మావశ్యకము. వైవస్వతమనువు యొక్క పుత్రు లెనమండ్రలోను ధృష్టుఁడు, కనిష్టుడు. ఆతని కుమారుఁడు నాభాగుఁడు, నాభాగునకు భనందనుఁడు వయించెను. భనందనునకు వత్సంధ్రుఁడు పుత్రుఁడు. వత్సంధ్రునకు బన్నిద్దయ పుత్రులుద్భవించిరి. వారిలోఁ బ్రాంశుఁడు పెద్దవాఁడు. అతనికి ప్రజని యనువాఁడు జనించెను. అతనికి ఖనిత్రుఁడు మొదలుగా నేవురు కుమారులుకలిగిరి. ఖనిత్రునకు క్షుపుండును, క్షుపునకు వీరుండును, వీరునకు వివింశుండునుపుట్టిరి. వివింశుండు తనకుఁ బుట్టిన పుత్రునకు ఖనిత్రుఁడని తనపూర్వికుని పేరు పెట్టుకొనెను. ఈ ద్వితీయ ఖనిత్రునకు ఖమిత్రుఁడనియుఁ బేరుగలదు. ఈ ఖమిత్రునకు సంతానములేదు.

ఖమిత్రుఁడు సంతానార్థియై పితృయాగంబు సేయందలంచి యందులకై పలయు మాంసంబుగొనెరా నొకప్పు డడవికి వేఁటకు వెడలెను. బహుదూరము చనినంత నొకదుర్గంబున నొక హరిణమాతని యెదుట నిలఁబ రజిరాజు తమ్ముఁడైన రంభుఁడను వాని వంశములోని 'బలి' యనురాజు దధీచిముని శాపంబున హరిణరూపమును ధరించెను. ఖమిత్రుని ముందు నిలఁబడినదా హరిణమే. ఆ హరిణము ఖమిత్రునిఁజూచి

మనుజ భాషణములతో "రాజా! నేను బహు క్షత్రియుండను. పితృల యం దలి మమకారంబున నాసంతతిలో నెవ్వరికిడుమ పొడకినను నేను భరింప లేక కృశించుచుంటిని. నీ వాడితూపుల నాప్రాణము హరించి నన్ని సంసార బాధనుండి విముక్తునిఁ జేయుము. నీకు పుణ్యముండును" అనెను. ఖమిత్రుఁడా మృగము మాటలకు ఆశ్చర్యపడి దానిఁ జంప నిష్టపడక పోవుటయే కాక ప్రాణివధంబున యాగంబు సేయనని శపథంబుకూడ వహించెను. హింసలేకుండ తపస్సుచేసి భవాని ప్రసాదము సంపాదించి సంతాన వరమునంద నిశ్చయించుకొని యాతఁడు నిర్జన వనంబునకుఁ బోయి ఘోరముగ భవానీదేవిం గూర్చి తపంబు సాగించెను. అతని తపంబునకు మెచ్చి దేవి ప్రత్యక్షమై "రాజా! నీమనోగతం బెఱింగితిని. నీవు పుత్రులం గోరుచుంటివి. నీ పూర్వులు కమ్రరాజుచే సూర్యుడు భస్మరాశులై పడి యున్నవారు. వారిని బ్రతికించుకొని పుత్రులుగా నీకు లభింతురు. అయ్యే సూర్యురు నేహూరు వంశంబులకు బ్రవర్తకులు కాగలరు. నీవంశము బహువిధముల విస్తరింపఁగలదు" అని పలుకుచునే యంతర్ధానమయ్యెను.

తనపూర్వులు కమ్రునాకెచట భస్మరూపమునఁ బడి యుండిరో వారి నెట్లు బ్రతికింపవలెనో తెలియఁజెప్పకుండగనే దేవియంతర్ధానమగుటచే ఖమిత్రునకేమి చేయుటకు తోచలేదు. కింకర్తవ్యతా మూఢుఁడైయున్న యాతనికిఁ దొల్లిమనుజ భాషణంబులఁ బలుకరించిన హరిణమే మరల యుం తటితో శాపావసాన సమయమగుట నాతని యెదుటనే దివ్యరూపము ధరించి 'బలిరాజు' నని తన్నెఱింగించుకొనెను. ఖమిత్రుండంతట మిక్కిలి నందపడి యా బలిరాజునకు గౌరీవాక్యంబులు దెలిపి, "కమ్రరాజుల భస్మ రాసు లెటనున్నవి? వారినుజ్జీవింపఁ జేయు నుపాయమెయ్యది? తెలుపు" మని వేఁడుకొనెను. బలిరాజు ఖమిత్రుని కొనిపోయి యొకచోఁ గొండవలె బోగు పడియున్న భస్మరాశిఁ జూపి, "ఇవే కమ్ర ప్రేరూర్యుర భస్మరాసి. కొండ వోలె బడియున్న యీబూడిదరాశిపై నలుమూల పాదరసంబు పోసెనేని

వీరు పునరుజ్జీవితులు కాఁగలరు. అలర్కుఁడన నెవ్వఁడోకాదు మన వంశజుఁడే. అతని చరితమొకింత తెలిపెదను వినుము.

కమ్మరాజునకు పినతండ్రియగు 'అనేనసు' నకు శత్రుజితుండను కుమారుఁడు కలఁడు. ఆతనికి ఋతధ్వజుండు పుట్టెను. ఈఋతధ్వజునకే కువలయాశ్వుఁడను పేరు. కువలయాశ్వుఁడు గంధర్వరాజు కూతురగు 'మదాలస' ను బెండ్లియాడెను. మదాలస కువలయాశ్వునితోఁ గుమారుని మహిమఁదెలుపుచు "ఈ అలర్కుఁడు మన వంశీకులగు వేసూర్వుర కమ్మరాజేయులను తన పాదపరాగ సంస్పర్శ మాత్రమున పునరుజ్జీవులఁ గావించును. వా రేసూర్గురు బాహుబల సంపన్నులై అంగాది దేశంబుల వ్యాపించి యేనూరు గోత్రములకుఁ బ్రవర్తకు లగుదురు. శ్రీవీరప్రతాపరుద్రుని యనంతరము నుండి యీ కమ్మవారికి రాజ్యయోగంబు కలుగదు. క్షత్రియత్వము ప్రచ్ఛన్నమై యుండును. కాని కుబేరవిలాసంబుల సిరుల నేపారుచుందురు" అనిచెప్పెను.

ఈ యలర్కుండు దత్తాత్రేయ వరప్రసాదంబున పరమ ప్రభావ సంపన్నుండై యున్నవాఁడు. ఆపని నాశ్రయించి కమ్ముల నెల్ల బ్రతికించుకొమ్ము" అనిపలికి బలిరాజు నిజేచ్ఛంజనియెను

బలిపలుకులకు సంతసించి భమిత్రుఁడు కమ్ములను బ్రతికించుకొనిన తన వంశము విస్తృతి నందఁగలదని యుత్సాహముతో నలర్కుని యొద్ద కరిగి ఆతనిఁ బ్రసన్నునిఁజేసికొని భస్మరాశియొద్దకుఁ గొనిపోయెను.

అలర్కుని పాదస్పర్శ సోకినంత నిద్రించి లేచినవారువలె కమ్మాదు లేసూర్వురు స్వశరీరముల ధరించి యాతనికి నమస్కరించిరి. అలర్కుఁడు వారిని దీవించి "మీరు గౌరీకృపవలన బలిరాజుసహాయమునను బ్రతుకుఁగంటిరి గాన మీ కమ్మవారందఱు గౌరీ పుత్రులనియు, బలిజులనియు పిలువఁబడుదురు. మీరు నాయకులై, రాట్టులై, సమ్రాట్టులై,

వంశ వృద్ధిఁగావింపఁగలరు. శాక్తేయ, వైష్ణవ, శాంభవి భక్తి యేదియేని కల్గియుండునంతవరకు మీరు క్షత్రియులుగా నుందురు. ఎప్పుడీ భక్తి మీకు తగ్గుముఖమువట్టునో నాఁటినుండి మీ క్షత్రియ ధర్మము [illegible]పించి పోఁగలదు" అని చెప్పివెడలిపోయెను.

భమిత్రుఁడు పునర్జీవితులగు కమ్మవారి [illegible] [illegible]ఁ గొనిపోయి పుత్రులుగా స్వీకరించి బహుపుత్రవంతుఁ డయ్యెను.

ఈ 'కమ్మవారు' 'మొదలిజన్మలో చంద్రవంశస్థులు. రెండవజన్మమున సూర్యవంశజుఁడగు భమిత్రునివలన పునర్జన్మమునొంది యాతనికి స్వీకృతపుత్రులై సూర్యవంశ్యులైరి. పైగావచ్చినది సూర్యవంశము. అసలు చంద్రవంశము. అందుచే నీ కమ్మవారు * అత్యర్కేందుకులస్థులని పేరు వడిరి. రెండుకులములు తమవేయగుట [illegible] కొందరు తమ్ము సూర్యవంశస్థులుగా, కొందరు చంద్రవంశస్థులుగాను చెప్పుకొనుచు వచ్చిరి.

భమిత్రుని యనంతరము క్రమముగా [illegible] రాజ్యసంపాదనమునకై వివిధదేశములు చేరుకొనిరి. ఆ వచ్చిన [illegible] వీరిలోఁ గొందరు పరాశక్తిని, కొందరు వైష్ణవిని, కొందరు శాంభవిని విడువక కులదేవతలుగా పూజించుకొనిరి. క్రమముగా [illegible] లలో నొకఁడైన కాకతిరాజు పరాశక్తినే కులదైవముగా స్వీకరించెను.

ఈనవంశమున [illegible] రాజ్యవిచ్ఛిత్తి కలుగకుండుటకు కాకతిరాజు కాంక్షించెను. ఆ కోరిక నెరవేరుటకై జమదగ్నిగోత్రజులగు బ్రాహ్మణులను రావించి [illegible]

* అతి = అధికమైన, అర్క = సూర్యకులముగల, ఇందుకులస్థులు = చంద్రవంశము నందలివారు.

యందుల కర్తమగు సవనముఁనొందు తనచేఁ జేయింపుఁ డని వారిని వేఁడు కొనెను. వారు బాగుగా నాలోచించి 'ఋషిసవన' మందులకుఁ దగి యున్నదని నిర్ణయించి యిట్లు పలికిరి.

'ఈ ఖగోళమునకు భూగోళమునకు విడఁదీయరాని సంబంధము గలదు. ఆకాశమునందుఁగల నక్షత్రముల ప్రభావముచే భూమియందలి జనుల జీవితము లాకర్షింపఁబడి ప్రభావితములగుచున్నవి. కనుకనే భూమి యందెందఱు జనులుందురో ఆకాశమున నన్ని నక్షత్రములున్నవి. ప్రతి వాఁడు నేదోయొక నక్షత్రముచే ప్రభావితుఁడు గావలసినదే. స్థూలముగ నిర్వ దేఁడు నక్షత్రములే జ్యోతిశ్శాస్త్రమునఁ జెప్పఁబడినను ఆకాశముననున్న నక్ష త్రములన్నియు భూమిపైనిగల జనుల జీవితముల నడుపునవే. అచ్చట వాని కున్న ఘనత ఇచ్చట భూమిపైని జనులకును గలుగుచుండును. ఫల్గునుఁడు ఫల్గునీనక్షత్ర ప్రభావముచే నంతవాఁడు కాఁగల్గెను. ద్రోణుఁడు ధ్రువ నక్షత్రముచే నంతటివాఁడయ్యెను. ప్రతి వీరుఁడు నొక్కొక్క ప్రతిభావంత మగు నక్షత్రముచేఁ బాలింపఁబడినవాఁడే.

కాకతిరాజా! నక్షత్రగణములలో సప్తర్షిగణమునకు ప్రాబల్య మెక్కువ. ఈ ఋషులు విడివిడిగ నేఁడుగురైనను నొకేకూటమిగ నున్నారు. అరుంధతితో నెనిమిదినక్షత్రముల గణమిది. ఈ నక్షత్రకూట మును నీవు యంత్రబద్ధముఁగావించి ప్రాణప్రతిష్ఠసలిపి సమంత్రకంబుగ నర్చించి సముచితవిధానమున జపహోమాదులతో సవనము గావించినచో వారు నీకుఁ బ్రసన్నులై తమ ప్రభావములను నీ కోరికప్రకారము కలియుగమున నీవంశముపైఁ బ్రసరింపఁజేయుదురు. అప్పుడు నీవంశ మునఁ బెక్కుతరము లవిచ్ఛిన్న ప్రభావసంపన్నములు కాఁగలవు. అరుం ధతీదేవి ప్రసాదమున నొక స్త్రీమూర్తికూడ మీవంశమున నఖండప్రతిభా సంపన్నురాలు ఉదయింపఁగలదు. ఇంకను ఎక్కువతరములు ప్రభావితములు జేయఁగల పెక్కునక్షత్రములు గలిసిన కూటములున్నవి; కాని అందలి

నక్షత్రములుమాత్రము సప్తర్షులంత మహిమగలవికావు. ప్రభావసంపన్న ముగాని వంశ మెన్నితరము లవిచ్ఛిన్నముగనున్న నేమిఫలము! కాన కాకతీశ్వరా! ఋషిసవనముఁ గావించి సప్తర్షుల యనుగ్రహమ్ముఁ బడ యుట యుక్తము" అని సహేతుకము, సశాస్త్రీయమునుగా వినిపించిరి.

కాకతిరాజు జమదగ్నిగోత్ర సంభవులగు బ్రాహ్మణప్రవరు లాదేశించిన విధానమున ఋషిసవనమును యథావిధి నిర్వర్తించెను. అగ్నిముఖమున ఆహుతులొసంగుకాలమున సప్తర్షులు, అరుంధతియు స్వయముగ హస్తములుసాచి ఆహుతులందుకొని రాజు నాశీర్వదించిరి. వశిష్ఠుఁడు "బ్రహ్మర్షులగు మమ్మానందింపఁజేసితివి. కాన మా ఆశీఃప్రభావమున మీవంశ ముత్పన్నదశనుండి యొక బ్రాహ్మణునిచే నుద్ధరింపఁబడును. మీరు వేదబ్రాహ్మణావమానమునకు వెనుకయుండునంతకాలము మీవంశము తరతరంబులుగా సర్వాభివృద్ధుల నందుచుండును. కాన జాగ్రత్త వహించుకొనియుండుఁ' డని హెచ్చరించెను.

'బ్రాహ్మణ్యము ముద్దగానేర్పడినమూర్తి వశిష్ఠుఁడు. ఆతని పలుకులమోఘములు. కాన వానిని పాలించుట మీకు శ్రేయోదాయకము" అని జామదగ్న్యులగు పురోహితులు రాజునకు వశిష్ఠవచనము ననువదించి చెప్పిరి' అని శ్రీపాదులవా రుపన్యాసము ముగించిరి.

తనవంశ పూర్వచరిత్ర వినుచుండినకొలఁది ప్రోలరాజున కానందతరంగములు మనమున రేఁగఁజొచ్చెను. ఆతని రోమాంచము కలిగినది. తమ కాకతీయవంశము చంద్రవంశము, సూర్యవంశముకూడనైన అత్యర్కేందుకులమునఁ బ్రభవించి ఉభయవిశిష్ట లక్షణములు గలిగిన సుక్షత్రియవంశమగుట, తమ పూర్వులు క్రమవారు ఇంద్రపదవినే పొందఁగల్గుట శ్రీపాదులవారి ముఖతః వినినంత నాతని కొడలుఁదెలియరాని ఆనందమున తన్మయతగల్గెను. ఆనందసాగరమున మునుకలువైచి

# అత్యర్కేందుకులస్థులు

యొకింత తెప్పరిలినపిదప ప్రోలరాజు గురుదేవుని వినయవిధేయత లుట్టిపడఁ జూచి 'గురువరా! ఇంతటి విశిష్టవేదమతమును వీడి మావంశము జైనమతము నేలచేపట్టవలసివచ్చినది ? సుక్షత్రియులమగు మేము జనులచే చతుర్థకులజులుగా భావింపఁబడనేల ? ఈ సందేహములు నా మనసును పీడించుచున్నవి. యదార్థమునారసి యెరింగింపుఁ' డని వేఁడుకొనెను. శిష్యుని ప్రార్థనమంగీకరించి గురుఁడు తిరిగి చెప్పనారంభించెను.

సైనికశిక్షణమందారితేరిన ఉగ్రసేనుఁడు సేనలను బహుసమర్థముగ నడిపించి మహాసాహసమున భార్గవరామునివలె శూరుఁడై పెక్కు రాజ్యములను జయించి మహానందునకు గొప్పరాజ్యమును సంపాదించి పెట్టెను. అతని సాహసకార్యమును దెలిసికొని, అవయవసౌష్ఠవమును జూచి రాణి సునందాదేవి యాతనిపై మోజుపడి ప్రేమించెను. ఒక యేఁడాది వారి రహస్యముగ సాగినది. రాణి సునందతోఁగలిసి కుట్రచేసి యొకనాఁటి రాత్రి యుగ్రసేనుఁడు శిశునాగమహానందుని, అతని యిరువురు పుత్త్రులను పడకమీదనే చంపివైచెను.

పిమ్మట ఉగ్రసేనుఁడు మహాపద్మనందుఁ డను పేరు పెట్టుకొని తన్ను రాజుగా ప్రకటించుకొని యేలుచుండెను. అతని క్రౌర్యమునకు, పరాక్రమమునకు హడలి ప్రజలు కిమ్మనకుండిరి. తరువాత మహాపద్మనందుఁడు బహిరంగముగ సునందాదేవిని వివాహమాడి రాజ్యమున పట్టాభిషిక్తుఁడయ్యెను. రాజైనపిమ్మట తాను పూర్వము ప్రేరేచిన దొంగల ముఠాలనన్నిటిని బట్టి శిక్షించి రాజ్యమున నెక్కడను దొంగలభయము లేకుండఁ జేసివైచెను. రాజ్యము సుభిక్షము కావించెను.

హిమాలయము, కుంతలము, యమున, బ్రహ్మపుత్ర ప్రాంతములఁగూడ తన యధీనమునకుఁ దెచ్చి మహాపద్మనందుఁడు సార్వభౌముఁ డయ్యెను. ఒకేఛత్రముక్రిందకుఁ బెక్కురాజ్యములను దెచ్చి చక్రవర్తిక్షేత్రమును స్థాపించెను. ఎన్నిచేసినను ప్రకృతివర్గము భయమునఁదప్ప భక్తిగ నాతనికి వశపడలేదు. క్షత్త్రియులాతని కళంకితజన్మమును, కిరాతకృత్యములను లోన గర్హించుచునేయుండిరి. అతనినెన్నఁడు వారు సుక్షత్త్రియునిగ గణింపలేదు.

మహాపద్మనందునకు తాను సుక్షత్త్రియుఁడుగ పరిగణింపఁబడవలెనను నుబలాటము హెచ్చుగనుండెను, ఏమిచేసిన తానట్లు భావింపఁబడునో నిరంతర మూహింప మొదలిడెను. సుక్షత్రియవంశజులచే

మ్రొక్కులందుచు వారితో సంబంధ బాంధవ్యములు కలుపుకొని [illegible]పఁ బడుచుండినచో కొన్నాళ్ళకు తన వంశకళంకము మాసిపోవునని భావించి యాతఁడందులకై వలయు యత్నములు సలిపెను. కాని యాతఁడు శూద్రగర్భజనితుఁడగుటచే సుక్షత్రియు లెదేశస్థులుఁగాని బాంధవ్యము కలుపుట కొప్పుకొనలేదు సరిగదా సామాన్యగౌరవమంపుటయుఁదప్ప మోకరిల్లి నమస్కరించుటకుఁగూడ నొప్పుకొనరైరి.

తనకంటె నధికారబలమున నత్యంతహీనులైన క్షత్రియులు తనకు నమస్కరించుటకుఁగూడ దిరస్కరించుట మహాపద్మనందునకు నగ్నిలో నాజ్యముపోసినట్లయ్యెను. తోకఁద్రొక్కిన త్రాచువలె నాతఁడు పగఁబట్టెను. తన్ను శూద్రునిగా భావించుచున్న క్షత్రియుల నెల్లరను హీనులనుగాఁ జేసికాని నిద్రింపనని యాతఁడు ప్రతినపట్టెను. క్షత్రియచిహ్నములగు శిఖాయజ్ఞోపవీత ఖడ్గధారణాదులను దీసివేయించి శూద్రాచారవర్తనకు బలవంతముగ వారిని దింపుట కాతఁడు పన్నాగమూహించెను.

సర్వక్షత్రియులను యుద్ధమున జయించి యణఁచుటకై యక్షౌహిణీలకొలఁది సేనలతో మహాపద్మనందుఁడు పరశురామునివలె క్షత్రియ సంహారమునకు బయలుదేరెను.

ప్రథమముగా మహాపద్మనందుఁడు జయపురముమీఁదికి విరాట వంశసంభవుఁడగు గజపతిని జయించుటకు దండువెడలెను. ముందుగా నందుఁడు గజపతియొద్ద కొక దూతనుబంపి 'నీవు సపుత్రబాంధవముగా నాకు సాగిలఁబడి మ్రొక్కుదువా? లేక యుద్ధమొనర్చి సబంధురాష్ట్రముగ నశింతువా? తెలుపు' మని కబురుపెట్టెను. దూతవాక్యమును విని జయపుర భూపాలుఁడగు గజపతి మంత్రులతోను, సామంతులతోను, బాంధవులతోను ఆలోచించి బలవద్విరోధము నిష్టపడక బంధుమిత్రాదులతో మోకరిల్లి నమస్కరించి మహాపద్మనందుని కోరికను నెరవేర్చెను.

ప్రథమ విజయమున కుప్పొంగి మహాపద్మనందుఁడు గజపతిని తన సామంతునిగా నంగీకరించి సర్వసైన్యవృతుఁడై ఆర్యావర్త దేశములమీదకు దండువెడలెను. ప్రతిచోటునను తనకు తలవంచి నమస్కరింపని రాజుల కుటుంబములు యుద్ధమున మడియవలసినదే' యని ప్రకటించెను.

పెక్కురు సూర్య చంద్రవంశ సుక్షత్రియు లాతని యాగడమునకు రోషపడి శూద్ర పాదాభివందనము గావించుట కిష్టపడక యుద్ధమునకే తలపడిరి.

నాగపురీశులగు సాఖలదాపలులును, కటకాధీశుఁడగు మందపుఁడును, పత్తిపాతభూపతియు, గయాధీశుఁడగు దండకారుఁడు, కేదార దేశాధీశుఁడు, చిత్రకూటాధిపుఁడగు మంధనాథుఁడు, అంవంతీ దేశాధినాధుఁడు, కాకలుఁడగు హీరభూపతియు, బ్రహ్మావర్తదేశ ప్రభువు రంతిలారుఁడును, ఇంకనుననేకులగు రాజన్యులు మూఁడురోజు లహోరాత్రములు మహాపద్మనందునితో ఘోరముగా యుద్ధమొనర్చిరి. కాని వాని సేనలకు చాలఁజాలక చివరకు నోడిపోయిరి.

ఓడిపోయినరాజులు సకుటుంబములుగఁ గారాగారములందుంపఁబడిరి. మహాపద్మనందుఁడు పెక్కు గ్రామములను వారికి కారాగారములుగఁజేసి యాగ్రామముల కదలకుండ కట్టడిఁజేసి తనకోరిక ప్రకారము వారినందు బలవంతముగా శూద్రాచార వర్తనులుగ నుండునట్లు నిర్బంధించెను. రాజశాసనము ప్రకారము వారు స్వవర్ణాచారములను పరిత్యజింపక తప్పినదికాదు. శస్త్రాస్త్రముల విడిచి క్షత్రధర్మవిహీనులైరి. శిఖాయజ్ఞోపవీతములఁ బరిహరించి స్నాన సంధ్యా జప హోమ వివర్జితులై ద్విజ ధర్మము లుజ్జగింపవలసి వచ్చెను. వేదోక్తాచారములను విడిచి శూద్రానీతమైన అన్నము గ్రహించుచు శూద్రప్రాయులై బ్రతుకక తప్పినదికాదు. ఉదర పోషణమునకై కృషిపాశుపాల్యములను వృత్తులుగా నంగీకరింపవలసిన వారైరి. పెక్కుగ్రామము లిట్లు కారాగారములుగా పెక్కువేల రాజకుటుం

బములు ఏఁబదివత్సరములు తిరుగులేక శిక్షలనుభవించినవి. చిరకాలము కారాగృహములందు శూద్రాచార వర్తనులైయుండుటచే వారికి పుట్టిన సంతానమునకు పుట్టుకతోడనే శూద్రవర్తనము అలవడిపోయినవి. ప్రజలు వారిని శూద్రులుగనే భావించిరి.

చాలకాలమునకు పిమ్మట విసిగి సాఖల ప్రముఖులగు చాలమంది రాజులు బంధువులలోఁగూడి కారాగారము నుండి విముక్తులనొసఁగ ప్రాధేయపడి మహాపద్మనందునకు సాష్టాంగపడి నమస్కరించిరి. మహాపద్మనందుఁడు "మీరు ఇవే ఆచార వ్యవహారములతో వ్యవసాయ పాశుపాల్యములు మాత్రము జీవనాధారములుగా బ్రతుకుఁడు" అని యాదేశించి వారిని విడిచిపుచ్చెను.

సాఖల ప్రముఖులగు నారాజులు ఇతర వ్యాపారములు మానుకొని స్వేచ్ఛగా కృషికర్మపరులై జీవించిరి. నంద మహారాజులచేత మిగిలిన రాజకుటుంబము లన్నిటికిని కారాగార విముక్తి లభించినది. వారు మెల్లగా నటనుండి వింధ్యకు దక్షిణ ప్రాంతములందుండు సముద్ర ప్రాంతములుచే దీప్తిమంతములగు కళింగ, ఆంధ్ర, విదర్భ, దేశములకు వలస పోవుటకు నిశ్చయించుకొనిరి. ఈవిధముగ సూర్యవంశజులు, చంద్రవంశజులు అశ్మకవంశజులు మొదలగు క్షత్రియులు పెక్కురు ప్రచ్ఛన్నులై దాక్షిణాత్యులు ఔత్తరికులు, పాంచాలురై యాయా దేశములకు వలస పోయిరి. శూద్రాచారముల ననువర్తించుటఁ జేసి యితరదేశములఁ దమకు గౌరవప్రపత్తి యుండదని ఆ రాజవంశజులందఱు మారుమూల దేశములకు కుటుంబములతో వలసపోయి చతుర్థకులజులుగనే జీవించిరి. పిమ్మట నాంధ్రదేశమున నలుమూలల విజృంభించిన జైనమత ప్రవక్తలటకుఁజేరిన వీరినందఱను సులభముగా జైనమతమునఁ జేర్పవైచిరి. స్వమతమునఁ దమ పూర్వగౌరవ మెన్నటికి లభింపదని వీరందఱు కుల భేదములేని జైనము నుత్సాహముతో స్వీకరించిరి.

ఈవిధముగ నీ దేశమునకువచ్చిన యీ ప్రచ్ఛన్న రాజవంశీకులలో అత్యర్కేందు కులజులగు కాకతీయులు, శ్రీకాకలులు, పాకరాట్టులు, చాళుక్య చోడ రాయ వంశీకులునుగలరు. ఈ యారు వంశములవారు అత్యర్కేందు కులస్థులగుటచే, నన్యోన్య బంధు సంబంధములుగల వారగుటచే నొకజట్టుగా కలిసి పయనించి యొకేదేశమున నివసింప నిశ్చయించుకొని పెక్కు రీ ఆంధ్రదేశమునకుఁ జేరుకొనిరి. వ్యవసాయమే వృత్తిగా జీవించుటకు నిశ్చయించుకొనిరి. ఆంధ్రదేశమున సారవంతములగు భూములు గలవు. ఎవరెంత భూమి నాక్రమించుకొని పండించుకొన్నను కాదనువారులేరు, తృణకాష్ఠ జలసమృద్ధిగల దేశము. వ్యవసాయమునకై ముందు భూములు సంపాదించి పిమ్మట సైన్యములు కూర్చుకొని రాజ్యము లెప్పటికైన స్థాపించుట కాంధ్రదేశమనువు గానున్నదని వారెంచుకొనిరి. పూర్వ వంశ ప్రతిష్ఠ నేనాఁటికైన తిరిగి స్థాపింపఁగలమను ఆశాజ్యోతి వారిలో మినుకు మినుకుమనెను. ఈవిధమగు ఆశాన్వితులై వారు ఈ ఆంధ్ర దేశమున భూసార పరీక్షసేసికొనుచు సారవంతములగు భూములగుపడిన చోటులనెల్ల కొన్ని కుటుంబములవా రచ్చట నిలిచిపోవుచు మిగిలినవారు ముందుకు సాగిపోవుచు దేశమంతట వ్యాపించిరి.

*1. నల్లరేగడినేల యెచ్చటనగుపడిన నచ్చట స్థిరపడుటకు కొందఱును, ఎఱ్ఱచెక్కుడు నేలయగుపడినచోటుల వసతులేర్పఱచు కొనుటకుఁ గొందఱును నిర్ణయించుకొని స్థిరవాసము లేర్పఱచుకొనిరి.

వ్యవసాయము సాగించి క్రమముగా బలపడి ఈ ప్రచ్ఛన్న రాజ కుటుంబుల వారందఱు అచ్చటి ప్రజలలో మంచి పలుకుబడి సంపాదించుటయే కాక వారికి నాయకులై రక్షకులై పరిపాలనా వ్యాపారమును సాగించిరి. కొందఱాప్రాంత రాజుల ప్రాపకము సంపాదించి

*1. నల్లరేగడిగల ప్రదేశముల కమ్మవారును, ఎఱ్ఱ చెక్కుడు నేలలందు రెడ్డివారును నేఁటికిని విశేషముగా నున్నారు.

*1. సమాహర్తలుగా, నగర రక్షకులుగా మహోన్నతోద్యోగములం గుదురుకొనిరి. కొందఱు సైన్యములంజేరి *2. వర్మలైరి. కొందఱు సామంత రాజులైరి. కొందఱు చిన్నచిన్న దేశములకు స్వతంత్రరాజులైరి. ఈవిధముగా అత్యర్కేందు కులజులైన కమ్మరాజు లాంధ్రదేశమున నాయకులని, నాయఁడులని, రెడ్లని, చౌదరీలని, కాఁపులని, వర్మలని బిరుదు నామములను ధరించిరి. వీరందరు 'బలిజ' వంశమునకుఁ జెందిన కమ్మవారగు అత్యర్కేందుకుల క్షత్రియులే.

చాలకాలమునకు పిమ్మట ఆచార్య శంకరస్వాములవారవతరించిరి. వేదమతము నుద్ధరింపఁబూని ఆచార్య స్వాములవారు బౌద్ధ, జైనమతములను ఖండించుచు ప్రచారములేవఁదీసిరి. అప్రచారము బలముగసాగినది. వాదములలో జైనయతుల నోడించి శంకరులు ప్రజలలో వేదమతము దాసక్తిని రేకెత్తించిరి. జైన మతస్థులను తిరిగి వేదమత ప్రవిష్టులను గావించిరి. ప్రచ్ఛన్న రాజవంశములవారీ యవసరమున వేదమతప్రవిష్టులై తొల్లింటి క్షత్రియత నందఁగల్గిరి. కాకతిరాజవంశజులు మాత్రము వేదమత ప్రచారమునకు లొంగక జైనమతమునకే కట్టుబడి యుండిపోయిరి. బ్రాహ్మణమత ప్రచారమున ఎవరు వేదమతప్రవిష్టులు కాక జైనులుగనే యుండిపోయిరోవారిని వేదమతస్థులు, వృషలులని, హీనులని, చతుర్థకులజులని వ్యవహరించిరి. క్షత్రియగణములతో రాజ్యములు స్థాపించినను యీ కాకతీయులు చతుర్థకులజులుగనే భావింపఁబడుటకు వారు తమ జైన మతమును పరిత్యజింపకుండుటయే కారణము.

*1. పన్నులు వసూలుచేయు ఉన్నతాధికారులు.

*2. అనగా కవచములు ధరించినవారని యర్థము. వర్మ పదమే వెలమగా మారినది. రాట్టుపదము రెడ్డిగా మారినది. చౌధ్ అనగా పంటలోని నాల్గవ వంతుపన్ను. ఈపన్ను వసూలుచేయు నుద్యోగులు చౌదరీలు. రక్షణోద్యోగులు కాఁపులు.

తొల్లి తాము సూర్యచంద్రవంశ రాజులై నేఁడు చతుర్థకులజులైన తెలుఁగు శ్రీపాదులవలనఁ దెలిసి ప్రోలరాజు మనసులో చాల బాధపడెను. శాపవిధిఁదప్పింప నశక్యమగుటచే నాతఁడు మొదట విచారపడినను తరువాత మనసుఁ గుదురుపఱచుకొనెను కాని తానప్పుడేమి పరిహారముకావింపవలెనో తెలియక వేదనపడెను. ప్రోలరాజు మనసును కొంత సమాధానపరచుకొనిన పిమ్మట తిరిగి తమవంశకథ స్మృతిపథమునకుఁదెచ్చుకొని 'గురుప్రభూ! మఱి మావంశము ఉత్పన్నము కానున్నప్పుడొక బ్రాహ్మణ ప్రవరుఁడు మా వంశాంకురమును గాపాడెనంటిరే! ఆ బ్రాహ్మణశ్రేష్ఠుఁ డెవరు? కాకతి వంశము ఎప్పుడెటు లుత్పన్నము కావలసివచ్చినది? దానినిఁగూడ సవిస్తరముగఁ దెలిపి యనుగ్రహింపుఁ' డని సవినయముగ నర్థించెను.

ఆరవ ప్రకరణము.

# బ్రాహ్మణానుగ్రహము.

రామారణ్య శ్రీపాములవారిట్లు చెప్పనారంభించిరి. 'వత్సా! వినుము అత్యర్కేందు కులస్థులగు కమ్మవారిలో [illegible] రాజుయొక్క వంశమున కలియుగమున విజయపాలుఁడు జన్మించెను. విజయపాలునకు వసుమతికన్య, అగ్నివర్ణుండు పుట్టిరి. వసుమతియందు వృషసేనుఁ డుద యించెను. విజయపాలుఁడు తన పుత్రుఁడగు అగ్నివర్ణునకును, దౌహిత్రుఁ డగు వృషసేనునకును రాజ్యంబు విభాగించి యొసఁగెను. అగ్నివర్ణునకు బహుసుతులు జన్మించిరి వారు ఏమహారాజును వైరమునం జెప్పుకొని రాజ్యపాలనంబు లేక వృష్ణికులభూపతుల నాశ్రయించి బ్రతికిరి.

వృషసేనుని వంశంబున పెక్కు రాజతరంబులు గడచిన పిదప కన్నమదేవుఁడను రాజు జన్మించెను. అతఁడు కందారంబు తనకు రాజ ధానిగా రాజ్యంబు పాలించెను.

కన్నమదేవునకు సోమదేవరాజు జన్మించెను. ఇతని భార్య సిరి యాలదేవి. ఈమె మహాసాధ్వి. సోమదేవుఁడు గోబ్రాహ్మణ భక్తి యుతుఁడు. అతనికి ప్రాణమొకయెత్తు; గోధనమొకయెత్తు. ఆలమందల నాతఁ డతిశ్రద్ధగాఁ బాలించుచుండును. అవి ధేనువులు పదుమూఁడువేల నేనూరు వందలును మంత్రికూటము, భద్రాచలము మొదలుగా గోదావరి కుభయతట ప్రదేశంబుల వృద్ధియగుచుండెను.

కందారమునకు కటకము పొరుగురాజ్యము. దానిని బల్లహుఁడు పాలించుచుండెను. బల్లహునకు పొరుగుపచ్చ గిట్టదు. సోమదేవరాజు వృద్ధిఁదెలిసికొని బల్లహుఁడు కన్నులలో నిప్పులుపోసికొనెను. కందారరాజ్యపు సరిహద్దులు దాటి కటకసీమలో గోవులు ప్రవేశించి మేసినవని వంకపెట్టి

బల్లహుఁడు సోమదేవరాజు గోగణమును కటకమునకు తోలించుకొనిపోయి బంధించి "మీ యాలమందలు మా పొలిమేరలోపడి మేయుచున్నవి. అందుచే వానిని బంధించితిమి. పుల్లరి చెల్లించి విడిపించుకొని పోవచ్చు" నని సోమదేవరాజునకు వార్తపంపెను.

సోమదేవరాజు చిచ్చఱపిడుగు. మహాభిమాని. పరులచే మాట పడువాఁడు కాఁడు. ఎంతవానికైనను అక్రమమున కంగీకరించి జోహారు చేయుట యాతనిలో లేదు. బలహుని వార్తనందుకొని యాతఁడు తోక త్రొక్కిన త్రాచువలె బుసగొట్టెను. మంత్రులను, సేనాపతులను రావించి కర్తవ్యమాలోచించెను, అందఱును యుద్ధముకన్న గత్యంతరము లేదనిరి. కటకాధీశ్వరుఁడు బహుబలవంతుఁడే. కాని చేయఁదగినదేమి? పౌరుషము చంపుకొని ఆశ్రయించి దేవురించుటకంటె విజయమో వీరస్వర్గమో కర్తవ్య ముగ నందఱకు తోచినది.

సోమదేవరాజు సకలసేనాపరివృతుఁడై కటకముపై దండయాత్ర సలిపెను. ఆరునెలలు ముట్టడివేసి మహాయుద్ధంబు జరిపెను. కాని అపారమగు బల్లహుని సేనానివహంబునకు చాలఁజాలక సేనలు మడిసి కందారముఁ జేరుకొనెను. కొన్నాళ్లకు తిరిగి సేనలఁ గూర్చుకొని కట కముపై మరలఁ బడెను. అప్పుడును విజయము సిద్ధింపలేదు. ఎన్ని సారులపజయంబు నొందినను దిగులుపడక పది పర్యాయము లిట్లు సోమ దేవుఁడు దండయాత్రలు సాగించెను సోమదేవుఁడెన్ని సారులోడిపోయి వెనుకకు మరలినను బలహుఁడు మాత్రము మీదికివచ్చి కందారము నాక్ర మించుకొను ధైర్యమును వహింపలేదు. సోమదేవుఁడన్న నాతనికంత భయము.

నిరుత్సాహపూరితుఁడై కటకము జయించు నాస సోమదేవుడు విడ నాడెను. తాను ముసలివాఁడగుట, తనబలంబులు సర్వము పది యుద్ధ ములలో నశించుట అతనికంత నిరుత్సాహముఁ గలిగించినవి. తానుగాక

పోయినమానె తనవంశమున నెవ్వఁడైన బలహు నెదిరించి విజయించిన చాలునని యాతఁడాశించెను. కాని దురదృష్టవశమున తాను సంతానవంతుఁడు కాడాయె. ఇఁక నాతనికి శాంతి యెక్కడిది ? చేయఁగలిగిన దేమున్నది? అప్పటికిని పూర్తిగ నిరుత్సాహపడక అతఁడు పుత్రకామేష్టి చేసి బల్లహుని జంపు కొడుకును గనుటకు యత్నపడెను.

గోదావరి కుభయతటంబులనున్న అగ్రహార గ్రామములందు పదుమూఁడువేల నేనూఱంగల వేదవేదాంగ పారంగతులయిన బ్రాహ్మణుల రావించి అపార ధనకనకవస్తువాహనాందోళికాభరణంబుల చీనాంబరంబుల వారలఁ బరితృప్తులఁజేసి కటకవల్లభునిఁ దునిచి గోవులను మరల్చి పెట్టె సత్పుత్రుఁడు ప్రాప్తించు యజ్ఞము నాచేఁ జేయింపుఁడని ప్రార్థించెను.

విప్రులు పుత్రకామేష్టి జరిపించిరి. అగ్నిహోత్రమునందనేక శుభ సూచకంబులు గనంబడినవి. పురోహితులు హవిర్భాగంబుల మంత్ర పూతంబులఁ గావించి పట్టమహిషియగు సిరియాలదేవి కొసంగిరి. ఆ ప్రసాద విశేషంబున సిరియాలదేవి గర్భంబుఁదాల్చెను.

తద్వృత్తాంతము నంతయు కటకవల్లభుఁడు చారులచే వినెను. విప్రకృతంబు వృధాకాదని యచరిపడెను. పత్నీయుక్తంబుగా సోమదేవ రాజును పట్టి వధింపకున్న తనరాజ్యము తనకుఁ దక్కదని నిశ్చయించి అరువదినాలుగువేల మదగజంబులు, పన్నెండు లక్షల పదాతిసైన్యము, లక్ష గుఱ్ఱంబులు గూర్చుకొని కందారపురమైఁ బడెను.

సోమదేవుఁడు పండువృద్ధు. ఒకానొకప్పుడెంతయో ప్రసిద్ధమై పటిష్ఠమైన సైన్య మత్యల్పము. అయినను వీరధర్మము నాతఁడు విడువలేదు. మాసద్వయము గజపతితో యుద్ధముచేసెను. చివరకు వీరస్వర్గము చూఱఁగొనెను.

సోమదేవుని పట్టమహిషి సిరియాలదేవి పూర్ణగర్భిణి. సామంత వర్గము వెనుఁదీయక మఱియొక్క మాఱు యుద్ధమొనరింపఁ గావించెను.

ఆయుద్ధమున పదివేల గజములు, ఏఁబదివేల తురంగింబులు, అయిదు లక్షల పదాతివర్గమును మడిసెను. కాని విజయము చేఁజిక్కినట్లులేదు.

అపజయభీతినంది సిరియాలదేవి చేయునది లేక తన గర్భంబున నున్నవాఁడు బల్లహుని చంపి తిరిగి రాజ్యము సాధింపఁగలవాఁడు కాఁగలఁడని, యజ్ఞకృతంబు వ్యర్థము కావని యాశపెట్టుకొని గర్భరక్షణమునకై తాను శత్రువునకు చిక్కకుండ తప్పించుకొనుట కుద్దేశించెను. అంత నాపె తన పోష్యవర్గంబువారి నూరిండ్ల విప్రులనురప్పించి తన కర్తవ్యమెఱింగించి వారల కపార ద్రవ్యంబు లొసంగి కొందఱ వివేక చతురులగు విప్రుల వెంటఁబెట్టుకొని తనగృహదేవతయైన సదాశివు నొడిఁగట్టుకొని మహాగర్భ భారంబుతోఁగదలి రహస్యమార్గమున అర్ధరాత్రంబున తన సామంతులకు గూడ నెవ్వరికిఁదెలియకుండ అనుమకొండ చేరుకొనెను. ఆసమయమున అనుమకొండ రాజ్యమును ఎఱుకదేవరాజు పాలించుచుండెను. పూర్వ మీప్రాంతమును చంద్రవంశపు రాజులే పాలించిరి. పిమ్మట నొకప్పుడు శ్రీశైల ప్రాంతారణ్యమున కిరాతుఁడొకఁడు బహుశూరుఁడై విహారము సల్పుచు హనుమాద్రికడ నొక గ్రామమును నిర్మించి అది రాజధానిగా రాజ్యము పాలించెను. ఆతనికి అనుముఁడు, కొండఁడు అను నిరువురు కొడుకులు గలరు. ఆకుమారుల పాలనమున నా రాజధానీనగరమునకు 'అనుమకొండ' యను పేరుగలిగినది. తరువాత కిరాతరాజులు దానిని పాలించిరి. రాత్రికి రాత్రి సిరియాలదేవి యెఱుకదేవరాజు నొద్దకు విప్రులనంపి శరణ మర్థించెను. ఎఱుకదేవరాజున కేమిచేయుటకుఁ దోచి నదికాదు. సోమదేవ రాజంతటివాఁడే అట్లయ్యె. ఇఁక తానేమిచేయగలడు. తనకు బల్లహు నెదిరించుటకు సైన్య బలమేది! శరణాగత ధర్మమని సిరి యాలదేవిని వెనుకవేసికొని గజపతిచేఁ బట్టువడి తనకు ముప్పు చేఁజేతులఁ దెచ్చుకొనవలసినదేనా! ఈవిధములగు తలంపుల నాతఁడు మనోదౌర్బల్య మునకు లోనయ్యెను. తనకుల బ్రాహ్మణుఁడు నవిరళజపహోమతత్పరుఁడును

మించుక యాతనిని బాధించెను. విజయగర్వమున మొదట నుపేక్షించి నను పిదప నాతఁడు సిరియాలదేవి జాడ లరయించి యాపె అనుమ కొండ దిక్కుమొగంబై పోయెనని తెలిసి యనుమకొండ ముట్టడికి సైన్య ములఁదోలించెను.

మెట్లవారిచే నావృత్తాంతము ముందుగనే యెఱుకదేవరాజునకుఁ జేరెను. ఆతఁడు మాధవశర్మతో రానున్న విపత్తుఁగూర్చి యాలోచించెను.

మాధవశర్మ దృఢమనస్కుఁడు, నిశితమైన చూపుగలవాఁడు. ధర్మ రక్షణమందు ధన ప్రాణము లాతనికి తృణప్రాయములు. కాన భార మంతయుఁ దననెత్తిపైని వేసికొనినాఁడు. తనయింట రక్షణ మొసఁగిన రాజమహిషిని తన కూఁతుగనే భావించుకొనినాఁడు. ఎంతటి ముప్పువచ్చి నను తానాపెను రక్షించుటకే నిశ్చయించుకొనినాఁడు.

అనుమకొండకుఁజేరియున్న బ్రాహ్మణాగ్రహారమున మాధవశర్మ కులపతి. ఆతని యడుగుజాడలలో నావాడ బ్రాహ్మణు లెల్లరు నడుచు చుందురు. నాఁటిరాత్రి శర్మ అగ్రహారములోని బ్రాహ్మణులనెల్లర రావించి ధర్మరక్షణమునకై తన తలకెత్తుకొనిన కార్యభారము వివరించి నాఁడు. సిరియాలదేవిని రక్షింపకున్న ధర్మానుష్ఠానమునకై నిలువఁబడిన బ్రాహ్మణజాతి యుండుటకంటె నశించుటే యుక్తమని ప్రబోధించినాఁడు. విప్రులందఱు నాతని ప్రబోధమున ప్రబుద్ధచిత్తులైరి. అందఱు నేకగ్రీవ ముగా సిరియాలదేవి నాత్మసోదరిగా నెంచి యెట్టి యిక్కట్టులైన భరించి రక్షించుటకుఁ బ్రమాణములు సైకొనిరి. ఆపెను మాధవశర్మ పుత్రికగను తమకు సోదరిగను బ్రకటించుటకు నిశ్చయించుకొనిరి. శంకరభట్టు, భైరవేంద్రుడు, సింహపరవాది, కామదేవుఁడు, అష్టభాషా కవిత్వ ప్రవీణు లగు గోపాల సామవేదులు మొదలుగాగల విప్రపుంగవులందఱు 'వారి జాక్షులందు, వైవాహికములందు, ప్రాణవిత్తమాన భంగమందు, చకిత గోకులాగ్రజన్మ రక్షణమందు బొంకవచ్చు, నఘుముపొంద' దను వ్యాస

భగవానుని భారతసూక్తిని పాటించి యథార్థమును దాచి సిరియాలదేవిని రక్షించుటకు నిశ్చయించి యొకేబాట నడుచుటకు ప్రమాణములు స్వీకరించిరి. మగవారికంటె నాడువారు ధర్మరక్షణమునకు మఱింత దృఢనిశ్చయతను ప్రకటించిరి. మఱునాడే బల్లహుని సైన్యములు పురప్రాంతమున విడిసినవి. బల్లహుడు 'సిరియాలదేవికి మీరాజ్యము నాశ్రయమిచ్చినట్లు తెలియవచ్చినది. ఆమెను మాకు సమర్పించి మాతో సఖ్యము గావించుకొనునది, కానిచో అనుమకొండ రాజ్యము మీదిదానని ఎఱుకదేవరాజునకు వార్తనంపెను.

ఎఱుకదేవరాజు మాధవశర్మను ముందిడుకొని సగౌరవముగ విశేష బహుమానములతో కటకేశ్వరుని స్కంధావారమున కంపెను. సోమదేవ రాజుభార్య సిరియాలదేవి తమవశమున లేదనియు మిత్రులనియు, తమ్మాదరించి బహుమానముల స్వీకరింపవలసినదనియు వేడుకొనెను. పెక్కు ప్రమాణములొనరించినను బల్లహుడు విశ్వసింపలేదు. కాని ఎఱుకదేవరాజు వినయ మాతని మనసు నొకింత ప్రసన్నత నొందించెను. అయినను అనుమకొండ నగరమంతయు సైనికులచే పట్టి శోధించి ఆమెను పరిశోధింపించుటకు నిశ్చయించెను. ఎఱుకదేవరాజు తత్కాలమునకు రాజ గృహంబులకు రాజ స్త్రీజనంబులను, విప్రగృహంబులకు విప్రసతులను, వైశ్యగృహంబులకు వైశ్యజనంబులను, శూద్రనిలయంబులకు శూద్రసతులను మఱియు నానాజాతుల పట్టణముల నాయాగృహపరిశోధనార్థము నియోగించెను. సిరియాలదేవిని వెదకితెచ్చినవారికి అర్ధరాజ్యము నిచ్చెద నని యాజ్ఞగొలిపి పంపెను.

అనుమకొండ రాజ్యమున మేడలు, రాజవాటికలు, బండారపు గృహములు, నేలమాళిగలు, తోటలు, పొదలు నెల్లెడల గాలింపబడినవి. వెదకినతావు మఱల వెదకుచు, చూచినచోటుల తిరిగి చూచుచు పోయినవీథికి మగుడ పోవుచు ఎక్కినమేడల తిరిగి యెక్కుచు సిరియాలదేవికై కటకేశ్వ

రుని భృత్యులు బహుప్రయాసపడి వెదకిరి. సిరియాలదేవి కామగదా కందారంపు పొరుఁ డొక్కఁడైన అనుమకొండలోన వారికి గానఁబడలేదు. వారు ఏఁడుదినంబులు వెదకి విసివిపోయిరి.

విప్రగృహంబుల గాలించిన విప్రులలో కొందఱు మాధవశర్మ యింటిలోపల సిరియాలదేవినిఁజూచి యీపె రాజపత్ని కాదగునని ముందు నిశ్చయించియు బహుజనంబులతో వచ్చిన రాజమహిషి యొంటిగా నుండ నేర్చునే! యీపె విప్రాంగనయే యని మగిడిపోయిరి. పునః పరిశోధన మునకైవచ్చిన కొందఱు ధూర్తవిప్రులు ఆపె అవయవ సౌందర్యవిలాస చిహ్నములఁ బరికించి ఈపె రాజాంగన కానోపునని నిశ్చయించిరి.

కాదుకాదని బ్రాహ్మణ లెంత మొఱపెట్టుకొనినను వినక కటక వల్లభుని సమ్ముఖమునకు వారామెను దోడుకొనిపోయిరి.

అంత బ్రాహ్మణాగ్రహార మంతయు నట్టుడికినట్లుడికిపోయినది. ఎల్లెడల హాహాకారములు బయలుదేఱినవి. 'బ్రాహ్మణ స్త్రీలను బట్టిన అహంకర్ములు యమ పాశములచేఁ గట్టబడి సప్తసంఖ్య రౌరవములఁ బడుదురని వేదము నుడువుచున్నది మీరు వినలేదా! మాపుత్రిని మీరు కొనిపోవు టేమిపాటి? అందచందము లెందఱికుండవు? అందఱిని రాజుల సుందరులనియే తలఁచిన పాపము కట్టికుడుపదా? ఈమె రాజపత్నియైన మాబిడ్డ యని చెప్పికొందుమా?' అని బిగ్గఱగా బ్రాహ్మణులెల్ల రాక్రోశించిరి.

బ్రాహ్మణ స్త్రీ పురుషులందఱు పసుపు వస్త్రములను ధరించి రక్తకుసుమ హారములు ధరించి వీరజట లల్లుకొని రాజసమ్ముఖమ్మునకుఁబోయి సిరియాలదేవి చుట్టును జేరుకొనిరి. 'ఈసతిరాజ కాంతకాదు. విప్రకాంత, మా మాధవశర్మ కూఁతురు. ఈపె పెన్మిటి వారణాశికిఁ బోవుచు గర్భిణి యగుట తమతోఁ దోడ్కొన వీలుకాక మాతృగృహంబున నునిచి పోయినాఁడు. ఇది నిజంబు, ఎట్టి ప్రమాణము చేయునున్న జేసెదము. అట్లు

కృతానుష్ఠానులై సిద్ధేశ్వరుని వేదోక్తముగ నారాధించి బహువిధాన్న భక్ష్యంబుల నివేదనము గావించి దైవసన్నిధిని పంక్తులు దీఱి కూర్చుండి ఆ కాంత నివేదితాన్నంబు లవణంబు వడ్డింపగా నందఱు సంతుష్టిగా భుజించిరి. అదికాంచి ఆమె సిరియాలదేవి కాదని దృఢముగఁదలంచి బలహుఁడంత తన ప్రయత్నము వదలుకొని కటకమునకు మఱలిపోయెను.

తరువాత నొక శుభముహూర్తంబున సిరియాలదేవి ప్రసవించి సర్వశుభ లక్షణ సంపన్నుండైన కుమారునిఁగాంచెను. విప్రులు జననకాల బలము గుర్తించి ఇబ్బాలుండు గర్భాష్టకంబుననే ధరాచక్రంబు మహా మహిమతోఁ బాలింపఁగలఁడని నిశ్చయించి మహానందంబు నొందిరి. జాతకర్మాది విధులు నిర్వర్తించి నామకరణ మొనర్చు సమయమున సిరియాలదేవి 'మీరే మాకుదైవము, దాతలు, భయత్రాతలు నగుట మీరే తల్లిదండ్రులు. ఈ కుమారునకు మీపేరే పెట్టినఁగాని నాకుఁదృప్తిగా' దని మాధవశర్మను ప్రార్థించెను. ఆమె యభిప్రాయమును బట్టి మాధవశర్మ యాబాలునకు మాధవవర్మయను నామకరణం బొనర్చెను. రాజకుమారుఁడు శుక్లపక్ష సుధాకరునిఁబోలి దినదిన ప్రవర్ధమానుఁ డయ్యెను. అనంతరము గర్భాష్టకంబున నుపనయనంబుఁ గావించి మాధవ వర్మను పద్మాక్షిదేవి ఆలయమున ఒక వృద్ధ బ్రాహ్మణుని యొద్ద చదువవేసిరి.

ఒక నాఁటి రాత్రి బాలుఁడగు మాధవవర్మ మరచిపోయి దేవి సన్నిధానమున పెట్టిన తన పలకను పుస్తకమును దెచ్చుకొనుటకై పద్మాక్షి గుడికి వెడలెను. భయంకరాకారముఁ దాల్చి భూతప్రేత బ్రహ్మరాక్షస శాకినీ ఢాకినీ భేతాళ పరివృతయైన పద్మాక్షిదేవినిఁగాంచి రాజ కుమారుఁడు కొంచెముఁగూడఁ జలింపలేదు. ముకుళితహస్తుఁడై దేవి పాదంబులఁ బట్టు కొని అభివందనము సేసెను. పద్మాక్షి బాలుని ధైర్యస్థైర్యములకు మెచ్చు కొని యొక దివ్యఖేటకము దివ్యఖడ్గము నొసంగి వీని మహిమచే మీ కుల

మువారు శత్రువిజయమును సుఖముగా సాధింపఁగలరనియు విప్రపూజయును మాధవార్చనమును మఱువకుండుచో నివి మీయింట వేయి సంవత్సరంబు లుండుననియుఁ దెలిపి పంపెను.

తరువాత నాబాలుఁడు ఎఱుకదేవరాజు సాయమున సైన్యము చేర్చుకొని కళింగవల్లభునిపై దండయాత్ర వెడలి యాతని యుద్ధమునఁ దునిమి తమ గోధనంబుల పదునూరువేల యేనూరు మందలను మరల తోలించుకొని కందారమునకు వచ్చెను. ఎఱుకదేవరాజు అనుమకొండ నుండియే మాధవవర్మ ఇంతటి యభివృద్ధిని గాంచగల్గినందులకు అనుమకొండ రాజధానిగా ఇచ్చటనే రాజ్యాభిషేకము నొందవలసినదని పట్టుపట్టి తనసర్వస్వము మాధవవర్మకు సమర్పణము చేసెను. ఒమ్మటి అనుమకొండ రాజ్యమునకు మాధవవర్మ పట్టాభిషిక్తుండయ్యెను.

తరువాత మాధవవర్మ పెక్కురాజ్యముల జయించెను. అమరావతి రాజ్యమును జయించి ఎఱుకదేవరాజున కొసంగెను. విప్రులకు పెక్కు అగ్రహారముల దానమొనర్చెను" అని చెప్పి రామారణ్యులు వారొకింతసేపూరకొని తిరిగి యిట్లుపక్రమించిరి.

"మాధవశర్మ అనుగ్రహముతో నంతవాఁడైన మాధవవర్మయే మీవంశ మూలపురుషుఁడు. మీవంశ ముత్సన్నము కాకున్నప్పుడు నిండు గర్భిణియగు సిరియాలదేవిని రక్షించి మీ వంశాంకురమును నిలిపినది బ్రాహ్మణులేకదా ? బ్రాహ్మణానుగ్రహ మీవిధముగా మీవంశమును కాపాడినది.

మాధవవర్మకు పద్మాక్షీదేవి వలన 'పద్మసేనుఁడు' జనించెను. పద్మసేనుఁడు పుత్రులు లేక విప్రానుమతమున సిద్ధక్షేత్ర శ్రీమన్మహాదేవుని నిత్యంబును కూష్మాండ ఫలంబులచేఁ బూజించి తత్ప్రసాదంబున వెన్నము రాజను కుమారునిఁగనెను. వెన్నమరాజు వంశమున గుండ్యన జనించెను.

ఈ గుండ్యన తాను కాకతిరాజ వంశస్థుడని తెలుపుకొనుటకు తన నామము ముందు 'కాకత్య' పదమును ధరించెను.

కాకత్య గుండ్యన నాఁటినుండి జైనమతమును మీవంశము వ్యాప్తికిఁ దెచ్చినది. గుండ్యనవంశమున మీ ముత్తాత మొదటి బేతరాజు జనించెను. ఈతనికి నెఱుకదేవరాజనియు పేరుగలదు. అతనికి భువనైకరాయఁడు, భువనైకమల్లుఁడు నను బిరుదములు వహించిన మీ తాత మొదటి ప్రోల రాజు జనించెను, అతనికి త్రిభువనైకమల్లుడని బిరుదు వహించిన మీ తండ్రి రెండవ బేతరాజు జనించెను. వీరందఱు జైనమును వ్యాప్తికిఁ దెచ్చిన రాజులే. జైనులకు వేదబ్రాహ్మణ భక్తిలేదుగదా! మతప్రచారము నకై జైనరాజులు వేద బ్రాహ్మణ హింసకుఁగారకులైరి. అందుచే నాఁటినుండి మీవంశమున బ్రాహ్మణా నుగ్రహము తప్పినది. బ్రాహ్మణ ద్వేషము మీ వంశమునఁ దలయెత్తినపుడు మీకు రాజ్యచ్యుతియు నారంభ మగునని వశిష్ఠమహర్షి కాకతి రాజునకు ఋషిసవన సమయమునఁబల్కిన పల్కులు యధార్థమై మీవంశమున రాజ్యక్షీణత ప్రారంభమైనది. మహా రాజులుగ రాజ్యములేలినను జైనమత ప్రవేశముతో తొల్లిటి స్థితి పతనమై మీ వంశము వారొకరిని గొల్చియుండు సామంతరాజులు కావలసిన నైచ్యదశ పట్టినది. మీ వంశకథను గుర్తించి నీవు జైనము నుజ్జగించిన తొల్లిటి రాజ్యవైభవము నందఁగలవు. మీ వంశము చిరకాలము స్వతంత్ర రాజ్యస్థాపనమున వన్నెకెక్కనుగలదు.'' అని శ్రీపాదులవారు ముగించిరి.

ప్రోలరాజునకు తమపూర్వవంశ కథాకథనముతో తనకు కర్తవ్యము నుపదేశించిన శ్రీపాదులవారియందమిత భక్తివిశ్వాసములు గుదురు కొనినవి. 'గురుదేవా? నాఁటి బ్రాహ్మణానుగ్రహము మావంశమును నిల్పినది. నేఁటి బ్రాహ్మణా నుగ్రహము మావంశము సుస్థిరముగా స్వతంత్ర రాజ్యస్థాపనము నిల్పుకొనుటకు తోడ్పడవలెను. మీరేనాకు

గురువులు శైవమును. మీరు నాయింటనుండి సర్వము నిర్వహింపవలె నని విధేయతతో నంజలిఁబట్టి ప్రోలరాజు వేఁడుకొనెను.

'వత్సా! నీవేమియు సందేహింపకుము. సర్వము చక్కఁబడఁ గలదు. రామేశ్వర దీక్షితులు మీ తండ్రి బేతరాజునకు గురువు. నీతండ్రి జైన మతస్థుఁడైనను ప్రజాదరణమునకై శైవమునుగూడ నారాధించెను. నాఁడు రామేశ్వర దీక్షితులాతనికి గురువయ్యెను. మీయింటి పూర్తిగ గురు వాక్యానుసారము శైవమునకుఁదగు ప్రాతినిధ్య [illegible]. లేనిచో నీ తండ్రి నాఁడే మీ రాజ్యమింతను విస్తరించి యుండును. నీవిప్పుడాతనిని నీయొద్దకు రప్పించుకొనుము. అతఁడు రాజ్యాంగ శాస్త్ర మునఁగూడ నారితేరిన దిట్ట. మేమిరువుర మొకే గురువునొద్ద సహాధ్యా యులము, నేనును నీకు వలసినప్పుడు వచ్చి చెప్పఁగలను. నేను ప్రత్యక్షముగ రాజకార్యములను జూడఁజాలను. ఆయన దీక్షితులు సర్వ మంగళము చేకూర్పఁగలఁడు. రేపటి యుదయమే నీవు [illegible] మునకు బయలుదేఱి ఆతని సందర్శించి నా మాటగాఁ జెప్పి యింటికిఁ దెచ్చికొనుము. ఇది నాయాజ్ఞగాఁ బాలింపుము', అని శ్రీ [illegible] ప్రోలరాజు నాదేశించి పల్కిరి.

ప్రోలరాజు కృతజ్ఞతతో గురువాక్యము స్వీకరించి [illegible] పాదాభివందనము గావించెను.

నాఁటి రాత్రి శ్రీపాములవారి యాతిథ్యము స్వీకరించి యచట విశ్ర మించి మఱునాఁడు వేఁకువనే ప్రోలరాజు [illegible]మునకు బయలువెడలెను.

ఏఁడవ ప్రకరణము.

# శివకటాక్షము.

ప్రోలరాజు పరిపాలనమునాఁటికి ఆంధ్రదేశమునందంతటను క్రమముగా జైనులపైని ప్రజల కాదరాభిమానములు సడలఁజొచ్చినవి. వారి యక్షిణీశక్తుల మాహాత్మ్యముపైని వారికి నమ్మకము పోయినది. ఒక్క నిదర్శనము సత్యము కాకపోవుటతో వారికి జైనుల కపటనాటక మర్థమై పోయినది. ఇష్టదైవముమాటటుంచి అసలు దైవారాధనమే లేకుండుటచే బౌద్ధమతము పాషండమై ప్రాణములేనిదై ప్రజాజీవనమునకు నిరర్థకమైనది. తమ దుఃఖములను ప్రోద్రోలువాఁడెవఁడోయొకఁడులేక తమ బ్రతుకులు గాలిలో దీపములవలె నారిపోవుచున్నవని ప్రజల మనసులు ఆరాటపడఁజొచ్చినవి.

శ్రమణకులు దేశమందంతటఁ దిరుగుచున్నారు. మఠములు, విహారములు, స్థూపములు, చైత్యములు, వేలకువేలు దేశమందంత వెలసినవే కాని ప్రజలజీవితముల కవి ధైర్యోద్యోత్సాహము లీయఁజాలకపోయినవి. క్రమముగా స్త్రీలుగూడ సన్న్యాసినులై మఠములలోఁ బ్రవేశించిన తర్వాత బౌద్ధ, జైన యతులు భ్రష్టులై ప్రజావిశ్వాసమును గోల్పోయిరి. బౌద్ధ విహారపోషణకు రాజులు, రాణులు నొనర్చిన మడిమాన్యముల, దానములు పెరిగి శ్రమణకులు భోగలాలసులై ప్రజలదృష్టికి వెగటుఁ గల్పించిరి.

మానవుని నిత్యజీవితమునందు దుఃఖనివృత్తికి సుఖప్రవృత్తికి దైవాలంబన మావశ్యకమను వైదికమత సిద్ధాంతముపైని కాంక్ష జైనమత ప్రవిష్టులైయున్న ప్రజలకు ప్రబలము కాఁజొచ్చినది. కాని బ్రాహ్మణ

మతమునఁ దిరుగ ప్రవేశమునకుమాత్రము వారిమనసు లిష్టపడుట లేదు. బ్రాహ్మణమతమున తత్త్వసిద్ధాంతము లందరానిఫలములై యుండు టయేకాక కుల, జాతి, మతములు గల్పించి న్యూనాధికతల నిర్మించు కొనియుండుటచే అమతమును వారి కిష్టముకాలేదు.

ప్రజామనస్సు లట్లు సంక్షుభితములై యొక క్రొత్తమతము నన్వే షించుకొనుట కుద్యుక్తములగుచున్న యీసమయమున రామేశ్వరదీక్షితులు హిడింబాశ్రమమునుండి అనుమకొండ రాజ్యాధిపతియగు ప్రోలరాజుచే రప్పింపఁబడినాఁడు. శ్రీపాదులవారి యాజ్ఞానుసారముగా ప్రోలరాజు దీక్షితులవారిచే చిన్మయదీక్షనంది గురుసేవాతత్పరుఁడయ్యెను. దీక్షితులు ప్రోలునితండ్రి బేతరాజునకును గురువే. కాని బేతరాజు దీక్షితుల వీరశైవ మును ప్రజలలో ప్రవేశపెట్టుటకు తనకాలమంత తగినదిగా తలంపలేదు. జైనప్రవిష్ఠులైయున్న బహుప్రజలను జైనమునుండి తప్పించుటవలన ప్రజావిప్లవములేచి రాజ్యసుస్థిరతకు నాటంకము లేర్పడునని యాతఁడు తలఁచియుండెను, కాని అప్పుడే జైనబౌద్ధములుపై ననాదరమంకురించిన ప్రజలను చేఁబట్టుటకాతఁడు శైవమును వీరరూపమునగాక శాంతమార్గ మునఁ గొంతవరకు ప్రజ కందించియేయుండెను. శివాలయములు గట్టించి శైవమున కాలంబమునుఁ గల్పించినాఁడు. తాను జైన శైవములకు మధ్య స్థుఁడుగనుండి ఇరుమతస్థులకుఁగూడ నాశ్రయుఁడై ద్వంద్వమార్గమున రాజ్యము నడిపించినాఁడు. రెండుమతములను దాను చేఁబట్టినను బహు ప్రజల మన్ననలందుకొనియున్న జైనమునకే యెక్కువ మ్రొగ్గియుండెను. ఈ ద్వంద్వరాజనీతి రామేశ్వరదీక్షితులకు నచ్చలేదు, అందుచే దీక్షితుల వారచ్చటనుండక అప్పుడప్పుడుమాత్రము బేతరాజునకు దర్శనమొసఁగుచు హిడింబాశ్రమమునే నివాసముఁజేసికొనిరి. చిరకాలమునకు తిరిగి ప్రోల రాజు ప్రార్థనముచేతను, రామారణ్యశ్రీపాదుల ప్రోద్బలముచేతను దీక్షి తులవారు అనుమకొండకు చేరికొనిరి.

ప్రోలరాజు సింహాసనమునకు కొంచెమెత్తుగా నొక వజ్రపీఠముపైని వ్యాఘ్రాజినమున రామేశ్వరదీక్షితులవా రుపవిష్టులైరి. ఒడలినిండ తెల్లని భస్మ త్రిపుండ్రములతో మెడను పటముగనున్న రుద్రాక్షమాలలతో జడలుగట్టిన కేశపాశపుముడితో యోగదండము నానుకొని చేత జపమాలఁ ద్రిప్పుచు కన్నులరమోడ్చి కూర్చుండియున్న దీక్షితులవారు సాక్షాత్తు పరమశివునివలె నుండిరి. ప్రోలరాజు వినయవినమితగాత్రుఁడై గురువు వంక దృష్టినిలిపి శ్రవణతత్పరతను దెలుపుచుండెను.

దీక్షితుల్లవారు కనులుమూసి 'శివోఽహం శివోఽహం శివోఽహం' అని ముమ్మాఱుచ్చరించి యొకింత ధ్యానముసలిపి ప్రోలరాజుపై దయా దృష్టిపఱపి యిట్లుపన్యసింప నారంభించెను.

"వత్సా ! వినుము. రాజెటు మతవ్యాపకుఁడు కాకతప్పదో దెలుపు చున్నాను. రాజ్యవిస్తరణకాంక్షియగు రాజు ప్రజామనస్తత్వమును గమనించి ఆ మనశ్శక్తికి తాను మ్రొగ్గి తనవైపునకు దాని నాకర్షించుకొన వలెను. 'ప్రజామతం మతం రాజ్ఞః' అనునది రాజ్యాంగ మూలసూత్రము. రాజ్యమును విస్తరింపఁజేసికొనుటకు, సుస్థిరపఱచుకొనుటకు రాజులు ప్రజామనస్తత్వము ననుసరించి మతములవృద్ధిపఱచి తమ మనుగడ సాగించుకొనిరేకాని యేమతము దానికైయది వృద్ధికాలేదు. రాజకీయ పక్షములే మతనామముల ధరించినవికాని వేఱుగాదు. కుల జాతిభేద ముల నాపాదించిన వైదికమతము నాఁటి రాజ్యసుస్థిరతకు కావలసియే యేర్పడినది. క్రమముగా న్యూనాధికభేదములు పెచ్చుపెఱిగి ఆమతము ప్రజావిశ్వాసమును గోలుపోవుచున్నకాలమున కుల మత జాతి భేదరహిత ములగు జైన, బౌద్ధము లవతరించినవి. వానిని వ్యాప్తిఁజేసి రాజులు ప్రజా పక్షమును దమవైపునకుఁ ద్రిప్పుకొని రాజ్యముల స్థాపించినారు. నేఁడు ఆమతములకును నీచస్థితి పట్టినది. వానిలోఁగల లోపములు వాని వినాశ మునకు నేఁడు కారణములగుచున్నవి.

సామాన్యప్రజల మనస్సు చాల దుర్బలమైనది. సుఖ భోగైక ప్రవణమైన వారిమనస్సును కేవల సన్యాసమార్గమునకుఁ ద్రిప్పుట కేమతమును కృతకృత్యము కాలేదు. మఱియు వారి కోరికలను నెఱవేర్చుకొనుటకు వారికి శక్తిచాలనప్పుడేదో అదృష్టశక్తి వారికి తోడుపడునను బలము వారి మనసునకిచ్చినపుడే వారికి కొంత ఆరాటము తగ్గునుకాని అన్ని కార్యఫలములు మనపనులలోనే యున్నవను మాటపైని వారి మనసు నిలద్రొక్కుకొనఁజాలదు. మనసునకు బలము నాపాదించు దైవవిశ్వాసము లేకుండఁజేయుటచేతను, అందఱను శ్రమణులుగా తయారుచేయుచుండుట చేతను బౌద్ధ జైనములు పతనోన్ముఖములైనవి. ప్రజామనస్సు వానినుండి విముఖమై నిర్జీవమైనది, ఈసమయములోనే రాజు క్రొత్తమతమును చేపట్టి ప్రజలకు నూతనోత్సాహము పుటింపవలెను. ప్రస్తుతకాలమునకు శైవమతము తగియున్నది. అందు జాతి కులభేదములులేవు. ప్రబలమగు ఏకేశ్వరోపాసనాసిద్ధాంతము నంటిపెట్టుకొనియుండుటచే నందు ప్రజా మనస్సు చలనములేక ఏకోన్ముఖమై యుండఁగలదు. ఇఁకదానిని వీరప్రచానముచేసినచో వేఱ సైన్యమును పోషింపవలసిన పనిలేదు. ప్రాఁతమతమును పోద్రోలుటకు ప్రప్రథమమున క్రొత్తమతము వీరరూపమును దొడుగకున్నచో త్వరలో వ్యాప్తికి రాఁజాలదు. జైనమును కూకటివేళ్ళతోఁ బెల్లగించి వీరశైవమును స్థాపింపవలసినదని మీతండ్రి బేతరాజునకు నేను చెవినిల్లుఁగట్టుకొని బోధించితిని. అతఁడంత సాహసమునకు దిగలేకపోయినాఁడు. నేఁడు నీవైన ఆపనికి పూనుకొనినప్పుడే నియభీష్టము సాధించుకొనగలవు" అని పలికి దీక్షితులవారొకింత మౌనము వహించిరి.

ప్రోలరాజునకు హృదయమథనము ప్రారంభమైనది. అతనికి శ్రీపాదులవలన తన వంశవృత్తాంతము విన్నప్పటినుండి తిరిగి తాను ద్విజచిహ్నము ధరించి క్షత్రియత్వమాపాదించుకొనఁ దలచియుండెను. అతనికి బ్రాహ్మణభక్తితో కాకతిరాజ్యమునకు వృద్ధిగలదనుమాట శ్రీపాదుల

వలన క్రొత్తగ చెవికి సోకినది, ఆమాటలో నొక సత్యమున్నదని పూర్వచరిత్రము నిరూపించుచున్నది, కాని అంతసులభముగా నాతఁడు వీరశైవమును విశ్వసింపలేకుండెను. అందునను బ్రాహ్మణమతముకంటె వీరశైవమతమెట్లు ప్రతిష్ఠతగలదో ఆతనికిఁ దోఁచలేదు. సందేహాందోళిత మనస్కుఁడై దీనవదనముతో దీక్షితులవంక దృష్టిఁబరపి "గురుదేవా! సహేతుకమగు మీవాదము కాదనుపాటివాఁడనుకాను. కాని బ్రాహ్మణమతమును గాదనకుండ శైవమును వ్యాప్తి పొందింపఁదగదా? దైవవిశ్వాసమును ప్రవేశపెట్టుటకై బౌద్ధ జైనములను కాదనవచ్చునుగాని అనాదినుండి వచ్చు బ్రాహ్మణమతమును కాదనుట యెందులకు? బ్రాహ్మణమతమందలి మంత్రములను, దేవతల యారాధనమును, ఆత్మతత్త్వసిద్ధాంతములను కాదనుటయెట్లు? దేవతలను మంత్రశక్తివలన స్వాధీనముచేసికొని ప్రజలకు శ్రేయస్సులందించు పని విడుచుట భావ్యమగునా? శ్రీపాదులవారు మా పూర్వవంశము రాజవంశమని పురాణముఁ దడివిచెప్పిరి. క్రమవారని ప్రసిద్ధినొందిన ఐదువందల మంది గోత్ర ప్రవర్తకులగు రాజులలో నొకఁడగు కాకతిరాజు మా మూల పురుషుడుగా, మేము సూర్యవంశ క్షత్రియులమై ఆత్యర్కేందు కులస్థులైన తెలుఁగుఁ దెల్పి బ్రాహ్మణభక్తి కల్గియుండునది యని చెప్పియున్నారు. నాఁటినుండి నాకు క్షత్రియచిహ్నమగు యజ్ఞోపవీతము ధరించి ద్విజకర్మ లాచరింప దీక్ష పొడముచున్నది. ఈ భావమంతయు విడిచివేయవలసి నదేనా? పైఁగా వీరరూపమును శైవమతమునఁ బ్రవేశపెట్టిన ప్రజావిప్లవము రేకెత్తదా? గురుప్రభూ! నా మనస్సును మీ మాటలకు నిలద్రొక్క లేని యస్థిరస్థితినుండి తప్పింపుఁడు' అని చేతులు జోడించి వేఁడుకొనెను.

రామేశ్వరదీక్షితులు శిష్యుని సందేహములకు దరహాసముతో నిట్లు సమాధానమొసఁగెను.

"వత్సా! నీకుఁ గలిగిన సందేహము లందఱకును గలుగునవే ? రాజ్యాంగసౌధము ప్రజామనస్సును గట్టిగ కట్టియుంచు మతవిశ్వాసమను

గట్టిపునాదులపైని నిర్మింపవలసియుండుననుసూత్రము విశ్వసింపక తప్పదుసుమా! ఇఁక ప్రజామనస్సును గట్టియుంచుటకు బ్రాహ్మణమత మీనాఁటికి నిర్వీర్యమైనది. జ్ఞానమార్గమందలి అద్వైత తత్త్వసిద్ధాంతములు సత్యములే కావచ్చును. కాని యవి అందని మ్రాఁకులపండ్లు. వానిని ఎవరేని కొద్దిమంది జిజ్ఞాసులచే నమ్మింపఁజేయవచ్చును గాని సామాన్య ప్రజలచే నమ్మించి ప్రజామనస్సు నేకీకరించుటమాత్రమసాధ్యము. వారికి సగుణ రూపారాధనము కావలెను. ఆమతమందు సగుణరూపములునున్నవి, కాని అవి ముక్కోటిదేవతలకు ముక్కోటిరూపములు. అందఱు దేవతలు కోరికల నొసంగఁగల శక్తిమంతులే. ఇఁకనేమి? ప్రజలు వివిధదేవతల నారాధించుచు వివిధమతస్థులైయుందురు. అందఱు నొకేదేవుని రూపములని ఎంత చెప్పినను సమ్మతముకాదు. ఇఁక ప్రజామనస్సు నేకముచేయుట యెట్లు? రా జేదైవమును చేపట్టినను దుర్బలుఁడేయగును. తమ మతమేగాని అన్య మతము కిట్టక ప్రజలు కోటిమతస్థులై తగవులతో రాజ్యమును క్షుభితమొనర్తురు. బ్రాహ్మణమతమునఁగల యీలోపమును చూచుకొనియే ప్రజా మనస్సు నేకీకరించుటకై దైవారాధనములే త్యజించుట యొక సిద్ధాంతముగా బౌద్ధము వెలసినది. ఇప్పుడదియు పటిష్ఠముగాలేదు. రాజ్యాంగసుస్థిరతకు మతము పునాది. మతములేని రాజ్యము పునాదిలేని సౌధము వంటిదే యగుచున్నది. అందుచేతనే రాజ్యములు మాఱునప్పుడు మతములును మాఱుచున్నవి. శ్రీపాదులు రాజ్యాంగశాస్త్రమున నిష్ణాతులు కాలేదు. కాననే నిన్ను నాయొద్దకుఁ బంపినారు.

ఏకేశ్వరోపాసనముచే ఆస్తికతనునేఁడు స్థాపింపవలసియున్నది. నిజమునకిది వైదికమతమునకు దూరముకాదు, జైనమున వేదబ్రాహ్మణారాధనముపనికిరాదు గాని శైవమునందది విరోధముకాదు. మూఁడుతరములనుండి యజ్ఞోపవీత ధారణము లేనివారికి వేదమతమునను ద్విజత్వము తిరిగి

రాదు. ఇఁక తొల్లిటి క్షత్రియత నెట్లు సాధింతువు? అస్తికత్వము బ్రాహ్మమతముయొక్క మూలసూత్రమే. సగుణనిర్గుణోపాసనలకు భక్తి మార్గము సంధిబంధముగనున్నది, మానవుని నిత్యజీవితమునందు దుఃఖ నివృత్తికిని, సుఖప్రాప్తికిని దైవసందర్శనము సాధనముగనున్నది. జైన బౌద్ధములు సంసారము దుఃఖమయమనియు, సన్యాసము సుఖసాధన మనియు నుపదేశించినవి. అద్వైతము సంసారము మాయాకల్పితమని యుపదేశించినది. ఈ రెండుపదేశములు సామాన్యప్రజల చెవికెక్కనవి కావు. రాజునకు సామాన్య ప్రజామనస్సునేకీకరించుటే కావలసినది. దైవములలో శివుఁడు, విష్ణువు నిరువురు నెన్నికకెక్కినవారు. అందు విష్ణుతత్వముకంటె శివతత్త్వము శ్రేష్ఠమైనది. వైష్ణవము నానాత్వమునకు దారితీయును. శైవ మేకత్వమునే దృఢపఱచును. శైవమతము వైదికమత పరిణామమే. వైదికమంత్రోపస్థితుఁడైన రుద్రుఁడే శివరూపపరిణామము నొందుచు 'శివోఽహం' అను తత్త్వమును వ్యక్తముచేయుచున్నాఁడు.

"శివుఁడు సగుణ నిర్గుణ పరబ్రహ్మ, శివుడు హిమాచలమునందు గౌరీశంకరుఁడు, రామేశ్వరమునందు రామలింగేశ్వరుఁడు, కాశ్మీరమునందు మహాదేవుఁడు, వారణాసియందు విశ్వేశ్వరుఁడు, మధురయందు సుంద రేశ్వరుడు, సౌరాష్ట్రమున సోమనాథుఁడు, శ్రీశైలమున మల్లిఖార్జున స్వామి. అధర్వశిఖయందు 'ఈశ్వరశ్శివ ఏవచ, శివఏకోధ్యేయః శివం కరః' అని యున్నది. శివలింగార్చనమును అద్వైత మతస్థాపకులు శ్రీశంకరులు వారి పీఠమునందు ప్రతిష్ఠించిరి. అష్టమూర్తియగు శివుఁడం దఱికన్ని యైశ్వర్యములిచ్చును. కాని తనకు మాత్రము ఐశ్వర్యానుభవ కాంక్షలేదు. ఇంతత్యాగమూర్తి యగు దేవుఁడు లేనేలేఁడు.

లింగమనగా చిహ్నమనికదా యర్థము. భగవంతుని చిహ్నములే ఆకాశలింగము, వాయులింగము, తేజోలింగము, అపోలింగము, పృథ్వీ

లింగము. అవ్యక్తమునకు వ్యక్తస్వరూపములగు దైవములివి. నిరాకార మును దెలుపుటకే లింగాకారమునకు ముక్కుచెవులును కాలుసేతులునులేవు.

శివలింగమును సర్వవర్ణములవారును వర్ణవిపక్షపాతరహితముగ పూజించు చున్నారు. బ్రాహ్మణులు దేవతార్చనలందును సకల వర్ణముల వారు దేవాలయములందును పూజించుచున్నారు. స్వీయాంగములందు లింగము ధరించువారు లింగధారులు. వీరిలో శైవులు వీర శైవులునుగూడ నున్నారు. లింగధారణమున గూఢార్థమును బాహ్యార్థమునుగూడ గలిగి వీరశైవమునకు విశిష్టత చేకూర్చుచున్నవి. పరమేశ్వరుడును తనరును విడవడని సంబంధము దెలుపుటయే లింగధారణమున కర్థము. ఆత్మావ లోకనము బాహ్యాభ్యంతరములందు లింగనిరీక్షణమువలన సాధ్యమగు చున్నవి.

ఇక వీరశైవము మాటవినుము. వీరశైవము వైదికమతమును, జైన బౌద్ధములను నెదుర్కొను సైన్యముగా నేర్పడినది. జైన బౌద్ధమతములు నాస్తికమతములు. ప్రజాహృదయమునందు భక్తిమార్గము ప్రబలి నూతన వికాసముదయింపవలెను. వీరశైవులు వైదికులవలె కర్మమార్గము నామోదిం పరు. జాతికులముల నాదరింపరు. ఉపనయనాది కర్మలను నిరసింతురు. అకులస్థుడైన దేవుని భక్తునకు కుల నియమమేమని వారిప్రశ్న, వీరశైవులందఱు జాతిమతకుల భేదములేని శివభక్తులు. అష్టాదశ వర్ణ ములవారు వీరశైవులై కులభేదములను త్యజించి యైక్యమును సంఘటిం తురు. శివభక్తులకు కీడుదలచువారిని ఛేదించుట వారికి పుణ్యకార్యము. అందులకై వారు లింగపసాయిత మను శస్త్రమును ధరించుచున్నారు.

లింగధారణము, విభూతి రుద్రాక్షధారణము, పంచాక్షరీ మం త్రము, లింగపసాయుత శస్త్రధారణములవలన శివభక్తి వీరస్వరూపమును ధరించుచున్నది. బౌద్ధులకువలెనే వీరికిని త్రిశరణములు గలవు. గురు లింగ జంగములు వీరికి శరణములు.

వైదిక మతమునందలి ఆస్తికత్వము, వేదాంతమునందలి తత్త్వా ర్థము, జైన బౌద్ధములందలి సంఘారాధనము, వివిధమతములందలి కర్మా రాధనము వీరశైవమునందు సంయోగమును పొందినవి. అదృశ్యదేవతలను గాక మహాసిద్ధిమంతులగు వీరమాహేశ్వరులను వీరు జంగమ లింగములని యారాధింతురు. జంగమ లింగములు శిష్యులను పరీక్షించి సర్వార్థసిద్ధు లొడఁగూర్చుచుందురు. ఈజంగమ లింగములవలన మతము క్షీణింపక నానాఁటి పటిష్ఠతను పొందుచుండును.

జైనులు బౌద్ధులు కర్మ సన్యాసులై సంఘమునందు విరక్తిభావము వ్యాపింపఁజేసిరి. గృహస్థాశ్రమమునందును విరక్తిని ప్రబలించిరి. ప్రజలు నిరాశ్రయులై నేఁడు సంఘ శక్తి క్షీణించియున్నది. బలములేని సంఘము స్వధర్మ నిర్వహణమునకే నిరుపయోగమైనపుడు రాజ ధర్మమున కేమాత్ర ముపయోగపడును? ప్రస్తుత ప్రజామనస్తత్వమునకు జైనమతము బౌద్ధమతముకూడ పనికిరావనుట నిశ్చయము. నీవు శ్రీపాదులవారు చెప్పినట్లు బ్రాహ్మణభక్తి కలిగియేయుండుట కిందభ్యంతరములేదు. నేఁటి సంఘాభిరుచులకిది తగియున్నది. కాన సంఘమును వీర్యవంతముగఁజేసి రాజ్యమును విస్తరింపఁజేసికొమ్ము. నేఁటి పరిస్థితులలో వీరశైవమత వ్యాప నముననే కాకతిరాజ్యవ్యాపనము కాఁగలదు. నామాటలందు సందేహ ముంచక దృఢవిశ్వాసముంచుము. ఉత్తిష్ఠత, జాగృధ, ప్రాప్యవరాన్ నిబోధత'' అని ఉచ్చైర్నాదమున నుచ్చరించెను.

ప్రోలరాజు గురుని గంభీరోపన్యాసమున విగత సంశయుఁడై ఆస నమునుండి లేచి నిలఁబడి భక్తినమ్రుఁడై కరకమలముల మొగిచి గురు పాదాభివందనముఁజేసెను.

దీక్షితులు రాజు శిరముపై చేయుంచి కనులొకింతమూసి 'రాజా! పరమశివుఁడు నీకు వరము లొసఁగ చేయెత్తి దీవించుచున్నాడు. అందు

కొనుము' అని ధ్యానముద్ర వహించెను. రాజును కనులుమూసి ధ్యాన మగ్నుఁడయ్యెను.

ఇంతలో వీధిలో పెద్ద కలకలము. ఆ కలకలము క్రమముగా దగ్గరై రాజద్వారమును ప్రవేశించినది. ద్వారపాలకులు ససంభ్రమముగ లోనఁ బ్రవేశించి 'మహారాజా! జయము జయము' అని బిగ్గఱగ నఱచిరి. ఆజయారావముతో గురు శిష్యు లిద్దఱు ధ్యానముచెడి ఏమది! యని యొక్కమా ఱులికిపడి చూచిరి.

'క్షమింపుఁడు స్వామీ! ద్వారమున జనుల కోలాహలము నాపలేక స్వామికి విన్నవించు తొందరలో సముదాచారము మఱచితిమి' అని భటులు వణంకసాగిరి.

భయములేదు, 'ఏమి యా కల్లోలము? వేగిరము తెల్పు'ఁ డని ప్రోలరాజొకింత శాంతుఁడై యడిగెను.

'అయ్యా! మన గ్రామమునకు రెండుక్రోసులదూరములో వేఁకువ జామున నన్యగ్రామమునుండి వచ్చు సరుకు బండ్లలో నొకటి నేల కొర గల్లుపడి యెంతయెత్తినను లేవకున్నది. పైగా నాచక్రనేమి స్వర్ణమయ మైనది. ఈదృశ్యమును చూచుటకు పురమంతయు నచ్చటనేయున్నది. ప్రజలు తమకీవార్త తెలుపుటకు గుంపుగూడి వచ్చి గోలసేయుచున్నారు. పిమ్మట ప్రభు చిత్తము' అని చేతులుకట్టి ద్వారపాలకులు వచించిరి.

ఆమాటవిని రాజు ఆశ్చర్యచకితుఁడై గురుముఖము నీక్షించెను. గురువు చిరునగవుతో గడ్డము మీసము సవరించుకొనుచు 'శివకటాక్షము తానై నిన్నన్వేషించుచున్నది. నడువుము పోయి దర్శింతము' అని యాస నమునుండి దిగ్గన లేచెను.

ద్వారమునందు సిద్ధముచేయఁబడిన బంగరు పల్లకులలో గురు శిష్యులిరువురు బయలుదేరిరి. వారి వెనుక దండనాథుఁడైన గంగాధరా

మాత్యుఁడు బయలుదేఱెను. వెనువెంట నమాత్యులు వెడలిరి. అటుపిదప రాజ్ఞి ముప్పాంబాదేవి సఖీ పరిచారికా సమేతముగా బయలుదేరినది. వారి నను గమించి పురప్రముఖులు వెడలిరి. ఎవరికి తగు వాహనములలో వారు బయలుదేరిరి.

ఎనిమిదవ ప్రకరణము.

# స్వయంభూ లింగము.

నాఁటి వేకువజామున వ్యాపారార్థమై రెండెడ్లబండ్లమీఁద ధాన్యపు బస్తాలు వైచుకొని వర్తకులు అనుమకొండకు వచ్చుచుండ నచటి కాగ్నేయమున అనుమకొండకు క్రోశద్వయదూరమున నిర్నిమిత్తముగ నొక శకటము హఠాత్తుగ ఒరగల్లువడినది. దానితో వెనుకవచ్చు బండ్ల న్నియు నాగిపోయినవి. బండ్లుత్రోలువారందఱు 'ఏమిజరిగినది' అని ఆత్రముతో ముందుబండియొద్దకుఁ బరుగిడిపోయిరి. బండిచక్రమొకటి నేలలోనికి దిగిపోయినది. మార్గము పొడిగా గట్టిగానున్నను చక్రము లోనికి దిగఁబడుట అందఱకు వింతగలిగించినది. ఆ దిగఁబడినచోట ఎంత ఊఁతముగా ఘట్టనమొనర్చినను తమ పాదము లంగుళములోఁతుగూడ దిగఁబడలేదు. దాపటికల్లుకుఁ్రంగి పూటిబండి యేటవాలుగా నొరగినది. ఎడ్లు గుంజలేకపోయినవి ఎందఱు భుజములుకాసి త్రోసినను చక్రము కదలినదేకాదు. బండిపైని బరువు తొలఁగించి అందఱు తలపడియెత్తిరి. ప్రయోజనము శూన్యము. పొద్దెక్కినకొలఁది యాతాయాతజనము సందడి హెచ్చినది. అందఱు అన్నియుపాయములు చేసిచూచిరి. ఫలిత మిసుమంతయు కనఁపడలేదు. వచ్చుపోవుజను లావింతనరయుచు నక్కడే యాగిపోఁజొచ్చిరి. క్రమముగా నీవార్త అనుమకొండఁజేరినది. ఈవింత నారయ పురజను లుత్సాహముతో వాహనములపై నచటికి వచ్చిపడిరి. క్షణములో అచ్చట మహాజనసముద్ర మేర్పడినది. ఆ ప్రదేశమంతయు గొప్ప తిరునాళ్ళవలె నుండెను.

ప్రోలరాజు భూమిలోదిగఁబడిన చక్రమును, చక్రనేమి స్వర్ణమయ మగుటనుజూచి యాశ్చర్యపడెను. రామేశ్వరదీక్షితులును అద్భుతపడెను.

జ్యోతిష్కులు లెక్కలుకట్టి ఈసమయము రాజ్యమునకు రాఁగల మహత్తర మగు అభ్యుదయమును సూచించుచున్నదనిరి. రాజు రామేశ్వరగురువర్యుని వంక వినమితశిరస్కుఁడై యంజలిపట్టి ప్రశ్నార్థముగ చూడసాగెను. రామేశ్వరదీక్షితులు చిఱునగవుతో శిష్యునాదరించి క్షణమాత్రము ధ్యాన నిమగ్నుఁడై అంతరదృష్టిని బరికించి యంతయుఁ దెలిసికొనెను. పిమ్మట నాతఁడు ప్రోలరాజు వెంబడింప దిగఁబడిన బండిచక్రముచుట్టు ముమ్మారు ప్రదక్షిణముఁ గావించి చేతులుజోడించి నిలిచెను. రాజును గురువు ననుసరించి నమస్కారక్రియ కావించెను. అందఱు గురుశిష్యుల చర్య వింతపడి చూచుచుండిరి, చక్రము చుట్టును క్రింద నేవస్తువునకు అఘా తముకలుగకుండ జాగ్రత్తగ త్రవ్వింప గురువు దండనాథున కాజ్ఞాపిం చెను. గంగాధరామాత్యుఁడు దగ్గరనుండి సైనికులచే జాగరూకతతో త్రవ్వింపఁదొడఁగెను, చక్రము దిగఁబడినంతమట్టుకు త్రవ్వఁబడినది. చూపఱ ఆనందమునకు మేరలేదు. తమ కన్నులను తాము నమ్మలేకపో యిరి. నవనవోన్మేషకాంతులతో స్వర్ణలింగము వెలువడినది. అంత లింగమునకంటియున్న చక్రమును పదుగురుపట్టి యూడఁదీసిరి. ఆ లింగము స్పర్శవేది యనిరి. గురువు సప్రేమదృష్టులు పరపించి మందహాసమున ప్రోలరాజువంక జూచెను. ప్రోలరాజు కృతజ్ఞతాదృష్టిని గురువునకు పాదాభివందనము గావించెను, గుర్వాజ్ఞతో వేగరులు చని శ్రీ రామారణ్యశ్రీపాదులవారినిఁ దోడ్కొనివచ్చిరి. పురోహితులు శాంత్యను వాకములు సదివి నమకచమకములతో పంచామృతములతో మహారుద్రాభి షేకము జరిపించిరి.

దేదీప్యమాన తేజస్ఫూర్తితో మహనీయ దివ్యరూప శరచ్చంద్ర మందార కుందసూన సితాంభోజ తారహార పటీర ధాళధళ్యప్రసార విస్ఫార కాంతులతో దివ్యమంగళమూర్తియగు నా స్పర్శవేదిలింగమూర్తినిఁగాంచి ముందు రామారణ్యశ్రీపాదులు సాష్టాంగపడిరి. పిమ్మట రామేశ్వర

దీక్షితులు సాగిలపడి నమస్కృతులనెఱపెను. అటుపిమ్మట ప్రోలరాజేంద్రుఁడు ప్రదక్షిణము నొనరించి సాష్టాంగపడిలేచి శ్రీపాదుల చరణములుముట్టెను. శ్రీపాదులవారు రెండుచేతులతో ప్రోలరాజు శిరము స్పృశించి 'శివసంకల్పోభవ! మహాంధ్రరాజ్య స్థాపనాచార్యోభవ' అని యుచ్చైస్స్వరమున ఆశీర్వదించెను. పిమ్మట రాజు రామేశ్వరదీక్షితులకు పాదాభివందనమాచరించెను. వారును శ్రీపాదులమాటలనే యుచ్చరించి ఆశీర్వదించెను. అనంతరము ప్రోలరాజు ప్రజాసముదాయమువైపుఁ దిరిగి నమస్కారక్రియ నెఱపెను. అందఱినోటనుండి 'శివసంకల్పోభవ, శివసంకల్పోభవ' అను మాటలు వెలువడి ఆకాశమునంటినవి. ప్రజలా యుత్సాహములో శివస్తుతులు పఠించుచు శివమెత్తియాడిరి.

ఒక్కింత సద్దు తగ్గినపిదప శ్రీపాదులవారు ''ఈ స్వర్ణ స్వయంభూ లింగమును తరలించుట యెరికినసాధ్యము. దీనిని అనుమకొండకుఁ గొనిపోవుటకు యత్నించుట నిష్ఫలము. ఇచ్చటనే ఈలింగమునకు ఆలయ నిర్మాణము గావించుటలెస్స. ఈలింగమునకుఁజుట్టును నెటుచూచినను యోజనముదూరముండునట్లు కోటఁగట్టి పురనిర్మాణము సేయుము. ఒరగల్లుపడినచోటుగాన నిది ఒరుగల్లుపురము కాఁగలదు. ఈ స్పర్శవేది లింగమును స్పృశింపఁజేసి ప్రతిదినము నొక బారువు పరిమితమగు నినుమును స్వర్ణము గావించుకొనవచ్చును. అస్వర్ణముతో శివసంకల్పములు నెఱవేర్చుకొనవచ్చును.

ఇదిగో విద్యాధరచక్రము. ఈచక్రమును నిట ప్రతిష్ఠించి ఆలయ నిర్మాణము ముందుగావింపుము. నీ యదృష్టముపండి పరమశివుఁడు తనంతట నిట వెలసినాఁడు. ఇఁక కేశవుని నీవు ప్రతిష్ఠింపవలయును. శివుఁడు వెలసినచోటున కేశవుని, కేశవుఁడు వెలసినచోటున శివుని ప్రతిష్ఠింపవలసియున్నది. శివకేశవులకు భేదములేదు.

ఇది నగరనిర్మాణ యంత్రము. మీ పూర్వుఁడగు కాకతిరాజు సేవించిన సప్తర్షిగణమును ప్రతిష్ఠాపనముఁజేసి యీచిత్రము వ్రాయఁబడినది. ఇదివరకే దీనినాలోచించి మంత్రశాస్త్రవిధిని సంస్కరించి వ్రాయించియుంచితిని. ఈ శుభసమయమున దీనిని నీకొసంగుచున్నాను. ఈ యంత్రము ననుసరించి నగరము నిర్మించిన సప్తర్షిమండలచ్ఛాయ యావరింపఁబడఁగలదు. ఈచిత్రమునఁ జూపినరీతి నేఁడు ప్రాకారములు నిర్మింపవలెను.

సప్తర్షిమండలముఁ దలపించుచు నేపనిచేసినను మీకార్యము సుప్రతిష్ఠితము కాఁగలదు. సప్తర్షిప్రభావమున మీవంశమున మహత్తరములగు నేఁడు చెఱువులు నిర్మింపఁబడవలసియున్నది. ఆలయములు సప్తస్తంభములపై నిర్మింపఁబడవలెను. ప్రతిస్తంభమునకు మొదట పీఠముండును. దానిపైని వికసించిన పద్మాకృతిగఁ జెక్కిన శిలాఫలకము. దానిపై నట్టిదే శిల బోరగిలబెట్టినట్లుండును. మరల స్తంభము. దానిపైని మరల నదేవిధము చతురస్రముగ నాల్గుస్తంభములు. ఏఁడవస్తంభము మిగిలిన యారింటికంటె పెద్దదగును. ఈవిధముగ నెచ్చట నేనిర్మాణము గావించినను సప్తర్షిమండలచ్ఛాయ నాకర్షించునదిగ నుండవలెను. అట్లు జరిగిన మీ కాకతిరాజు కాంక్షను మీరు పూర్తిచేసినవారగుదురు. నీవు స్థాపించెడి మహాంధ్రసామ్రాజ్యమీపథకమున నిర్మింపఁబడిన ఒరుగల్లు నగరము రాజధానిగా మున్నూరుశతాబ్దము లవిచ్ఛిన్నముగా మీ కాకతీయ వంశముచేఁ బాలింపఁబడఁగలదు. నేఁటినుండి అనుమకొండరాజ్యము ఒరుగల్లురాజ్యము కాఁగలదు, ఇది శివాజ్ఞ'' అని పలికెను.

''అంతయు శివకటాక్షము. శివాజ్ఞ శిరసావహించుచున్నా'' నని ప్రోలరా జుత్తమాంగము వంచి యంజలిబంధముఁ గావించెను.

సహపాఠియగు దీక్షితులవారి నాలింగనముఁజేసికొని రామారణ్య శ్రీపాదులవా రశేషజనుల మ్రొక్కులందుకొని కాశేశ్వరమునకు వెడలిపోయిరి,

దీక్షితులవారు శిల్పుల రావించి శ్రీపాదులవారొసంగిన యంత్ర ప్రకారముగ కోటకు రేఖలువ్రాసి చుట్టును ఏడువిధములుగ ప్రహరీ గావించి అనుమకొండనగరమునుండి స్పర్శవేదిలింగమువరకు రెండుక్రోసుల దూరము వీధి యేర్పఱచి యచ్చట నుభయపార్శ్వంబుల శైవ, వైష్ణవ దేవాలయముల నిర్మాణము నిరూపించిరి. ముక్తేశ్వరుఁడు, విశ్వనాథుఁడు, భీమేశ్వరుఁడు, రామేశ్వరుఁడు, నీలకంఠేశ్వరుఁడు, విరూపాక్షుఁడు మొదలగు ఈశ్వరస్థానములు మున్నూటయేఁబది; వేంకటనాథుఁడు, శ్రీరంగనాయకుఁడు, గోపాలరాయుఁడు, పాంచాలరాయుఁడు, కల్యాణ నారాయణుఁడు మొదలుగాఁగల నూరు విష్ణుభవనంబులును; దేవీభవనంబు లేఁబదియును; వీరభద్ర వినాయక భవనంబులు నలుఁబదియు నిరూపించి సత్వరపుర నిర్మాణమునకుఁ దగు నాజ్ఞలు గావించెను.

# జైనలోక కలవరము.

మహామండలేశ్వర కాకతి ప్రోలరాజు జైనమతము నుండి తిరిగి పోయినాఁడని జనులలో వార్త కర్ణాకర్ణిగ అనుమకొండ రాజ్యమెల్లెడల నిమిషములోఁ బ్రాకిపోయినది. కాకతిరాజులు తరతరమ్ముల నుండి జైనమునకు పట్టుకొమ్మగ నిలిచినారు. ఆచార్య శంకరస్వాముల వారి వేదమత ప్రచారము జైన బౌద్ధములకు గొడ్డలిపెట్టుగ సాగిన రోజులలోఁ గూడ కాకతి రాజ్యమునందు మాత్ర మడుగు పెట్టఁజాలలేదు. అప్పటి కాకతిరాజులు జైనమతమున కంతగఁగట్టువడి యున్నారనుట కిది నిదర్శనము.

అంతలో నంతమార్పు ప్రోలరాజులోఁ గన్పట్టుటకు ప్రజలెల్లరకు వింతఁగొల్పినది. స్వయంభూ లింగావతరణము ప్రోలరాజు మనసును పూర్తిగా మార్చివైచినదనియు, లింగావతరణము ప్రోలరాజును వీరశైవమునకుఁ ద్రిప్పుటకై రామేశ్వర దీక్షితుల కల్పిత నాటక ఫలితమే కానోపుననియు భావించి జైనయతులు కళవళపడిరి. తమమతమునకు అనుమకొండ రాజ్యమున బేతరాజు నాఁడే వినాశ బీజములువడి కాకతీయ రాజ్యమున నేఁడు స్వరూపనాశమే కాఁగలుగుచున్నందులకు జైనాచార్యులు కలవరపడిరి.

క్రీస్తు పూర్వము నుండి జైనము బౌద్ధము ప్రజలలో విరివిగ వేళ్ళు పాతుకొని పోయినవి. జైన బౌద్ధయతులు మత ప్రచారమునకుఁ దీసికొన్నశ్రద్ధ అపరిమితము. తమ మతమును బహుసులభముగా హైందవులలోఁ బ్రవేశపెట్టుటకై వా రనేక మార్గాంతరములు కని పెట్టిరి. హైందవ మనస్సున నెన్ని విశ్వాసము లమరియున్నవో యన్నిటిని తమ మతములందును వారు ప్రవేశపెట్టి సామాన్య ప్రజామనస్సును సులభముగా తమవైపున కాకర్షించుకొనిరి. చదువు సంస్కారములున్న

పై తరహా మనుష్యులకంటె మూఢవిశ్వాసముల జీవించు క్రింది తరహా మనుష్యులను ఆకర్షించుటకై వారెన్నెన్నో కల్పనములు గావించిరి.

జాతకకథల పేరిట తథాగతునకు వివిధ జన్మల నంటఁగట్టి హైందవులకుఁ గల అవతార విశ్వాసములను తమవైపునకుఁ ద్రిప్పుకొనిరి. పెక్కు తంత్రములతో అలౌకిక కార్యముల ప్రదర్శించి దేవతా మహిమల పైని, మంత్రశక్తిపైని హైందవులకుఁగల ప్రబల విశ్వాసమును తమవైపున కాకర్షించుకొనిరి. దేవుని పేరుమార్చియు, మార్చకయు, హైందవ దేవాలయములపై జైనబౌద్ధగాథ లపరిమితముగా శిల్పరూపముల నిలువరించియు, యక్ష యక్షిణీవిగ్రహములతో ఆలయమునకు జైనరూపముఁదిర్చియు శాశ్వత బ్రహ్మ కల్పముగ తమ మతము పాతుకొనిపోవుటకు బ్రహ్మాండమగు శిల్ప కృషిసల్పిరి. రాజులచే రాణులచే బౌద్ధ విహారములు, ఆరామములు, చైత్య గృహములు లెక్కలేనన్ని కన్నులు చెదరిపోవునట్లు మహా శిల్ప విన్యాసములతో నిలువరించిరి.

స్త్రీలకు సన్యాసదీక్ష నొసఁగి రాజాంతఃపురముల భిక్షుకీ, పరివ్రాజికా మూలమున ప్రచారము లేవఁదీసి రాజు హిందువుఁడైన రాణిని తమ మతమునకుఁ ద్రిప్పుకొని రాజకుటుంబముల మత విశ్వాసములు చీల్చి వేఱుపఱచిరి. ప్రచారము కొఱకై హైందవ మత విశ్వాసము చూఱగొనుటకై హైందవమత సాదృశ్యములగు నెన్నెన్నో కల్పనలను గావించుచునే హైందవ విరుద్ధమైన తమ మతమూల సిద్ధాంతములపై ప్రజా మనస్సు నెమ్మదిగ వశపడునట్లు వారు మిక్కిలి జాగరూకత వహించుచు వచ్చిరి. ఏమతమైన నేమియని పైకి కనిపించుచున్నను వర్ణాశ్రమాచార వ్యవస్థ, వేదప్రామాణ్యము, సృష్టి, స్థితి లయ కర్తయొకఁడు గలఁడనుట, ఈ మూఁడిటిపై ప్రజావిశ్వాసమును సడలించివైచి తమ మత సిద్ధాంతములను చాపక్రింద నీరువలెఁ బ్రవహింపఁజేసిరి. ఇదిచేసి రదిచేయ లేదనుటకులేదు. ఆది పురాణమను పేరుతో జైనవేదము వెలసినది.

వైదిక కావ్యములగు భారత రామాయణములవలన వైదిక ధర్మ విశ్వాసములు ప్రజలలో వ్యాపింపకుండుటకై ప్రజామనస్సులఁ బాతుకొనియున్న రామాయణ భారత కథలలోని వైదికధర్మ ప్రతిపాదకములగు నంశములను మార్చివైచి ప్రజాచిత్తము తమ కావ్యగాథలపై మోజుపడునట్లు సంస్కృత ప్రాకృతములలోను, దేశభాషలలోను విచిత్రకల్పనలుచేసి వివిధ కావ్యములను రచించి ప్రచారమున కుపయోగించుకొనిరి.

వాల్మీకి రామాయణముతో పొందిక తెగకుండ అక్కడక్కడ విశేషవ్యత్యాసములతో సంస్కృత ప్రాకృతములలో జైన బౌద్ధ భారత రామాయణములు వెలసినవి. కర్ణాటాది దేశభాషలలో అనువాదములు జరిగినవి. వైదిక మతానుయాయులచే ధర్మగ్రంథములుగా పరిగణింపఁబడిన అలౌకిక వైదిక కావ్యములగు రామాయణ మహాభారతములు జైన సాంప్రదాయములో లౌకిక కావ్యములుగా మాఱిపోయినవి. ఈ కావ్యములలో హైందవ మతశ్రద్ధను తుంటలుగా త్రెంచివేసి జైనమత విశ్వాసములు విశేషముగా ప్రవేశపెట్టఁబడినవి.

చూచుటకు ముఖ్యకథ ఒకే మాదిరిగా కనుపించినను జైన రామాయణము వాల్మీకి రామాయణమునకు పూర్తిగా విరుద్ధము. జైనరామాయణములో కథానాయకుఁడు రాముఁడు కాదు, లక్ష్మణుఁడు. దీనిని రామాయణమనుటకన్న లక్ష్మణాయనము అనవచ్చు. దీనిలో దశరథుని పుత్రకామేష్టియాగము లేదు. పుత్రకామేష్టియాగము దైవాంశ ప్రతిపాదకమగుట నది జైనరామాయణములో విడువఁబడినది. దశరథునికి భార్యలు నలుగురు. అపరాజిత, కైక, సుమిత్ర, సుప్రభ. వీరికి క్రమముగా రామ, భరత, లక్ష్మణ, శత్రుఘ్నులు పుత్రులు. లక్ష్మణుఁడు శ్యామల వర్ణుఁడు. రాముఁడు గౌరాంగుఁడు.

ఇందు నారదుఁడు సీత రూపాతిశయమును జూచి మోహించి నిరాకృతుఁడగును. తన కసితీర్చుకొనుటకు నారదుఁడు యత్నము జరుపును.

రాముఁడు రామాయణములో ఏకపత్నీవ్రతుఁడు. కాని జైనరామాయణములో రామునికి సీతకాక, సుగ్రీవుని పన్నెండుగురు కూఁతులును, దశముఖపర్వతపతి సుతలును పెక్కురుభార్యలున్నట్లు చెప్పఁబడినది. దీనితో ఏక పత్నీవ్రతము నాదర్శముగాఁగొన్న హైందవధర్మము మంటఁగలిసినది.

ఇందు లక్ష్మణుఁడు ఖరదూషణాదులను వధించును. రాముఁడు సీతకు కావలిగానుండును. ఖరుఁడు లక్ష్మణునివలె ఆర్తనాదము చేయఁగా లక్ష్మణుని ఆర్తనాదమువిని రాముడు సీతకు జటాయువును కావలిపెట్టి లక్ష్మణసహాయమునకు బయలుదేఱును. ఒంటరియైన సీతను రావణుఁడు విమానములో ఎక్కించుకొని అడ్డుపడిన జటాయువును చావగొట్టును. కాంచనమృగ వృత్తాంతము ఇందులోలేదు.

వాలి సుగ్రీవ వృత్తాంతములో వాలి జైనయతి. సుగ్రీవునకు భంగపాటు మాయావాలినుంచి జరిగినది. సుగ్రీవుని నమ్మించుటకు రాముని సప్తతాళచ్ఛేదమునకుబదులు రావణసంహారమునకు లక్ష్మణుఁడు సమర్థుఁడని తెలుపుటకు లక్ష్మణుఁడు సిద్ధశైలము నుద్ధరించిన కథ చెప్పఁబడినది.

సుగ్రీవాదులు జైనరామాయణములో వానరులు కానేకాదు. వారు వానరధ్వజులు. హనుమంతుఁడు బ్రహ్మచారికాఁడు, ఇతనికి పెక్కురు భార్యలుగలరు. రావణుని చెల్లెలికూఁతురు అనంతపుష్పను పెండ్లాడి రావణుఁడిచ్చిన కర్ణకుండలపురమునకు హనుమంతుఁడు అధిపతియై యుండును. రావణుఁడు పరస్త్రీని మోహించినాఁడని వానికి దూరమై పోవును.

రావణుఁడు దశకంఠుఁడుకాఁడు. వాఁడుపుట్టిన పదవరోజున భీముఁ డను రాక్షసరాజు బహూకరించిన హారములోని పదిమణులలో రావణుని ముఖము దశవిధముల ప్రతిబింబించుటచే దశవదనుఁడని పేరువచ్చి నట్లు చెప్పఁబడినది.

జైనరామాయణములో సేతుబంధనప్రసక్తి లేదు. రామాదుల సేనలు నభోగమనవిద్యతో లంకకు చేరుకొనుట యిందు వర్ణింపఁబడినది. రావణవధానంతరము సీతకు అగ్నిపరీక్షలేదు. ఆమె చివరకు సంసార విరక్తురాలై తపస్వినియగును.

రావణుని రాముఁడుకాదు చంపునది; లక్ష్మణుఁడు. రావణవధా నంతరము లక్ష్మణునికి జీవహింసఫలితముగా నరకలోకప్రాప్తి కలిగినది.

ఈవిధముగా హైందవమతగ్రంథమగు రామాయణము తారుమారు చేయఁబడినది. ఇంకను సమస్తవైదికకథలలోను వైదికధర్మ సాంప్రదా యము తప్పించి జైనసాంప్రదాయము ప్రవేశపెట్టఁబడినది.

కాకతిప్రోలరాజు శైవమతప్రవిష్టుఁడగుటతో అనుమకొండరాజ్య మున తమకుఁ, డమమతగ్రంథములకు, సాంప్రదాయములకు, శిల్పములకు ప్రబలమగు అఘాతమేర్పడినదని జైనమత ప్రచారకులు తమ పూర్వాచా ర్యులు గావించిన ప్రచారమార్గములందలి ప్రాఁతగాథలు త్రవ్వి తలకెత్తు కొని నిట్టూర్చిరి.

జైనయతులకు మతులుచెడినవి. వారు ప్రతీకారచర్యలకు పథకములూహింపఁజొచ్చిరి. అనుమకొండనగరమునకు దూరముననున్న అరణ్యములోని జినేంద్రస్వామిని కలిసికొనిరి. అందఱు కాకతి ప్రోల రాజుపై శత్రుభావమువహించియున్న యాదవ, హొయసల, చాళుక్య రాజులలోని కక్షలు రగిలించి అనుమకొండరాజ్య విచ్ఛిత్తికి తిరుగు బాటు లేవఁదీయ యావచ్ఛక్తి యత్నించుటకు జినేంద్రస్వామి యనుజ్ఞ వడసిరి.

దక్షిణమున చోళులు, వాయవ్యమున హొయసలులు, ఉత్తరమున యాదవరాజులు, పశ్చిమచాళుక్యచూడామణి త్రైలపుఁడు, సోమేశ్వరుఁడు, నేలకొండపల్లి పాలకుఁడు విక్రమదండనాథుఁడగు గోవిందరాజు, మంత్ర కూటాధిపతి గుండరాజు, లేములవాడ పాలకుఁడు జగద్దేవుఁడు, ప్రోల రాజుపై కసిగలిగియుండుటను వారు జినేంద్రస్వామి కెఱింగించిరి.

జినేంద్రస్వామి కార్యనిర్వహణము రహస్యముగా జరుగుటకు తాను పెక్కురు జైనయతులతో హిడింబాశ్రమమున పాతాళగృహమున రహస్యముగ వసించుటకును, ఆయారాజు లందఱొక్కుమ్మడి ప్రోల రాజుపై పడుటకై తగిన ప్రణాళికలు సిద్ధముచేయుటకును, అందఱు తన్ను కలిసికొనుచు నొకేసారి శత్రురాజులను ప్రోలునిపై యెత్తివచ్చుటకు మంతనముల జరుపుచుండుటకును నిర్ణయించెను. పిమ్మట జైనయతులలో సుప్రసిద్ధులనేఱి ఎవరేదేశముల నేమిచేయవలసినదియు నిర్ణయించెను. 'స్వధర్మేనిధనంశ్రేయః' అని వారికి జినేంద్రుఁడు ప్రబోధించెను. జైనాల యములందలి విగ్రహములు శైవులు నాశనముఁజేయుటకుఁ బూర్వమే రహస్యముగ నావిగ్రహముల నెచటివచట సమూలముగఁ బెకలించి భూమిలో భద్రముగఁ బాతియుంచుటకును. జైనమతప్రచార గ్రంథము లను సంరక్షించుటకును తగుయత్నము జరుపవలసినదిగా జినేంద్రస్వామి హెచ్చరించెను. గురు నిర్దిష్టప్రకారము నడువ నిశ్చయించి జైనాచార్యు లెల్లరు పాదాభివందనముఁ గావించి జినేంద్రస్వామిని వీడ్కొని ఆయా రాజుల దేశములకుఁ జేరుకొన వెడలిపోయిరి.

పదవ ప్రకరణము.

# కడలాలయము మాయమైనది.

నాఁటి యనుమకొండనగరము నాలుగు పర్వతములచేతను, రెండు మంటిగోడలచేతను ఆవరింపఁబడియున్నది. నేఁడు మనచే అనుమకొండ యని పిలువఁబడు నగరమునకు పశ్చిమమున నొక పర్వతపంక్తి కలదు. అందు రెండుప్రక్కలను రెండువరుసల కొండలుకలిగి తూర్పు పడమర దిశలకు వ్యాపించియుండు కనుమయొకటి కలదు. తూర్పుదిక్కున పెద శిలాద్వారమొకటి కలదు. అద్వారమునంటి యెడమవైపుగా నొక పెద్ద కొండకలదు. కుడివైపున ద్వారమునుండి యనతిదూరముననున్న మఱి యొక కొండను కలుపుచు నొక దట్టమైన మట్టిగోడ కట్టఁబడినది. శిలా ద్వారమునంటి దక్షిణముననున్న కొండకావల నొక త్రికోణాకృతిగల పర్వతము గలదు. దీనినంటి మఱియొక యెత్తైన కొండగలదు. ఈకొండ నుండి శిలాద్వారమున కుత్తరమున నంటియుండి పశ్చిమభాగమున మఱియొక బలమగు మట్టిగోడగలదు. శిలాద్వారమున కుత్తరమున నున్న కొండనంటిన మఱియొకకొండకే పద్మాక్షికొండ యనిపేరు.

పద్మాక్షికొండపైనిఁగల 'కడలాలయబసది' ఆలయపురోభాగమున నొకనాఁటి రాత్రి యుద్విగ్నమనస్కులై యుద్రిక్తులై జైనయతులు తిరుగు చుండిరి. వారి చేతులలో గునపములు, పాఱలు, ఉలులు మొదలగు ఖనన సాధనములుగలవు. వారొకరితోనొకరు సంభాషింపకున్నను వారివదనము లందఱుగలిసి యొకేమహత్తరమైన సునిశ్చితకార్యమునకై యటకు వచ్చి నటుల సూచించుచున్నవి. వారి హృదయములు దుఃఖవేదనాభారమగ్నము లైనను వారు సత్వర కార్యోన్ముఖులైనట్లు కనుపడుచుండిరి. ఒకరితరువాత నొకరు పెక్కురుయతులు గడియలోచేరుకొనిరి. అందఱకు వెనుక ఆజాను బాహువులు గలిగి దీర్ఘాకారముగలిగి అమూల్య వస్త్రాభరణములుగలిగిన

యొక పురుషుఁడును, స్త్రీయును ముఖములు కనుపడకుండ దుప్పటములఁ గప్పుకొనివచ్చిరి. పురుషుఁడు కాకతిప్రోలరాజు నమాత్యవర్గమునకుఁ జెందినవాఁడగు బేతనప్రెగ్గడ. ఆతని వెంటవచ్చిన స్త్రీ యాతనిభార్య మైలాంబ.

దంపతు లాలయముఖద్వారము చేరగనే జైనయతులు ముఖము లందు గౌరవభావముఁ దెలుపు వైఖరిని బ్రదర్శించిరి. జైనయతులకు విడి విడిగా పాదాభివందనముసేసి దంపతు లాలయములోపలికిఁ బ్రవేశించిరి.

కడలాలయను బేతనప్రెగ్గడ భార్య మైలాంబ నెలకొల్పినది, ఆలయమునకెదురుగా నొక కన్నడశాసనఫలకము నిలుపఁబడినది. దాని ప్రక్కనే యొక శిలపై మైలమయొక్కయు నామె భర్తయగు బేతనప్రెగ్గడ యొక్కయు విగ్రహములు నిర్మింపఁబడియున్నవి. ఆలయములోపల కడలాలయవిగ్రహము గంభీరస్ఫూర్తిఁ బ్రకటించుచున్నది. ఇరువదిమూఁడవ జైనతీర్థంకరుఁడగు పారశ్వనాథుని యక్షిణి పద్మావతియే కడలాలయ యను కన్నడపుపేరు వహించినది. కడలాలయ విగ్రహమును ధ్వంసము చేసి ఆస్థానమున తమ క్రమరాజులు మొదటినుండి పూజించినట్టియు, పిమ్మట తమ వంశకర్తయగు మాధవవర్మ ఆరాధించి వరములందినట్టియు పద్మాక్షీ శివశక్తి విగ్రహమును శైవుల ప్రోత్సాహమున బ్రోలరాజు పునః ప్రతిష్ఠఁ గావింపనున్నాఁడని రహస్యమున నెఱిఁగియుండుటచే తాము ప్రతిష్ఠించిన కడలాలయ విగ్రహమును సంరక్షించుటకై జైనయతులఁ దోడ్కొని బేతనదంపతులటకుఁ జేరుకొనిరి.

చతుర్బాహువులు, హంసలాంఛనము, శిరోపరిభాగమున నైదు పడగల సర్పచ్ఛత్రము, కుడిచేతులలో కమలమును, పాశమును, ఎడమ చేతులలో ఫలమును, అంకుశమును ధరించియున్న కడలాలయకు బేతనదంపతులు సాగిలపడినారు. దుఃఖముచే కుంచించుకొనిపోయిన వారిముఖములు కన్నీళ్ళధారచే కలుషితములైయుండెను. నోట మాటలేదు.

దంపతులు ముమ్మారు ప్రదక్షిణముచేసి కడలాలయ విగ్రహమునెల్ల తనివిఁ దీర చేతులతో స్పృశించి హృదయమున నాలింగనముఁగావించి తలవంచి కడసారి పాదాభివందనము గావించి దేవి కభిముఖముగనే వెనుకనడకను వెలుపలికి వచ్చిరి. యతులవంక చూచుచు దుఃఖాశ్రులు తుడుచుకొనుచు వచ్చిన దారినే వారు తిరిగి వెడలిపోయిరి.

మైలమా జేతనలు నిష్క్రమించుట తోడనే జైనయతులు ఖనన సాధనములతో నాలయములో ప్రవేశించిరి ఆ జైనయతు లందఱును శిల్ప విద్య నారితేరినవారు. తెల్లవారుజాము వరకు వారిచేతులాడుచునే యున్నవి. చెక్కుచెదరకుండ కడలాలయ విగ్రహము పీఠముతో సహా కదలింపఁబడినది. విగ్రహము తనంతట తానెగిరిపోయినట్లూహింపఁబడు టకై ఆలయపుపైకప్పు పగులఁగొట్టఁబడినది. త్రవ్వితీసినట్లానవాలుకూడ నట గన్పింపనట్లు చమత్కారముగఁగూడ కనఁబడినది. అంతగ నారితేరిన శిల్ప సిద్ధహస్తులువారు. వలసిన చోటునకు తరువాత కొనిపోవుట కనువుగా విగ్రహము నటనే యొక రహస్య పర్వత గుహకుఁజేర్చి తెల్లవారకుండనే జైనయతులు చేతులు గడుగుకొని పోయిరి.

పదునొకండవ ప్రకరణము.

# వీరశైవ మతవ్యాప్తి.

వీరశైవము వేదబ్రాహ్మణమత వినాశమునకు ప్రత్యక్షముగా నెట్టి విఘాత కార్యమును దలపెట్టలేదు. ప్రోలరాజు తమ వంశము వేద బ్రాహ్మణారాధనమున నేమఱకుండుటవలననే వృద్ధిగాంచినదను పూర్వ రాజవృత్తాంతములయందుఁ గలిగిన విశ్వాసముచేఁ దానును బ్రాహ్మణభక్తి విడువక పోవుటేకాక వీరశైవమువలన వేదమునకు బ్రాహ్మణులకు నేమాత్రము నాఘాతముఁ గలుగకుండఁ గనుపెట్టుకొని కాచియుండెను. దీక్షితులవారి యాదేశము ప్రకారము రాజ్యాభివృద్ధికై వీరశైవము నామోదించెను. జైనమతమును వినాశమొందింపఁజొచ్చెను. స్వయంభూ లింగావతరణము కాకతీయ స్వతంత్రరాజ్యాభివృద్ధిని సూచించునదియేనని యాతఁడు గట్టిగా విశ్వసించెను.

విభూతిలింగ రుద్రాక్షధారణములతో, పంచాక్షరీ మంత్ర పునశ్చరణములతో లింగపసాయిత శస్త్రధారణములతో రాజాదరణముచే శివ భక్తి వీరస్వరూపమును దాల్చి ఓరుగంటి రాజ్యములో పరవళ్లుద్రొక్కినది.

అంతవరకు ఈశ్వరోపాసనా శూన్యతచే మనోదుర్బలులగు జైన మతప్రవిష్టులు అపత్కాలమందు మఱింతదుర్బలపడినమనస్సుతో కొంచెము కొంచెము శైవమతస్థుల ఏకేశ్వరోపాసనా వాసనల కలవాటుపడి ధైర్యముల నందసాగిరి. వారి కష్టములను, నష్టములను దీర్చుటకు నమ్మికొనినచో శివదైవము హస్తావలంబన మిడుటకు సిద్ధముగ నున్నాఁడను విశ్వాసము వారిలో నానాఁడు వృద్ధి నొందెనది. నాస్తికమతమున నసంతృప్తితో వాడువాఱిన వారి ముఖములు నూతన శైవమత ప్రవేశమున దైవ విశ్వాసముతో సంతృప్తిపడసి వికసించినవి. మండు వేసవి టెండల కుడుకెత్తిన దేహములు తొలకరివానల చినుకులు సోకుట కలరినట్లు వాటి

జీవితములలో శైవమతముతో నొక యుత్సాహమలమఁ జొచ్చినది. సంసార విముఖులై సన్యాస దృక్పథముతో ఆనందమెఱుఁగక నిరుత్సాహ జీవితములఁ గడుపుచున్నవారి కేక శరీరులై విడివడక కలిసియున్న గౌరీ శంకరుల యారాధన మాసంపదాయకమైనది.

లింగధారణముతో బ్రాహ్మణులు, మాలలు, పండితులు, పామరులు, సేవ్యులు, సేవకులు, ప్రజలు, ప్రభువులు, స్త్రీలు, పురుషులునను భేదావరణము వీరశైవమున తొలఁగిపోవుటచే జైన బౌద్ధులు తమ మత సిద్ధాంతములును నందుఁగలుగుటకలరి యా నూతన మతమును స్వీకరించిరి.

ఓరుగంటి రాజ్యములో నెచ్చటఁజూచినను శివభక్తి పరవశులగు భక్తుల కథలు వినపడఁజొచ్చినవి. తమ కన్నులను, దారాపుత్రాదులను, ప్రాణములను, శివార్పణముసేసి కైవల్యముక్తినందిన కన్నప్ప, చిఱుతొండనంబి, సిరియాలుఁడు, నిమ్మవ్వ, గుండయ్య మొదలగు భక్తుల గాథలు ప్రజలకు శివభక్తియందలి తన్మయతఁ బుట్టించినవి. ఇంటింట శివపురాణ పఠనము నిత్యకృత్యమైనది, శైవాగమములు బహు ప్రజాదరణము నందినవి. శైవకవులు పెక్కురు బయలుదేరిరి. వారు జనసామాన్యమునకు మతవిషయములను బోధించుటకై మాతృభాషయగు తెలుఁగు భాషనే యుపయోగించిరి. జైనులు తమ మతగ్రంథములను మాతృభాషలలో బ్రచారముగావించుటచే శైవకవులును మాతృభాషనే మత ప్రచారమునకు చేపట్టిరి. వైదికమతమునకు సంస్కృతమెట్లో శైవమతమునకు మాతృభాషలట్లు. శ్రీపతి పండితుఁడు శివదీపిక మొదలగు గ్రంథముల రచించి విశేషప్రచారము నడిపెను. ఈతఁడు శివుఁడొకఁడే దైవమని తెల్పుటకు కొంగున నిప్పులు మూటగట్టిన మహానుభావుఁడు. శివలెంకమంచెనకవి కాలాముఖాచార్యుఁడై 'సోమశంభు' వను పేరువడసి

పెక్కురచనలు చేసెను. 'యత్సంవిత్' అను శైవాగమ వాక్యమునకు నాలుగువేలు గూఢార్థములు చేసెను.

"జలమున కొడలెల్లఁ గాళ్లువలె, చిచ్చున కొడలెల్ల నోళ్లువలె, గాడ్పున కొడలెల్లఁ దలలువలె భక్తున కొడలెల్లభక్తి" అను భావములు ప్రచారమై ప్రజలలో నాపాదమస్తకము శివభక్తిని పూరించినవి.

"దైవంబులే యైనచో జనుఁడు బుద్ధుఁడు మహత్తులేక నరరూపులై యుండుదురె" అను భావములు ప్రచారమొంది బౌద్ధ జైనమతములను దూర్వారఁబట్టినవి.

"వివిధదేవాసక్తి వెలయాలివంటిది" "నిశ్చలభక్తి కులసతివంటిది" అను దృష్టాంతవాక్యములు ఏకేశ్వరోపాసనమందు ప్రజలకు విశ్వాసమును బుట్టించినవి.

"సర్వేశ్వరుఁడొక్కడే యని చెప్పుచుఁగూడ హరివిరించ్యాదుల పలు వేలుపులఁ గొల్చుట పాడియెట్లగును?" అను ప్రశ్నపరంపరలు రేగి ప్రజా మనస్సును శివైక్యమగునట్లుఁజేసినవి.

ఓరుగల్లు రాజ్యమునుండి బయలువెడలిన వీరశైవము కట్టతెగి దశ దిశలు ముంచెత్తినది. దానిముందు నిలువఁగలిగిన మతములేదు. జైన బౌద్ధములు తలఁగాచుకొనుటకుఁ దంటాలు పడినవి. ఇతర మతములు ముసుఁగువైచుకొని కూర్చున్నవి.

శైవమతావేశ పూరితులై ప్రజలు జైన బౌద్ధ మతగ్రంథములను దగులఁబెట్టిరి. వారి యాలయముల జైనవిగ్రహముల నూడఁబెఱికి శైవ విగ్రహముల ప్రతిష్ఠించి మతవిహారచైత్యారామముల నాక్రమించుకొనిరి. అనుమకొండలోని పరాశక్తియైన కాకతమ్మను స్వయంభూదేవుఁ డవతరించిన

నగరముననే యుండవలెనని పట్టుపట్టి రాజానుమతమునఁ గొనితెచ్చి ఓరుగంటిలోఁ బ్రతిష్ఠించిరి. నాఁటినుండి ఓరుగల్లునకు కాకతిపురమని పేరువచ్చినది. దేశభాషలలో శివగాథలను దెలుపు పెక్కు పురాణములును సంస్కృతములో శైవాగమములును వెలువడినవి.

ప్రోలరాజు తనరాజ్యమున నెల్లెడల వీరశైవప్రముఖులను పంపి 'ప్రమథ' గణములను పేరుతో గ్రామప్రజలను పెక్కుగణములుగ విభజించి ప్రజలకు సైనికశిక్షణ లలవరింపఁజేసెను. ప్రతియొక గణము నకు సుశిక్షితుఁడైన సేనాని నొకని 'గణాచారి'గా నిలిపెను. గణాచారు లందఱకు నాయకులుగా 'వీరమాహేశ్వరు' లనుపేర దండనాయకులను నియమించెను. వారందఱపైని సర్వసేనానికి 'వీరభద్రుఁ'డను పేరిడెను. జంగమపరమేశ్వరులగు రామేశ్వరదీక్షితులవారి కనుసన్నలలో వీరందఱు మెలఁగునట్లు కట్టడిఁజేసెను,

జీతబత్తెములులేకయే ఊరూర శివభక్తులు సైన్యములుగ ప్రోగు పడిరి. జంగములు ప్రతియూరుఁ దిరుగుచు రాజాజ్ఞలు తు. చ. తప్పకుండ భక్తిశ్రద్ధలతో పాటించునట్లుఁజేయుటేకాక శత్రుల జాడలు దెలిసికొని రాజునకుఁ దెలుపు గూఢచారులుగఁగూడఁ బనిచేసిరి. అచిరకాలములో ప్రజామనస్సు శైవమువైపు మఱలి అన్యమతవిశ్వాసమును విడిచి రాజునకు వశపడిపోయినది.

పండ్రెండవ ప్రకరణము.

# పాతాళగృహము.

నాఁడు శ్రావణపౌర్ణమి. నాఁటిరాత్రి నిండువెన్నెల కాయవలసిన దినమైనను చంద్రుని వర్షాకాలపు కారుమబ్బు లావరించుటచే నమావాస్య వలె కన్నుపొడుచుకొనినను తెన్నుకనుపడని చీఁకటి వ్యాపించెను. ఆపైని చినుకులు పడుచున్నవి. ఆసమయమున హిడింబాశ్రమారణ్యమున బాలశివదేవుఁడను జంగమభక్తుఁడు అనుమకొండకుఁబోవుచు దారితప్పి వర్షముచేఁ దడియకుండుట కొక చెట్టుమొదలు నాశ్రయించి కూర్చుండెను. తెల్లవాఱువరకు నచ్చటనే ముడిచిపెట్టుకొని కూర్చుండకతప్పదని యాతఁడు నిశ్చయించుకొనెను.

సరిగా రెండుజాములు దాటినది. పెక్కురు సన్యాసులు మాట మంతిలేక నిశ్శబ్దముగా వరుసగా నా యరణ్యమార్గమునుబట్టి పోవుచుండిరి. నలుగురు నలుగురొకజట్టుగ బయలుదేరిరి. ఒకగుంపు వెడలిన పిదప మఱియొకగుంపుగా పెక్కుగుంపు లావర్షములోఁ దడిసి వేగముగ నడుగులిడుచు పోవుచుండుట చెట్టుమొదటఁ గూర్చుండిన జంగమ శివ భక్తున కాశ్చర్యముఁగూర్చినది. అది యేమగునా యని తెలియ నాతఁడు కుతూహలపడెను. ఒకగుంపు వెడలినపిదప రెండవగుంపు రాకుండఁగ మధ్యవ్యవధిలో వారిజాడనరయ వీరశైవుఁడు ప్రక్కప్రక్కలఁబడి పోయెను.

ఒక పెద్ద వటవృక్షమునకు దూరముగ గుంపు ఆగినది. ఆచెట్టు మొదట నొకజైనయతి స్థిమితముగఁ గూర్చుండెను. గుంపులోనివారొక్కొకరుగ వృక్షమును సమీపించుచుండిరి. "జై జినేంద్రభగవన్" అని సంకేత నామము నుచ్చరించినపిదప వానికి చెట్టుక్రిందఁగల సురంగమార్గమునకుఁ

ప్రవేశానుమతి నొసంగుచుండెను. శివభక్తుఁడంతయు కనిపెట్టిచూచి తన యాకారముమార్చి యతిరూపమును గూర్చుకొని యందఱు ప్రవేశించిన పిదప చివరివాఁడుగా తానును 'జై జినేంద్రభగవన్' అని లోపలికిఁ జేరుకొని యచటివారి చేష్టానుగుణముగ సంచరించుచు వారిలో నొకఁడుగ నూఱిపోయెను.

పాతాళగృహము చాల విశాలముగనుండెను. వాయుసంచలనము నకుఁదగు పరికరము లమర్పఁబడెను. రత్నదీపకాంతులతోఁ బట్టపగలువలె నుండెను. అదియొక జైనమహావిహారము. లోపలకుఁ జేరినంతనే యా సన్యాసులు తమ దండకమండలముల నొకచోఁ బాఱవైచిరి. కొందఱొకచోఁ గూడి కచ్చలుబిగించి సాముసాధనము లందుకొని వ్యాయామ మొనర్చు చుండిరి. మఱియొకచో గొందఱు విల్లమ్ములతో లక్ష్యభేదనము నేర్చు చుండిరి. మఱికొందఱు ఖడ్గములు, బల్లెములు గైకొని యుద్ధనైపుణ్య మభ్యసించుచుండిరి. మఱికొందఱు బాహాబాహీగ ద్వంద్వయుద్ధమునకుఁ దలపడి కౌశల్యము సాధించుచుండిరి. క్షణములో నా విహారమొక సైనిక కూటముగ మాఱినది.

ఒక జాము సేపట్లు సాము సాధనలతోఁ గడిచిన పిదప 'గణగణ' గంట మ్రోగినది. వెంటనే యందఱు త్వరత్వరగా సంకేతస్థలముఁ జేరుకొనిరి.

ఒక విశాల ప్రదేశమున నొకమూల నున్నతవేదికపైని వ్యాఘ్రాస నమున నొక పండు ముసలివృద్ధుఁ డాసీనుఁడై యుండెను. అతఁడును దండ కమండలముల ధరించియుండెను. ఒక్కొక్కరుగ నందఱాతని సమీపించి 'జయ జినేంద్ర భగవన్' అని యుచ్చరించి పాదములు స్పృశించి కన్నుల కద్దుకొని యొకరి వెనుక నొకరు కూర్చుండిరి. జట్టు నాయకు లిరువదేడుగురు ముందు వరుసలో నాసీనులైరి.

జినేంద్రస్వామి యందఱను చిరునగవుతో నాదరించి చేసంజ్ఞలతోఁ గూర్చుండ ననుమతించెను. అరగడియలో నందఱు సమావిష్టులై జినేంద్రుని యాజ్ఞల వినుటకు చెవులురిక్కించుకొని యుండిరి.

నాఁటి సమావేశమునకు హాజరు కావలసియున్న ఇరువదేఁడుజట్టుల వారు తమనాయకులగు జైనమహావీరులతోవచ్చి వరుసలుదీఱికూర్చుండిరి. జినేంద్రస్వామి యొక్కొక్క జట్టు నాయకునే పిలిచి విశేషములారయ సాగెను. నాయకులగు మహావీరు లొక్కొక్కరుగా లేచి జినేంద్రస్వామికి స్వకార్యములు విన్నవించిరి. ముందుగా భద్రనాథ మహావీరుఁడు లేచి 'స్వామీ! నేను చాళుక్య చూడామణియైన తైలపదేవుని యాస్థానముౘ కల్యాణినగరమున నున్నాను. తైలపదేవుఁడు కాకతి రాజులన్న మండిపడు వాఁడు. అందునను కాకతి ప్రోలుఁడన్న నాతనికి బొత్తిగకిట్టదు. తన తండ్రి యగు పశ్చిమ చాళుక్యచక్రవర్తి విక్రమాదిత్యునొద్ద సామంతుఁడైయుండిన ప్రోలుఁడు తన తండ్రి యనంతరమందు స్వతంత్రుఁడై రాజ్యస్థాపనమును బ్రారంభించి విజృంభించుట యాతనికి తలఁ గొట్టివేసినట్లున్నది. తమ వంశపు వారేలవలసిన రాజ్యభాగముల కాకతిరాజు లాక్రమించి పాలించు టాతని మనసును కలంచి వేయుచున్నది. తన బల మల్పమైనను అదను చూచి మీఁదఁబడవలెనని యాతఁడు కనిపెట్టుకొనియే యున్నాఁడు. జాగరూకత వహింపనిచో అనుమకొండ రాజ్యమునకు సమీపమందుఁ గల తమ రాజ్యభాగములగు నెక్కొండ పానుగల్లు ప్రాంతములను, మహబూబునగర నల్లగొండ మండలములను ప్రోలుఁ డాక్రమించుకొను నని నేను హెచ్చరింపగా ఆ భయమున నాతఁడిపుడు నా ప్రోత్సాహము ననే ఆ ప్రాంతములకు రాజధానియగు పొడూరునందు సైన్యముల సమీకరించినాఁడు. తన్న తండ్రి కాలమున యువరాజుగా తాను ఆ ప్రాంతముల పాలించిన వాఁడగుటఁ బ్రోలుఁడట కాలువెట్టకుండ తానే యటనుండి ప్రోలునిపైఁ బడవలెనని కనిపెట్టుకొనియున్నాఁడు.

ఈ చాళుక్య చూడామణి హస్త్యారోహణకర్మ కర్మరుఁడు, శశ్వద్యుద్ధనిబద్ధ గహ్వరమతి, రిపుకంఠ ఖండనవిధిలో ప్రఖ్యాతి నార్జించినవాఁడు. తైలప దేవునకు కాకతిరాజుపైఁగల క్రోధాగ్నిని మండించుటకు వేఱ యింధన సామగ్రి యక్కఱలేదు. స్వయంభూలింగమును స్పృశింపఁజేసి ప్రోలుఁడు ప్రతిదినము బారువు పరిమితి నినుము బంగారుగా మార్చుకొనుచున్నాఁ డని నేను చెప్పినపుడాతనికిఁ గలిగిన యుద్ధకాంక్ష యసలే చెప్పనలవికాదు. వెంటనే ప్రోలునడచి స్పర్శవేది లింగమును స్వాధీనపరచుకొనుట కాతఁ డెప్పుడెప్పుడని యెదురుచూచుచున్నాఁడు. నామాటల యదుపుతో నింత వరకాగియున్నాఁడు. యుద్ధమునకు తమరెప్పుడు మంచిదని సెలవిచ్చిన నప్పుడాతనిని బయలుదేఱఁదీయఁగలను. ఆ యుద్ధమునకుఁ గావలసిన పరికరము లమర్చుకొను పనిలో 'కోడూరు'లో నాతని నిమగ్నుని గావించి యున్నాను' అనిచెప్పి కూర్చుండెను.

జినేంద్రస్వామి భద్రనాదుని ప్రతి మాటకు నానందమును వెల్లడించుచు. మందహాసము సేసెను. 'భద్రనాథా! నీవల్లనే ప్రోలునియాట వెంటనే కట్టఁగల దనిపించుచున్నది. కాని యింకను కొన్నాళ్ళు నిరీక్షించు టవసరము. మేమాజ్ఞల నంపువరకు వేచి తైలపదేవుని యుద్ధప్రయత్నము తీవ్రతరము చేయుచుండునది' యని పలికి జినేంద్రుఁడు వరుసలోని రెండవ మహావీరుని వంక చూడ్కి నిగుడించెను.

మణిభద్ర మహావీరుఁ డంతట లేచి నిలువఁబడెను. 'జినేంద్ర భగవన్! నేను నేలకొండపల్లిసీమ పరిపాలకుఁడగు గోవిందరాజు నాస్థానమునఁ బూజలందుకొనుచున్నాను. ఈ గోవిందరాజు ఆరవ విక్రమాదిత్యుని సేనాధిపతియైన అనంతభూపాలుని సోదర పుత్రుఁడు. ఇతఁడు కాకతి ప్రోలునకు సహజ శత్రువు. తైలపునివలెనే తొల్లి ప్రోలునిపై సర్వాధికారములు గలిగి యాతనిచే మన్నన లందుకొన్న యనంత భూపా

లుని కుటుంబమున పోలుఁడు స్వతంత్రుఁడై తనకంటె నున్నతుఁడగుట సహింపలేకుండుటచే కాకతి ప్రోలుని తెగటార్పవలెనను నుబలాట మాతనికి హెచ్చుగనున్నది. పోలుఁడు వీరశైవమునకు మొగ్గినాఁడని నేను చెప్పగా నాతఁడు జైనులను తాను చేపట్టిన తనకు బలము వృద్ధి కాఁగలదని యిపుడాశించుచున్నాఁడు. అతని యాశల కనుగుణముగా జైనబలముల సంపాదించుట కాతనికి నేను సలహాల నొసంగుచున్నాను. అతని కిపుడు నేనెంత చెప్పిన నంత.

గోవిందరాజు పరశువుతో యుద్ధము చేయుటలో నిపుణుఁడు. ఈతఁ డపర పరశురాముఁడే యనిపించునట్టి పరశుశ్లక్ష్ణాగ్రధారోల్లస ద్ధారా పాత నిపాతనైక చతురుఁడు. తమరు సెలవిడిన నేఁడే యాతఁడు ప్రోలునిఁబట్టుటకు సిద్ధముగా నున్నాఁడు' అని స్వస్థానమునఁగూర్చుండెను.

జినేంద్రుఁడానందభరితుఁడై 'ఒకరికి మించి యొకరు చెప్పుమాటలు వినుటతో మనకార్యము సఫలమైనట్లే యనిపించుచున్నది. భేష్! మణి భద్రా! నీ ప్రయత్నములు మెచ్చఁదగియున్నవి. త్వరలో నే నీకాజ్ఞ లందింపఁ గలను. అంతవరకుఁ దొందర పడకుండ గోవిందరాజు నావేశము నాపియుంచుము' అని పలికి మూఁడవవానిని లేవనాజ్ఞాపించెను.

అంతట వృషభనాథ మహావీరుఁడు నిలఁబడి 'జినస్వామీ ! నేను తమ సెలవు ప్రకారము *మంత్రకూటాధిపతియైన గుండరాజ ప్రభువును గొలిచియున్నాను. గుండరాజు మహోద్దండపరాక్రముఁడు. శత్రు ప్రతాపమును సహింపఁడు. ఈతఁడు తైలపదేవునివలెనే స్పర్శవేది లింగముపైఁ గన్నువేసినాఁడు. ఆ లింగముతో దినదినము బంగారుపంట పండించు కొనవలెనని యాసతో యుద్ధమునకు సిద్ధపడుచున్నాఁడు. నా పలుకు

---

* నైజాము రాష్ట్రమునందలి మంథని గ్రామము తొల్లి మంత్రకూటమని విఖ్యాతి గాంచినది.

లాతనికి ప్రోలుని జయించి పెట్టఁగలవిగాఁ దలఁచి నన్ను బ్రహ్మారథము పటి యుత్సాహపెటుచున్నాఁడు. తమసెలవైనచో నాతఁడు నేఁడీయుద్ధము నకుఁ దలపడఁగలఁడని చెప్పి యుపవిష్టుఁడయ్యెను.

జినేంద్రస్వామి మందహాసము సేసి వృషభనాథుని గౌరవించి తరువాతినాయకుని కరసంజ్ఞచే లేవనాజ్ఞాపించెను.

సర్వతోముఖ మహావీరుఁడంత జినేంద్రునకు శిరమువంచి చేతులు జోడించి 'స్వామీ! నేను వేములవాడ ప్రాంతపాలకుఁడగు జగద్దేవునికి గురుపదమున నెలకొనియున్నాను. జగద్దేవుఁడు సహజముగా జైనమతము నభిమానించువాఁడు. జైనమునకు ప్రోలునివలనఁగలుగు నాశమును దెలిసి కొని మండిపడుచున్నాఁడు. దొమ్మెరాజు, మేడరాజునను వారీతనికి మిత్రులు. అగ్నికి వాయువుతోడైనట్లు వీరిరువురుకూడ జైన మతాభిమాన మున జగద్దేవునకుఁ దోడుపడుచున్నారు. వారికందఱకు నాపైని గురు భావము గుదురుకొన్నది.

మాధవవర్మ వంశమునఁబుట్టిన సుక్షత్రియుఁడగు దుర్గరాజునకు మేడరాజు, జగ్గరాజు నను నిరువురు పుత్రులు. మేడరాజు ప్రోలుని బంధువర్గమువాఁడే యగుట ప్రోలునిపైని జ్ఞాతిమాత్సర్యము ప్రబలముగా వహించియున్నాఁడు. 'జ్ఞాతిశ్ఛేదనలేన కిమ్మ'ను వాక్యమీతనియెడల సార్థ మగునట్లున్నది. ఇతఁడు జైనమతప్రవిష్టులలో శ్రేష్ఠుఁడు. ఈతని మంత్రి యగు నాగదేవరాజు పారశ్వ జినేశ్వరాలయముల స్థాపించి భూరిభూదా నములొసంగెను. రాజమంత్రు లిరువురు జినేంద్రపాదపద్మాంబుజశ్రీ వలననే తమకు శుభము కలుగునని నమ్ముకొనియున్నారు. జగద్దేవున కీతఁడు కడుంగడు కూర్చుమిత్రుఁడు. దొమ్మెరాజును మేడరాజునకు ప్రాణ మిత్రుఁడు. మనకార్య మీ ముప్పురచేతనే కొనసాగఁగలదను నమ్మకము నాకున్నది. తమసెలవు తరువాయిగా వారు యుద్ధసన్నద్ధులైయున్నారు' అని పలికెను.

జినేంద్రస్వామికి ఆనందభరము హెచ్చి సర్వతోముఖు నాలింగనము సేసికొని కూర్చుండ నియమించెను. తరువాత వరుసగా ఉదయేంద్ర, మహాజిన, సర్వజ్ఞ ప్రముఖులగు మహావీరు లొక్కొకరే లేచి తాము ప్రోలునిపై విద్వేషము లెట్లు ప్రజలలో రేపినది, ప్రజావిప్లవము నెట్లు దేఁగలిగినది, వివరించిరి. ప్రోలుని యాస్థానమున జైనమతమహాభిమాని యగు బేతనప్రగ్గడ, అతనిభార్య మైలాంబ ప్రోలునిఁగూర్చి రహస్యముగఁ దోడ్పడఁగలరని సర్వజ్ఞమహావీరుఁ డుత్సాహముతోఁ దెలిపెను. ఆమాట విన్నప్పుడు జినేంద్రస్వామి సంతోషభర వివశుఁడయ్యెను. బైటనుండి యుద్ధసన్నాహమేకాక ఇంటనుండి రంధ్రకార్యనిర్వహణమును జరుగుచున్నందు కాతఁ డుబ్బిపోయెను.

బాలశివదేవుఁడు జైనమహావీరుల మాటలు శ్రద్ధగా నాలకించెను. ఆమాటలు వినుచున్నకొలఁది నాతనిశరీరము కంపించిపోయెను. వీరశైవమున కాలంబముగనిలిచిన కాకతిప్రోలరాజునకు ఎంతటిముప్పు జైనులు తలపెట్టినదియుఁ బ్రత్యక్షముగ విని యాతఁడు మిక్కిలి భయాందోళనము నొందెను. తన యాందోళనమును బైకిఁ దెలియఁబడకుండ నాతఁడతికష్టముపై నిగ్రహించుకొని వారిలోఁగలిసి కూర్చుండెను.

జినేంద్రస్వామి మహావీరజైనులందఱివలన నన్నిసంగతులు తెలిసికొని వేదిక దిగివచ్చి యొక్కొకరినిగా వారల నందర గాఢాలింగనముఁ గావించుకొనెను. విడివిడిగాఁ దగు సలహాల నొసంగి యందఱనుద్దేశించి తుదిపలుకు లిట్లుపలికెను.

“మహావీరజైనులారా! జైనమతము మనుగడ నేఁడు మీపై నాధారపడియున్నది. ఇది మనకు జీవన్మరణసమస్య. మన పూర్వుల త్యాగము వలన నిన్నాళ్ళు నిలఁబడిన జైనమతము మఱికనులార నాశమగుట మనము చూడలేము. జీవములున్నంతవరకు తుదిక్షణమువరకు మన యత్నములు సాగించుటే మన కర్తవ్యము. మీరు చేయుచున్న ప్రయత్న

ములు వినినపుడు మనము ప్రోలునియాగడము నణఁచివేయుట సులభమే యనిపించుచున్నది. కాని మన ప్రయత్నములు ఇంకను సుదృఢముగఁ గావించుచునేయుండవలెను.

భారద్వాజగోత్రజుఁడైన రామేశ్వరదీక్షితుఁ డఖండుఁడు. అతని కూటనీతి కౌటల్యుని మించినది. జైనమతమున సుప్రతిష్ఠితుఁడగు బేతరాజునే శైవమునకుఁ ద్రిప్పగలిగినాఁడు. బేతరాజు దీక్షితునిమాట లెన్ని విన్నను చివరకు నామాటనే పాటించెడివాఁడు. కనుకనే దీక్షితులు బేతరాజును విడిచి తపస్సునకుఁబోయినాఁడు. తిరిగి రామారణ్యుని ప్రోత్సాహమున ప్రోలునిఁజేరి తనయాట మరల సాగించుచున్నాఁడు. స్వయంభూలింగావతరణము దీక్షితుల కల్పితమే. శివదేవుఁడు లింగమై యవతరించెనఁట. అదైనది ఇనుమును బంగారముచేయు పరుసవేదిలింగమఁట. మనము దీనిని విశ్వసించుటయెట్లు? ప్రోలరాజు మనసు ఎటునునిలువఁ ద్రొక్కలేని యూగులాటలోనుండు సమయమున దైవశక్తిపై విశ్వాసము గల్పింప నీ స్వయంభూలింగమును కల్పించి అవతరింపఁజేసి దీక్షితులు ప్రోలరాజు మనస్సుపై పీఠమువైచుకొని కూర్చుండినాఁడు. ప్రోలుని మనసంత దుర్బలమై అసంభవవిషయముల దైవమహిమలుగా విశ్వసించినది.

ఈ స్పర్శవేదిలింగముపై భ్రాంతిఁగొలిపి ధనలోభముగల శత్రురాజులను యుద్ధకార్యమునకై మనము కూడఁగట్టుకొనుట సులభము. భద్రనాథ, వృషభనాథ మహావీరాదులు, తైలపదేవాదులకు నీలింగముపై నాశపుట్టించి మనవైపునకుఁ ద్రిప్పుకొనుచుండుట యెంతయు సంతోషింపఁదగినది. దీక్షితులు చేసిన లింగకల్పనము శత్రువులకానసూర్చుపనికి మనకే యుపయోగించుచున్నది. ప్రోలుని శత్రుజ్ఞాతులకుఁ బ్రాఁతపగలు రెచ్చఁగొట్టుట మన కవశ్యాచరణీయము. మణిభద్ర, సర్వతోముఖ మహావీరాచలీకార్యమును నేమఱకుండునది.

బేతనదంపతులు ప్రోలు నంటిపెట్టుకొనియేయుండి మనకార్యము నకు సాయపడుట యన్నిటికన్న ప్రయోజనకరము. వారు ప్రోలునికి తమపై ననుమానము బుట్టకుండునట్లు జాగ్రత్తగ సంచరించుకొనునట్లు హెచ్చరించునది. వారిప్రాణములను మనము సర్వదా కాపాడుకొనవలెను.

ప్రతిదినము స్పర్శవేదిలింగమున నినుము బంగారముచేయుచున్నా మను అసత్యపుమాట వ్యాప్తికిఁదెచ్చి దీక్షితులు ప్రోలుని ఐశ్వర్యమఖండ ముగా చిత్రించినాఁడు. అతని యైశ్వర్యమహిమ నమ్మించుటకై విరివిగా దానధర్మములు చేయించుచున్నాఁడు. మతావేశము పెంచి జీతనాతములులేని సైన్యము వృద్ధిచేయుచున్నాఁడు. కొంతకాలము మన మూరకున్నచో ప్రోలుని ధనాగారము శూన్యమై యుద్ధావసరములఁ గూర్చుకొనఁజాలదు. మనకు ఆకాలము ప్రోలునిపైఁబడుటకు తగియుండును.

తిరిగి శీతకాలసమావేశము కోఅలపౌర్ణమి (మార్గశిర పౌర్ణమి)కి జరుగును. అప్పటికి నేను మన గూఢచారిదళముచే మీ మహావీరుల కెల్లరకు పథకములు పంపఁగలను. అదనుచూచి అందఱుశత్రువు లొక్క మాఱుగా ప్రోలునిపైఁబడినఁగాని ప్రోలుని జయింపఁజాలము. తాను రాజ్యమునకు వచ్చినతోడనే అనుమకొండకు ప్రోలుఁడుకట్టిన శిలాప్రాకా రము సుదృఢమైనది, కాన తొందరపడి యేయొక్కరును ముందు యుద్ధము నకు దిగకుండఁ కనిపెట్టియుండవలెను. అందఱును కలసినఁగాని అనుమ కొండ శిలాప్రాకారమును శిధిలపరుపఁజాలరు. ఆలస్యమైనను అఖండవిజ యము సాధించుటే మనలక్ష్యము. ప్రోలునిపైమనము పడకుండ ప్రోలుఁడే మనపైఁబడినపుడే యందఱుఁగలసి జయించుట సులభమగును. కాని యట్టి సంఘటన మెట్లుజరుగునాయని ఆలోచించుచున్నాను. ఏమి జరుపఁ దలచినది నేను మీకు చారులబంపుచు నా సలహాల నందించుచుండెదను. ఎవరికి ననుమానముబుట్టకుండు వేసములు ధరించునట్లుఁజేసి మీచారుల నిటకు బంపుచుండవలెను. ఈ హిడింబాశ్రమము మొదటినుండి త్రిదండి

సన్యాసులకు నిలయము కాన మీరిందువచ్చునపుడు వారివేషమే ధరించుట యుక్తము. తెల్లవాఱకముందే మీరీపాతాళగృహము విడిచి పోవలెను. ఇప్పటినుండి తిరిగి మార్పుఁదెలుపువరకు 'జయ పారశ్వనాధ భగవన్' అను సంకేతనామ ముచ్చరించినవారికే పాతాళ గృహమునకు ప్రవేశాను మతి లభింప గలదు. మీరిఁక వెడలవచ్చును.'

జినేంద్రుఁడు తుదిపలుకు లుచ్చరించుటతో నందఱు నటనుండిలేచిరి. ఎవరికివారు త్వరపడుచు వేషముల మార్చుకొని గృహము వెడలిపోయిరి. అందఱు నరణ్యమార్గముఁజేరి తలకొకదారినిబడి వడివడిగ నడచిపోయిరి. బాలశివదేవుఁడును వారితోడనే బైటకువచ్చి తెల్లవారువరకొకచెట్టుమొదట గూర్చుండి వేఁగిన పిదప ననుమకొండనగరాభిముఖుఁడై పోయెను,

## పదుమూఁడవ ప్రకరణము.

# రాజ్ఞి ముప్పాంబ.

ప్రోలరాజు భార్య ముప్పాంబ. కౌసల్యవలె సాధ్వీమతల్లి. జానకి వలె భర్తృసేవాపరాయణ. పంచపాండవులకంటె మహాధురంధరులగు నయిదుగురు బిడ్డలకుఁ దల్లియై కుంతీదేవి యనిపించుకొన్నది. భర్తృ సంపత్కారణయై పద్మకు సాటియైనది. మహేంద్రవైభవముబొంది పౌలోమినాఁబరగినది. సృష్టి స్థితి లయ కారణులగు త్రిమూర్తులకు శక్తినిఁ బ్రసాదించిన చండికాదేవినింబోలె భర్తకు శక్తినొసఁగునది. ముప్పమాదేవి సుగుణములు ధగధగప్రకాశించు నక్షత్రములవంటివి.

నాఁడు ప్రభాతసమయమున ముప్పాంబ భర్త్రాగమనమును నిరీక్షించుచు ననుమకొండనగర బాహ్యోద్యానమున విహరించుచుండెను. స్వయంభూలింగావతరణము మొదలుకొని బహు రాజ్యకార్యభారమగ్నుఁ డగుటచే పెక్కుదినములకొకసారిగాని ముప్పాంబకు ప్రోలరాజు దర్శన మొసఁగుటలేదు. ముప్పాంబ మాటిమాటికి ప్రోలుని వీరశైవాభిమాన మును, జైనవిధ్వంసదీక్షను గుంచించుటకు యత్నించుచుండెడిది. అందుననే దీక్షితులు ప్రోలుని మనస్సు ముప్పాంబ త్రిప్పివేయునేమో యని భయ పడుచు ముప్పాంబకు తఱచు దర్శనమొసఁగు నవకాశములేకుండ రాజ్య కార్యవ్యగ్రతలో ప్రోలుని నిలిపివేసియుంచుచుండెను. ముప్పాంబ ప్రోలు నితోఁగలిసి ఎప్పుడెప్పుడు మాటాడినది తెలిసికొని దీక్షితులుత్తరక్షణముననే ప్రోలుని కలిసికొని రాణి ప్రోద్బలమువలనఁ గలిగిన మార్పులాతని మనసులో స్థిరముద్రపడకుండ నెప్పటికప్పుడు చెఱిపివేయుచుండెను. ముప్పాంబాదీక్షితుల వాక్కులు ప్రోలునకు మానససముద్రమున వచ్చుచు విచ్చుచునుండు తరంగములుమాత్రము. ప్రోలుని అంతస్సుమాత్రము సముద్రగర్భమువలె నిశ్చలగభీరము.

ప్రతిదినము ఉదయకాలమున ప్రోలుడు పురబాహ్యోద్యానమునకు వాహ్యాళి వెడలుచుండును, నాఁడు దీక్షితులవారు నగరమునలేరని తెలిసి కొని ముప్పాంబ ప్రోలుని యాదృచ్ఛికముగాఁ గలిసికొన్నట్లు సందర్శింప నాతనికన్న ముందుగా నుద్యానముఁ బ్రవేశించినది.

ప్రభాతవాయువులు మందగతి వీచుచున్నవి. అరుణకిరణములు లతలపైఁబడి పూవులు మిలమిల వెలుఁగుచున్నవి. తుమ్మెదలు ఝాంకృతి గీతములతోఁ బూలకన్నెల స్పృశించుచున్నవి. శుకపికశారికావళులు మనోజ్ఞకలరవములు గావించుచున్నవి.

" ప్రభువువారు వచ్చుచున్నారు, ప్రభువువారు వచ్చుచున్నారు " అని దాసి పరుగునవచ్చి ముప్పాంబను హెచ్చరించెను. దాసినితొలఁగి పొమ్మని యాజ్ఞాపించి ముప్పాంబ గున్నమామిడిక్రింద చంద్రకాంతశిలా వేదికపైఁ గూర్చుండి కోసితెచ్చి గుట్టయిడిన పూవులలో నందమైనవేర్చి మెల్లగా గీతములు పాడుచు నిలువెత్తుమాల గ్రుచ్చుచుండెను. అప్పుడపుడు రాజురాక గమనించుటకు వెనుదిరుగుచుఁ దనదిక్కువచ్చునంత తానాతని జాడ నెఱుఁగనట్లు మాలాగ్రథనమున నిమగ్నత నటించెను.

ప్రోలరాజు దారిలో దాసినడిగి రాణి యొక్కతెయు నుద్యానమున నుండుట తెలిసికొని తానాపె యటవచ్చుటెఱుఁగనివానివలె నటించుచు ప్రకృతిసౌందర్యదర్శన నిమగ్నునివలె నాపెకు నాతిదూరముననే తిరుగుచు నప్పటప్పట వెనుదిరిగి యాపె చేష్ట లరయుచుండెను.

ఒక గడియ గడచినంత నొకరిదొంగచూపులొకరికి తెలిసిపో యినవి. అయినను ఎవరుముందు బయటపడుటా యనునది తేలక ఏమియు నెరుగనట్లే మరియొకగడియ గడిపిరి.

ముప్పాంబ యొకింత సందుచేయనెంచి పాడుచున్న గీతముమార్చి "మాలగ్రుచ్చి నీకై నే వేచితి మాధవ రావేరా, యెంతకు మాధవ రావేరా"

యని వెనుదిరిగియుండియే యేమియు నెఱుఁగనట్లు కట్టిన మాల వెనుకకు పెట్టి రాధికావిరహగీతినందుకొన్నది, ఆ అన్యాపదేశగీతిక చెవి సోకుటతో రాజునకు మానసమున బింకము సడలిపోయినది. తానిఁక మనస్సును నిలదొక్కలేకపోయినాఁడు. పిల్లినడకలతో మెల్లమెల్లజని వెనుకనున్న మాలనందుకొని తన మెడలోవైచుకొని వ్రేలుచున్న కొసనందుకొని యదే మాల రాణి మెడలోవైచి "ఇరువుర మొకటేమాలవైచుకొన నెంతయంద మగునో! రాధా! యెంతయందమగునో" అని పాట సాగించెను.

రాణి యులికిపడినట్లు మెడద్రిప్పుకొని వెనుదిరిగిచూచెను. గమనోద్వేగములో మాలతెగి రెండుకొసలు రాజు మెడలో కండువావలె వ్రేలాడినవి.

"చూచితివా! నీ యదురుపాటువలన మాల తెగినది. ఇరువుర కంఠముల నొకేమాల యమరిన నెంతబాగుండునో! నేనందులకు ముచ్చట పడినను నీచర్య యందుకు విరుద్ధమైనది." అని ముప్పాంబ తన్ను శైవధోరణినుండి తలఁచు మార్పయత్నించుట నష్టదాయకమనుమాట ధ్వనించునట్లు సాభిప్రాయముగా నుడివెను. "నన్ను మీరు హృదయమున కత్తుకొని మాలవైచినఁ దెగకుండగనే యుండెడిదికదా! లోనలేక పైకెన్ని చేసిన నైక్యమెట్లు కుదురుకొనఁగలదు" అని ముప్పాంబ సూటిపోటుగ తనమాటలు రాజు హృదయస్ఫూర్తిగ నాదరించుటలేదనుటను సూచించుచు బదులుజెప్పి శరీరమంట దగ్గరకుఁజేరి తెగినమాల ముడివైచి తనమెడలో వైచుటకై కొసయందిచ్చి కిలకిలనవ్వినది. రాజునకు సూటిమాట బదులు దొరికినదికాదు. తిరిగి భావగర్భితముగా నిట్లు సంభాషణసాగినది.

రాజు:— 'మఱి యీమాల తెగకుండనుండవలెనన్న నిరువురమొకేగమన వేగము ననుసరింపవలెనుమా!' (అని మాల నామె కంఠసీమకుఁ జేర్పబోయెను.)

ముప్పాంబ:—(ప్రోలుని చేయిపట్టుకొని ఒకింతనాపి) అవును. నన్నుగురించి మీ గమనవేగము తగ్గించుకొందురామఱి!

రాజు:— నా గమనవేగమును నేను నీకై తగ్గించుకొనిన త్వరగా గమ్యము చేరుకొనుటెట్లు ? నా వేగము నీ వనుగమించుటయే శ్రేయము.

ముప్పాంబ:—త్వరగా గమ్యమును జేరుకొనుటకు మీరు వేగము హెచ్చించిన గమ్యముఁ జేరకుండగనే యాయాసపడవలసివచ్చునేమో ఆలోచించితిరా !

రాజు:— ఆయాసపడకుండ నేయభివృద్ధినైన సాధింపనగునా ?

ముప్పాంబ:— పరుగెత్తి పొలుత్రాగుటకంటె నిలుచుండి నీళ్ళుత్రాగుట మేలుకాదా ?

రాజు:— ఎన్నాళ్ళు నీళ్ళేత్రాగిన క్రొత్తబలము చేకూరదు సరికదా త్వరలో కృశత్వముగలిగి, యున్నప్రాణము లూడిపోవుట నిశ్చయము.

రాణి బదులుచెప్పలేకపోయినది రాజుమనసును దన యదుపులో నికిఁదెచ్చుట యశక్యమని యాపె భావించి నిస్పృహపడినది. ప్రోలరాజు ముప్పాంబ నొకింత యుత్సాహపరుప యత్నించెను గాని ఆపె మనసు తేలుకొనలేదు. భుజముపై చేయివైచి రాజు దగ్గఱకుఁదీసికొని శిలావేదికపై రాజ్ఞి నాసీనఁజేసి తాను నాసీనుఁడయ్యెను. రాణి తానువచ్చినపని సుముఖముగాలేదని మనసును కుంచించుకొనినది. రాజాపెభావమెఱిఁగి దిగులు దీర్పకతప్పదనియెంచి "దేవి ! నీవిట పనిపడివచ్చినట్లు దోచుచున్నది. నీ మాట గాదనువాఁడగాను. సందేహింపక తెలుపు" మని యనునయించి పలికెను. రాణి తేరుకొని "ప్రభూ ! మీకు చెప్పెడిపాటిదానఁగాను. కాని నాప్రార్థన మొకండుమాత్ర మంగీకరింపవేఁడెదను" అని పలికి రాజు భుజముపై తలవాల్చి కన్నులు దుడుచుకొనెను. రాజాపె మనోగతము దెలుప బుజ్జగించియడిగెను.

రాణి:— మన బేతనదంపతుల నవమానించుట మనకుఁదగునా? మీతండ్రి కొలువున మంత్రియైయుండి సర్వవిధముల రాజ్యమును సంరక్షిం

చిన వైజదండనాథుని కుమారుఁడుగదా బేతనప్రెగ్గడ! వంశపారం పర్యముగ వచ్చుచున్న మంత్రి మనస్సుపాడుజేయుట మనరాజ్య మునకు శ్రేయోదాయకమనియే భావించితిరా! బేతన మహా విద్వాంసుఁడేకాక ధర్మశీలుఁడుకూడగదా!

రాజు:— బేతనప్రెగ్గడ మహావిద్వాంసుఁడు, ధర్మశీలుఁడునుకూడ. కాని అతఁడు భార్యామోహమున మూర్ఖముగ జైనమతమున కంటుకొని పోయినాఁడు. మైలమ తీవ్రజైనమతావిష్టురాలు. నేఁడు మనరాజ్య వ్యాపనమునకు జైనమడ్డుగదా! బేతనదంపతుల యాటలు సాగిం చిన మన రాజ్యాభివృద్ధి యెట్లు?

రాణి:— మైలాంబమాట బేతన పాటించి చేసిన యకార్యమేమున్నది? మీ తాతముత్తాతలనుండి వచ్చు జైనమతము మీకిష్టముకాకపోయినది నేఁటికి. మీరు దీక్షితులవారికి వశపడిపోయినారు.

రాజు:— నీకు రాజ్యాంగవిషయము లర్థములుకావు. నాకు జైనహింస హితవుకాదు. కాని రాజ్యవ్యాప్తికి శైవము చేపట్టకతప్పదు. శైవ వ్యాప్తి కడ్డుతగిలినంతమట్టునకు జైనహింస నామోదింపకనుదప్పదు. దేవీ! నీవు లోతుగా రాజ్యాంగతంత్రముల నాలోచింపలేవు. నీకు కావలసినవిషయముల నేను నీయిష్టప్రకారమేనడుతును. రాజ్యాం గసూత్రములమాత్రము వ్రేలుపెట్టవలదు. జైనధ్వంసకార్యమేది తలపెట్టినను నామనసు దటతట కొట్టుకొనుచునేయుండును. ఇఁక నుండి అట్టిపనులు నీకుఁ దెల్పియే జేయుదును.

రాణి:— అంతమాత్రము నాయిష్టము సాగించినఁజాలును. మీరు 'కడలాలయబస్తి' యాలయములో పద్మాక్షి యను దుర్గావిగ్రహ మును నిల్పుట బాగున్నదా! కడలాలయను మైలమ నిల్పికొన్నది. దానికి మీరు భూవసతి దానముసేసి శాసనముకూడ వ్రాయించితిరి.

ఆయాలయముగాక పద్మాక్షిని నిల్పుటకు వేఱొకయాలయము కట్టించుకొనఁగూడదా !

రాజు:— పద్మాక్షి యేనాఁడో అనుమకొండను వెలసిన మన కులదేవత యగు దుర్గాశక్తి. దానిని, జైనులెపుడో తొలగించివైచి కూష్మాండినిగా మార్చిరి. మన వంశస్థులు జైనమతప్రవిష్టులై స్వపూర్వ చారిత్రము నెఱుఁగనిరోజులలో దాని నామోదించిరి. నాతండ్రి బేతరాజు కూష్మాండినిని కాకతిగామార్చి కొంత తృప్తిపడెను. శ్రీపాదులవారు మన క్రమరాజుల పూర్వచరిత్ర నెఱిఁగించినదాది పద్మాక్షి సిద్ధేశ్వర శ్రీమన్మహాదేవుల పేరులతో రెండుగుడులు నిర్మింపఁదలఁచియేయున్నాను. నేఁటికదిజరిగినది. కడలాలయకు భూదానముసేసి శాసనము నిల్పిన నేనే దానిని ధ్వంసముచేయుదు నని అనవసరముగా ననుమానించి జైనుల ప్రోత్సాహముతో బేతన దంపతులు కడలాలయవిగ్రహమును మాయముచేసినారు. నేను మొదట పద్మాక్షికి, సిద్ధేశ్వరునకుఁగూడ వేఱుగా గుడులు కట్టింప వలయుననియే తలఁచితిని. కాని జైనులు 'కడలాలయ' విగ్రహ మును తామై కొనిపోవుటతో నొకగుడి కట్టింపనవసరములేక పోయినది.

రాణి:—కడలాలయవిగ్రహమును బేతనదంపతులే త్రవ్వించివైచిరందురా!

రాజు:— అవును. ఆవిషయము స్పష్టము. త్రవ్వుచుండఁ జూచిన మన వేఁగువాఁడు నాకు నాఁడే తెలిపెను. బేతనదంపతులపైఁగల యభిమానముచేతనే దానివిషయమై నేను వారిని శిక్షించుటకై బంధింపలేదు. నీకున్న గౌరవాభిమానములు బేతనదంపతులపై నాకునుగలవు. వారిపై నాకభిమానములేకున్న ఆలయమున కెదురుగ మైలమ కన్నడమున జినేంద్రస్తుతితో వ్రాయించిన శిలాఫలకశాసనమును, కడలాలయ దానశాసనమును, దానిప్రక్కనే

మైలమాబేతనుల విగ్రహములును, ఇంకనుగల పెక్కు జైనవిగ్రహ ములును తీయుంచివేయవలసినదని దీక్షితులువారెంతగఁజెప్పినను వినక బేతనపైనిఁ వైజదండనాయనిపైని గల కృతజ్ఞతాభావము చేతనే వానిని చెక్కుచెదరనీయకుండగ నచ్చటకే యుంచితిని. ఆకారణముననే వీరశైవజంగములకు నాపైని కోపముగూడ వచ్చినది.

చివరవాక్యములు వినుటతో ముప్పాంబ మైలమాబేతనలయెడ ప్రోలరాజు హృదయమున నిగూఢముగ నెంతయభిమానము దాగియున్నది తెలిసికొనఁగలిగినది. ఇంక తాను విశేషించి రాజునకుఁ జెప్పవలసినపని లేదనిపించినది తానచటకువచ్చినది బేతన మైలమల కెట్టిహాని రాకుండఁ జూడుమని కోరుటకే. తనమనసు రాజుమనసు నొకటేయైనది. తానిఁక చెప్పవలసినపనిలేదు. అయినను రాజుమనసునఁగల యభిమానమును తెగకుండఁజేయఁదలఁచి ముప్పాంబ 'ప్రభూ! మీచిత్తమెఱుఁగక యన్న మాటలు క్షమింపుఁడు. జైనులైనను బేతనదంపతుల కేహానియు రాకుండఁ జూచుచు పూర్వగౌరవము నిలఁబెట్టుటకై మిమ్మర్థించుటకే యిటకు వచ్చితిని మీమనసు నామనసు నొకటేయైనది. మఱియొకమారు నాకు బేతనదంపతులగూర్చి ప్రమాణవచనము పలుక అర్థించుచున్నాను'' అని చేతులుపట్టుకొని యర్థించినది ప్రోలరాజు 'దేవి! సంశయింపకుము. ఎన్ని యిడుమలువచ్చినను బేతనదంపతుల కపకృతిఁ దలపెట్టను. సరిగదా!' అని చేతిలోచేయివైచి బుగ్గలుపుడికి మోము మోమునఁజేర్చి చుంబింపఁబోయెను.

ఇంతలో 'శివోఽహం శివోఽహం' అనియుచ్చైస్స్వరము వారికి వినఁబడినది. 'దీక్షితులువారిటకు వచ్చుచున్నారు' అని రాజు కళవళపడెను.

రాణి:— ఏమి! దీక్షితులవారేనా! వారు నగరమున లేరనివింటిని?

రాజు:— అవును, నేనును నట్లేవింటిని. నిన్నరాత్రికే తిరిగివచ్చిరిగాఁబోలు. ఏదో తొందరపనియుండి తామైయిటకువచ్చి దర్శనమొసఁగుచున్నారు.

రాణి దీక్షితులవారి రాకకు కంటగించుకొని వారి కంటఁబడకుండ పెరటిద్వారమున నగరుకు వెడలఁదలఁచినది. కాని రాజు 'గురువు దర్శన మొసఁగఁ బరాఙ్ముఖము వహించుటతప్పు. పాదాభివందనముఁ గావించిన పిమ్మటనే పోవచ్చును ర'మ్మని వెంటఁదీసికొని గురుదేవున కెదురుచని సవినయముగఁ దోడ్కొనివచ్చి చంద్రకాంతశిలావేదికపైనిఁ గూర్చుండఁ బెట్టెను. ముందు రాజు తదుపరి రాణి గురుపాదముల కన్నులకద్దుకొని 'నమశ్శివాయ' యని యుచ్చరించి మ్రొక్కి యంజలిపట్టి నిలచిరి. దీక్షితులు 'శివాయనమః' అని పలికిన పిమ్మట చేయెత్తిదీవించి రాణిపై నొకింత తీవ్రదృష్టిని నిగుడించిచూచెను. రాణి యాతీవ్రతకాగలేక యట క్షణమునిలువక భర్తను వెడలుటకై యనుజ్ఞవేడి ద్వారమునఁ గనిపెట్టు కొనియున్న దాసినిఁగూడి శకటమునెక్కి యంతఃపురమునకు వెడలెను. దీక్షితులవారు ముప్పాంబ రాజును శైవమునుండి దించినదేమోయని శంకించిరి. దీక్షితులవారి ముఖవైఖరి నారసి రాజు వినమితగాత్రుఁడై క్రిందుచూచుచు నిలఁబడెను. దీక్షితులు రాజు మనోవిధమారసి మందహా సముచేసి కూర్చుండవలసినదిగా చేసంజ్ఞచేసెను. రాజు శిలావేదికకు దిగువనున్న యాసనముపై నుపవిష్టుండయ్యెను. ఇరువురు నొకింతసేపు మౌనమువహించిరి. సంభాషణమెట్లుపక్రమింపబడుటయా యని ప్రశ్న యిరువురభావములఁ గలిగి యరగడియకాలము మౌనముతోఁ గడిచినది.

ఇంతలో ద్వారపాలకుఁ డరుదెంచి 'ఎవరో వీరమాహేశ్వరు లరుదెంచి తమదర్శనముఁ గోరుచున్నారు. ప్రవేశపెట్టననుజ్ఞయా!' యని యడిగెను.

'ప్రవేశపెట్టుము' అని దీక్షితులనఁగానే రాజును 'ప్రవేశపెట్టునది' యని యనువదించెను. పిమ్మట ద్వారపాలకుఁ డొక వీరశైవభక్తునట ప్రవేశపెట్టి వెడలిపోయెను. శివభక్తుఁడు దీక్షితులవారికి నమస్కరించి 'బాలశివదేవయ్య వచ్చి తమకై తమగృహమున నిరీక్షించుచున్నారు. ఇటకు గొనిరమ్మందురా' యని యడిగెను.

దీక్షితులువారు రాజువంకజూచి' 'నిన్నరాత్రికే రావలసిన బాలశివదేవుఁడు రాలేదేమాయని నేను తత్తరపడుచున్నాను. ఆతఁడెప్పుడును చెప్పిన సమయము నుల్లంఘించి యెఱుఁగఁడు. ఆతఁడు వచ్చినవెంటనే నాకుఁ గబురుపెట్టునది యని వీని నియమించి నేనిటకువచ్చితిని. బాలశివదేవుఁడేదో మహత్తరకార్యము చక్కబెట్టుటకే రాత్రియాగి నేఁడు వచ్చినాఁడు' అని పలికెను. ప్రోలరాజు బాలశివదేవుఁడు దెచ్చిన వార్తలను వినఁ గుతూహలము హెచ్చి 'మనమిటనుండి వెడలుదము. శివదేవుని మంత్రశాలకుఁ దోడ్కొనిరా సెలవొసంగుఁడు' అని ఆసనమునుండి లేచెను. దీక్షితులవారు శిలావేదికనుండిదిగి 'భద్రా! శివదేవయ్యకు రాజసహితముగా మంత్రశాలలో దర్శనమొసంగఁగలమని చెప్పిపంపు' మని పలికి ముందుకునడచెను. శివభక్తుఁడు 'శివాజ్ఞ' యని తలవంచి వెడలిపోయెను. రాజును గురువును నొకే బంగరుశకటమధిరోహించి యెకాయెకి మంత్రశాలకు బయలుదేఱిరి.

పదునాలుగవ ప్రకరణము.

# మంత్రాలోచనలు.

మంత్రశాలలో ముఖ్యసమాలోచన కేర్పడిన అంతర్గృహమున దీక్షితులువారు, ప్రోలరాజు, శివదేవయ్య ఉపవిష్టులైరి. శివదేవయ్య ఇరువది రెండేండ్ల ప్రాయముగల యువకుఁడు. దీక్షితుల వారికి కడుం గడుఁగూర్చు ముఖ్యశిష్యుఁడు. ముఖ్యములగు కార్యములలో దీక్షితులు వారు శివదేవయ్యను నియోగించుచుందురు. శివదేవయ్య మంచిశూరుఁడు, ధీరుఁడు. శివసంకల్పము నెఱవేర్చుటలో నంతటి యకుంఠిత దీక్ష మఱి యొకనికిలేదు.

శివదేవయ్య ముందుగా గురువునకు తదుపరి ప్రోలరాజునకు నమస్కారక్రియ సలిపెను. పిమ్మట క్రిందటి నాఁటి రాత్రి హిడింబాశ్రమమునకు దగ్గరగానున్న మహారణ్యములోని పాతాళగృహమునఁ దానుజూచినది విన్నది జైన మహావీరు లేయేరాజుల నాశ్రయించి యుద్ధములు లేవదీయుచున్నది, బేతనప్రెగ్గడపై జినేంద్రస్వామి యెంత ఆశపెట్టుకొన్నది, స్వర్శవేది లింగముపై నెవరెవరు కన్నువేసియున్నది సర్వము శివదేవయ్య రాజసమ్ముఖమ్మున వినిపించెను.

"హిడింబాశ్రమమున జైనుల పాతాళగృహమునుండి జైనయతులు పాఱిపోగా త్రిదండి సన్యాసులు దానినాక్రమించుకొనినట్లు మన వేగుల వాండ్రవలన వినియుంటినే. అది జైనుల వశముననే యున్నదా"! అని దీక్షితులు శివదేవయ్యను సాశ్చర్యముగ ప్రశ్నించెను. "గురుదేవా! నేను ముందట్లే భ్రమించితిని. జైనయతులు త్రిదండివేషముల ధరించి యం దిపుడు వసించుచున్నారు. ఆకారణమున మనమందఱము మోసములోఁ బడితిమి". అని శివదేవుఁడుచెప్ప గురువు తన ప్రమాదము గుర్తించెను.

ప్రోలరాజు జైనయతులు తలపెట్టిన కార్యక్రమమునకు భీతచిత్తుఁడై గురునివంక శూన్యదృష్టులఁ బరపెను. దీక్షతులవారు తలపంకించి 'రాజా! ఈజైనులవలననే మనకు ముప్పుగలుగఁగలదు. ముందు వీరిని మట్టుపెట్టవలెను. పాతాళగృహము ముందు ధ్వంసముఁ గావించివేయ వలెను. అటు పిమ్మట వీరుప్రోత్సహించిన శత్రువులను సులువుగానే పరిమార్పవచ్చును. ఇవన్నియు సులభసాధ్యమేకాని ఇంటనున్న శత్రువులకు మనము ముందు భయపడవలెను. బేతనదంపతులు జైనమతమునఁ దీవ్రాభినివేశముగలవారు. అందు మైలమకున్న జైనమతావేశము మఱింత హెచ్చు, మైలమ తల్లిదండ్రు లిరువురు జైనమతోన్మాదులు. వారిబిడ్డయు నంతటిదే యనుకొనవలయును. బేతనదంపతులు మనకు కీడుఁదలఁచి శత్రువులకు మార్గముచేయుచున్నారు. జైనయతులు తమ కార్య సఫలతకు వీరి యాలంబనమును బడసియున్నారు. ముందు వీరినేమి చేయవలసియున్నదో నీవాలోచించి చెప్పుము. విన్నావుగదా జినేంద్రస్వామి, బేతనద్వారా మనకార్యము సులభసాధ్యము జేసికొనఁదలఁచియున్నాఁడని! పడవలోనికి నీరెక్కకుండ రంధ్రములు మూసియుంచినపుడుగదా పడవను ముందుకు నడపుటకు యత్నించుట! అనఁగూడదుగాని, రాజా! నీభార్య ముప్పాంబ నిన్ను భీరునిగా మార్చి జైనవీరులకు హానిజరుగకుండఁ గనిపెట్టుచున్నది. నేనెంత చెప్పినను ఆపె పనివలన నీకు ద్రోహము జరుగుచున్నదని తెలియఁజాలవు. ముందు ఆపెను కొంత అదుపునకుఁ దేకతప్పదు. ఇది రాజ్యాంగ విషయము. ఇందు భార్యయని, పుత్రుఁడని సంసారమోహము నకుఁదావులేదు. నీకును నీభార్యకును జైనుల అహింసాతత్వము తలకెక్కినది. హింసయొనర్చుటకు జంకినచో రాజ్యకార్యమునడువదు. ప్రజారక్షణమే రాజకృత్యములకు మూలము. రాజ్యభార నియుక్తులకు నృశంసము, అనృశంసమునను భేదముండదు. ప్రజారక్షణ కారణమున నెట్టి నృశంసాకార్యాచరణమును ధర్మానుష్ఠానమేయగును. ఇది ఆదికవి వాల్మీకి నుడి

పిన సనాతన ధర్మము' అని పలికి ప్రోలరాజు మనసును రాజకీయము లపై నుత్తేజపఱచెను.

జైనాచార్యులను జంపుటకు రాజుమనసు నిశ్చయించుకొనలేక ఊగు లాడినది. జినేంద్రస్వామి తనతండ్రిచేఁ బూజలందినవాఁడుకూడ, తన తండ్రి బేతరాజు జైనమతమును శైవమతమును నాదరించి జినేంద్రస్వామికి రామేశ్వర దీక్షితులవారికిఁగూడ సమానగౌరవమే యొసఁగెను. నేఁటికి తాను మాఱినాఁడు. గురువు చెప్పినదంతయు రాజనీతియే. కాదనుటఎట్లు! శత్రువులంపఱేకమై పయినిఁబడుటకు జైనయతులు జరుపు యత్నము విన్నంత గుండె తటతట కొట్టుకొనుచున్నది. జైనధ్వంసమునఁగాని శత్రు ధ్వంసము గానేరదని స్పష్టముగఁ దోచినది. అయినను ప్రాణహింసకాతఁ డిష్టపడలేదు. గురువువంక దృష్టిఁబరపి "గురుదేవా! నాకు మీమాటలు కర్తవ్యమును బోధించినవి. బేతనపెగ్గడ మావంశ పారంపర్యముగ వచ్చుచున్న మంత్రి. ఆతని తండ్రియగు వైజదండనాథుని సంధాన చాతుర్యముననే మాతండ్రి త్రిభువనమల్లుని శరణమంటఁగలిగి బ్రతుకుఁ గాంచినాఁడు. ఆకృతజ్ఞతాభావము నరనరమున వ్యాపించి బేతనదంపతుల కొక కీడుఁదలపెట్ట దలఁపుగొనఁజాలకున్నాను. బేతన దంపతులు మన రాజ్యవృద్ధి కడ్డుదగులుదురనుట నేను శంకింపలేకున్నాను. జైనయతుల హింసించుపనికి నేనొప్పుకొనలేను, కాని తప్పనిసరి పరిస్థితులలో మీమాటఁ గాదనను. ఇఁక ముప్పాంబనుగూర్చి మీరుపడుచున్న యభిప్రాయము సత్యమేయైనను ఆమె నన్ను కార్య విముఖునెన్నటికినిఁ జేయఁజాలదనుట నిశ్చయము. మీరనుమానపడవలదు". అని సవినయముగఁ బలికెను.

దీక్షితులవారు ప్రోలరాజుచే బేతనదంపతులను, జైనయతులను, చంపించుట కొప్పించుట శక్యముగాదని తలఁచి "రాజా! బేతన దంపతులఁ జంప నిష్టపడవేని కడలాలయ విగ్రహమును మాయము సేసిన నేరమాపా దించి వారిల్లువెడలకుండ గృహనిర్బంధమునైన విధింపవలెను. వారి ప్రతి

చర్యను రహస్యభటవర్గమును నియోగించి కనిపెట్టుచుండవలెను. ఇఁక జైనయతులను వధించుట నీ యిచ్చవొప్పున తప్పనిసరి పరిస్థితిలోనే కావింతము. వారినిఁగూడఁబట్టి కారాగృహములనుంతము. ముప్పాంబ మెత్తదనముఁజూచి మైలాంబ ఆపెకు అహింసా సిద్ధాంతము నూరిపోసి నిన్ను కార్యవిముఖునిఁగావింప యత్నించుచున్నది. ఇఁక వారికలయికను కట్టింపనగును. అనఁగూడదుకాని శత్రుధ్వంసము పూర్తియగునంతవరకు రాజ్ఞికి నీవు దర్శనమొసంగుటయే కట్టిపెట్టవలెను. శత్రువిధ్వంస దీక్షలోనున్నపుడు మనసును క్రుంగదీయుమాట చెవిని బడనే కూడదు. లవలేశమైన కార్యోత్సాహము తుదివరకుఁ దగ్గకూడదు. ఇందుకు ముప్పాంబ దర్శననిరోధమవసరమే యగు''నని యొకింత తీక్ష్ణముగఁబలికెను. ప్రోలుఁడు ముప్పాంబవలన దన దీక్షకెట్టి యవరోధము రాదని గురునకుఁదిరిగి చెప్పదలఁచెనుకాని తాను భార్యామోహముననే యట్లు పలుకుచున్నట్లు గురుఁడు తప్పక భావింపఁగలఁడని యేమియు నెదురుసెప్పక 'అట్లే గుర్వాజ్ఞ పాలింతు' నని బాససేసెను.

గురుఁడు శిష్యుని ప్రమాణమున కలరెను. పిదప ననంతర కార్యక్రమమును నిర్ణయింప వారు చర్చసేసిరి. సామంతులకు స్నేహితులకు సహాయమర్థించుచు లేఖలు వ్రాసిరి. సైన్యము వృద్ధిచేయుటకు యుద్ధసన్నద్ధమై యుండుటకుఁ దగు సన్నాహముల నొనర్ప నిశ్చయించిరి.

* ఏకశిలపైని శంఖుస్థాపన మొనర్చినపిమ్మట ఓరుగల్లు పురనిర్మాణము సత్వరముగ జరుగకుండ యుద్ధసన్నాహ కార్యములవలన మందగొడిగ సాగిపోవలసి వచ్చుచున్నదేయని గురుశిష్యులిరువురును సమానముగ బాధపడిరి. స్వయంభూదేవాలయమైన పూర్తియైనందుకే వారు తృప్తిపడిరి. ఓరుగల్లు పురము నిర్మించి దానిచుట్టు సప్తఋషులఁ

* ఏకశిలానగరము (ఒరుగల్లు) పైనిఁగట్టబడిన నగరముకాన ఏకశిలాగరము, ఒరుగల్లు నని పేర్లువచ్చెనని కొందరందురు.

దలపించుచు సప్తప్రాకారములఁదీర్చి అనుమకొండనుండి రాజధాని నోరు గంటికి మార్చినచో శత్రుదుర్భేద్యమై జయమెప్పుడును తమకు వశపడి యుండునని యాశించిన ప్రోలరాజున కింత త్వరలో యుద్ధము సిద్ధమగుట చికాకు పుట్టించెను.

పిమ్మట గురుశిష్యులిట్లు ప్రసంగించిరి.

దీక్షి:—— స్వయంభూదేవుని లింగముపై శత్రువులు కన్నువైచిన సంగతి శివదేవయ్య చెప్పినాఁడుగదా! మనము అనుమకొండ రాజధానీ నగరరక్షణముకన్న ముఖ్యముగా స్వయంభూలింగమును సంరక్షించుకొనవలసియున్నది. ఓరుగల్లుకోట నిర్మాణము పూర్తియైయుండిన మనకిపని సులభమైయుండెడిది. ఇప్పుడు అనుమకొండ దుర్గమును, స్వయంభూదేవుని ఆలయమును రెండు రెండు కన్నులతో సమానముగా సైన్యమునిలిపి కాచుకొనవలసియున్నది. స్వయంభూదేవునాలయమును సంరక్షించుటకు బహువిశ్వాస పాత్రులు కావలెను. గంగాధరామాత్యుల నీపనికి నుపయోగింపనెంతుమా! అతఁడు మొదటనుండి మనవాఁడేనా!

ప్రోల:—— గంగాధరామాత్యుఁడు వేంగిదేశమునందలివాఁడు. చెల్లెకి పురవాస్తవ్యుఁడు. నాకాలములోనే యితఁడిటకు వచ్చి యుద్యోగమునఁ గుదురుకొనినాఁడు. విశ్వాసపాత్రుఁడనుటకు సందేహములేదు.

దీక్షి:—— ఏమయినను ఇతరదేశమునుండి క్రొత్తగావచ్చినవానిని మనము స్పర్శవేదిలింగసంరక్షణమువంటి ముఖ్యకార్యమున నియోగించుట మంచిదికాదు.

ప్రోల:—— స్వయంభూదేవుని రక్షణభారము గురుదేవు లంగీకరించిన నేనే స్వయముగా వహింపఁగలను.

దీక్షి:—— నీవు యుద్ధకార్యములు చూచుకొనుటకు పైనుండవలసినదే. ఈ కార్యమునకు మఱియొకరేల! నీ జ్యేష్ఠకుమారుని రుద్రదేవు నిందులకు నియోగింపఁగూడదా!

ప్రోల:— ఆతఁడింకను యౌవన ప్రారంభదశలోనే యున్నవాఁడు. బాలుఁడు ఇంత మహాకార్యనిర్వహణముఁ గావింపఁగలుగునాయని సందేహించుచున్నాను. ఆతనిముఖముఁజూచి యెంతకాలమైనదో! మా సమాగమమునకు మీరెప్పటికప్పుడేదో అభ్యంతరమును దెల్పుచునే వాయిదా వేయుచున్నారుగదా!

దీక్షి:— (నవ్వి) రుద్రదేవుని పరాక్రమమును నీవు శంకించుచున్నావా? పితృప్రేమచే రుద్రదేవుని ఘనతను నీవు గుర్తింపలేకున్నావు. ఆతనిపరాక్రమము అజేయము. కావుననే నేనాతనికి 'ప్రతాప' బిరుదముకూడ నొసంగినాను. నాఁటినుండియే యాతఁడు ప్రతాపరుద్రుడైనాఁడు. ప్రతాపరుద్రుఁడు సర్వవిధముల స్వయంభూలింగ రక్షణమునకుఁ జాలినవాఁడు. నీవుగాని, నీకుమారుఁడుకాని స్వయముగా స్వయంభూదేవుని సంరక్షింపవలసినదే. ఇతరులకు స్పర్శవేదిరహస్యము తెలియఁగూడదుగదా! అంతేకాక రక్షణకార్యమున మీరుచేసిన సేవకు స్వయంభూదేవుఁడు సంతుష్టుఁడై మీకు విజయప్రదుఁడుకాగలఁడు. సందేహింపక ప్రతాపరుద్రదేవు నందులకు నియోగింపుము. అతని జాతకము నేను పరిశీలించిచూచితిని. అతనికి స్వయంభూదేవుని సేవ ఎంతయో అవసరమైయున్నది. ఆసేవ మీ యుభయులకుఁగూడ క్షేమమును సమకూర్పఁగలదు.

ప్రోల:— తమ యాజ్ఞప్రకారమే రుద్రదేవుని నేఁడే స్వయంభూదేవ రక్షణకు నియమించెదను. మీరు విద్యాభ్యాసమని, యుద్ధశిక్షణమని సాకులతో చిరకాలమునుండి రుద్రునకు నాకు సమాగమము కలుగకుండఁజేయుటకుమాత్రము విచారపడుచున్నాను.

దీక్షి:— చింతింపకుము. దిగ్విజయానంతరము స్వయంభూదేవుని సేవ పూర్తిచేసికొన్న రుద్రుని త్వరలోనే కలసికొనఁగలవు. నీ రెండవ కుమారుని మహాదేవుని ప్రతాపుని కంగరక్షకునిగా నియోగిం

పుము. నాకుమారుఁడు అచితేంద్రుఁడుకూడ రుద్రుని ననుసరించి యుండును.

పో్రల:— గురుప్రభూ! రుద్రదేవుఁడే యుద్ధమునెఱుఁగని బాలుఁడను కొనుచుండగా మహాదేవునిఁగూడ యుద్ధకార్యములకు దింపుట యుచితమా! ఆతఁడు పుట్టెడుజబ్బుచేసి బ్రతికినాఁడు!

దీక్షి:— కన్నతండ్రికి తనబిడ్డల ప్రాణములపై నెంతతీపియుండునో నీమాటలఁబట్టి తెలియఁగల్గితిని. పదునారేండ్ల వయస్సు క్షత్రియ వీరునికి యుద్ధోచితమైనది కాకపోదు. స్వయంభూదేవునకువలెనే ప్రతాపుని దేహరక్షణకు అన్యుని నియోగించుట నాకు సమ్మతము కాదు. స్వయంభూదేవుని సంరక్షించుకార్యమున నియుక్తులగు నీబిడ్డలకు ప్రాణభయము రానేరదు. నీవన్యథా తలఁపవలదు.

పో్రల:— గుర్వాజ్ఞ శిరసావహించుచున్నాను.

దీక్షి:— మఱి అనుమకొండరక్షణకు?

పో్రల:— గంగాధరామాత్యుని నియమించుటకు మీరు సందేహింపనక్కర లేదు. ఆతనిప్రవర్తనము కాసుగీటునకు రాఁగలదు. నేను మొదటి నుండి యెఱుగుదును. చనువుమెయి నగరిలోఁ దగుపనులెల్లను బెంపుమెఱసి పరికించుచు నాతఁడు నాకు కుడిభుజమువలె నున్నాఁడు.

దీక్షి:— సరే, అట్లేకావింపుము. ముఖ్యములగు రెండుపనులకుఁ దగు నిర్ణయములు జరిగినవి. ఇఁక సర్వసేనాధిపతిని నియమింపవలసి యున్నది. మహాసామంతుఁడగు మల్లెనాయకుని నియమించిన బాగుండునేమో!

పో్రల:— రేచర్ల వంశజుఁడగు కామచమూపతి యిందుకుఁ దగినవాఁడు. మల్లెనాయకుఁడు నాతోఁగూడనుండి యుద్ధమునఁ దోడ్పడగలఁడు.

నా యాశ్రితులలో గంగాధరుని తర్వాత కాటయచమూపతి కుమారుఁడు కామచమూపతి ముఖ్యవిశ్వాసపాత్రుఁడేకాక యుద్ధరంగమున ప్రళయకాలభైరవునివలె విక్రమించువాఁడు. లోకనాథపదాంభోజ పూజానిర్మలమానసుఁడు. అతనికిసాటి యుద్ధవీరుఁడులేఁడు.

దీక్షి:— బాగున్నది, అట్లే చేయవచ్చును. ముఖ్యకార్యక్రమములన్నిట నిర్ణయములు జరిగినట్లే. ఇఁక సైన్యములను వృద్ధిపరచుట, సమాయత్తపఱచుట, దుర్గము కట్టుదిట్టముగఁ జూచుకొనుట, ఆహారసామగ్రి నిలువఁజేయుట మొదలగు పనులయందు నుద్యోగులు అప్రమత్తులైయుండునటుల నీవు స్వయముగాఁ జూచుకొనవలసి యున్నది.

ప్రోల:— అవన్నియు నేను పైనుండి గమనించుకొందును. శత్రురాజుల రాజ్యమున వీరశైవము వ్యాప్తియగుటకు ఁగు యత్నములు మీరు జరుపవలసియున్నది, శత్రురాజ్యముల ప్రజలు మన మతమునకు వశపడినప్పుడే మనకు శత్రువిజయము సుసాధ్యముగదా!

దీక్షి:— (నవ్వుచు) రాజ్యవిస్తరణమునకు మతవ్యాప్తి యెంతగా ముఖ్యమైనదో యిప్పుడు బాగుగా నీకవగతమైనట్లున్నది. భేష్! ఇఁక నీరాజ్యమునకు విచ్ఛిత్తియుండదు. శత్రురాజ్యముల వీరశైవ వ్యాప్తినిగూర్చి నీవేమియుఁ జూచుకొననక్కరలేదు. అదంతయు నేను నిర్వహింతును. చాళుక్యచూడామణియు మనకు ప్రముఖశత్రువునగు తైలపదేవునియొద్ద మంత్రిగా దండనాథుడుగానున్న కళచురిబిజ్జలుని మన వీరభద్రమాహేశ్వరులఁబంపి వీరశైవమత దీక్షితునిఁ గావించియున్నాను. అతఁడు ఇంకను మనకు పూర్తిగా వశపడినమీదట నాతనిచేతనే తైలపుని రాజ్యచ్యుతినిఁ జేయింపవచ్చును. నేలకొండపల్లిసీమలో ఉదయరాజును వీరశైవమతమునకుఁ ద్రిప్పి గోవిందరాజునకుఁ బ్రక్కలో బల్లెముగానిలిపి యుంచితిని.

ప్రోల:— గురుదేవా! మీప్రయత్నమమోఘము. మిమ్మొకమాట యడుగకతప్పదు. మీరు వీరశైవమతవ్యాప్తికిఁ గావించు యత్నములలో జైనులకు ప్రాణహింస జరుగదని, వేదమునకు బ్రాహ్మణులకు నెట్టి అవమానముగాని, నష్టముగాని జరుగదని నాకు వాగ్దానమీయవలెను. జైనములో నెన్నిలోటులున్నను వారి అహింసా ధర్మము నాకునచ్చి నరనరములఁబట్టిపోయినది. కాన హింసకు నామనస్సొప్పకున్నది. ఇఁక బ్రాహ్మణానుగ్రహమే మావంశమును పూర్వము విచ్ఛిత్తికానున్నప్పుడు కాపాడినది. మా కమ్రరాజగు కాకతిభూపాలుఁడు బ్రాహ్మణశ్రేష్ఠులగు సప్తర్షుల అనుగ్రహము నకై యజ్ఞమును కావించినాఁడు. ఆయజ్ఞములో వశిష్ఠుఁడు వేద బ్రాహ్మణభక్తి కల్గియుండునదిగా మావంశమును శాసించియున్నాఁడు. ద్విజోత్తముఁడగు జమదగ్నిమహర్షులవారి భార్య రేణుకాదేవి మాకులస్థులకు కులదైవము. ఇంతగా నేనాఁటి నుండియో మావంశముతో ముడిఁబెట్టబడియున్న బ్రాహ్మణసంబంధమును నేను దెగగొట్టుకొన్న బ్రతుకుఁదెరువుండునా? వేదములేనిదే ద్విజులేలేరుగదా! కాన వేదబ్రాహ్మణతిరస్కృతిని నేను సహింపఁజాలను. వీరశైవమత వ్యాప్తికొఱకు వేదబ్రాహ్మణావమతి జరిగిన నేను కించిత్తును సహింపఁజాలను. గురుదేవా! ఈనాప్రార్థనము మన్నించి మీరు ఈవిషయమున నన్ననుగ్రహింపకతప్పదు.

దీక్షి:— వత్సా! నీహృదయము నాకవగతమైనది. అవసరమైనపుడు జైన హింస తప్పదుగాని వేదబ్రాహ్మణహింసమాత్రము జరుగదని నీకు వాగ్దానము చేయుచున్నాను. నీ రాజ్యాభివృద్ధినిఁ గోరునట్టి నేను బ్రాహ్మణానుగ్రహ మవసరమని నీ పూర్వవంశకథ తెలిసికూడ నేనందులకువిరుద్ధముగా సంచరింతునని నీవనుమానింపకుము. నీచే నాహ్వానింపఁబడి రాజ్యాభివృద్ధికి అవసరముగా వీరశైవము నాచేఁ

బ్రవేశపెట్టఁబడినది కాని వీరశైవమతాభివృద్ధికై నేను నిన్నాశ్ర యించిరాలేదని ఏల నీవనుకొనవు ?

ప్రోల:—క్షమింపుఁడు, నాహృదయమునఁగల యావేదనను వెల్లడించితిని. కాని మిమ్ము విశ్వసింపనిభావ మిందులేదు. మీకటాక్షము నామీఁద అవ్యాజముగా ప్రసరించుటచేతనే నేను ధన్యుఁడను.

తరువాత ప్రోలరాజు గురుపాదములుముట్టి కన్నులకద్దుకొనెను. దీక్షితులవారు కోఱలపౌర్ణమి సమావేశమునాఁడే జైనాశ్రమమగు పాతాళ గృహము ధ్వంసముగావించుటకు శివదేవయ్యను నియమించెను. ప్రోలరాజు వీరఖడ్గమునొసఁగి శివదేవయ్య కధికారమొసఁగుటతో నాఁటి సమావేశము చాలింపఁబడెను.

పదునైదవ ప్రకరణము.

# జైనయతుల నిర్బంధము.

నాఁడు మార్గశిరపౌర్ణమి. పుచ్చపువ్వువలె వెన్నెలకాయుచున్నను హిడింబాశ్రమారణ్యమున చెట్లు దట్టముగా వ్యాపించియుండుటచే నొక్క జ్యోత్స్నాకిరణముకూడ క్రిందఁబడుటలేదు. అరణ్యములోనికిఁ బ్రవేశించినకొలఁది కాఱుచీఁకటితప్ప వెలుఁగనుమాటలేదు.

నడురేయి దాటినపిమ్మట సన్యాసివేషములనున్న జైనమహావీరు లొక్కొక్కరుగ పాతాళగృహముఁ జేరుకొనిరి. ద్వారముననున్న వాని చెవిలో "జయ పారశ్వనాధభగవన్" అని యుచ్చరించుటతోడనే సోపాన మార్గమునకుఁ బ్రవేశానుమతి యీయఁబడుచుండెను. జైనమహావీరులు, వారి యనుచరులు పెక్కురు లోనఁబ్రవేశించిరి. నాఁడు జినేంద్రస్వామి ప్రోలునిపై శత్రువులెట్లొక్కుమ్మడి దాడిసలుపవలెనో పథకములను నిర్ణయించి చెప్పుటకు నియమింపఁబడినరోజు. ప్రోలుని సజీవముగఁబట్టి పాతాళగృహమును జేర్చుటకును, రామేశ్వరదీక్షితులను చిత్రవధచేయుటకును జినేంద్రస్వామి తలపెట్టెను. అందులకు వలయు వ్యూహము లాతఁడు నిర్ణయించుకొనెను. ఒకేసారి శత్రువులు అందఱునుగలిసి అనుమకొండను ముట్టడించినఁగాని తనపని సాధ్యముకానేరదని యాతఁడు తలంచి యుండెను. ప్రోలుని శత్రువుల నాశ్రయముపొందియున్న జైనమహావీరులను త్రిదండిసన్యాసివేషములతో నెవ్వరికి ననుమానము కలుగకుండ పాతాళగృహమునకు రప్పించుకొనుచు సలహాలనొసంగుచు జినేంద్రుఁడు యుద్ధసన్నాహముల పూర్తిసేయించెను.

నాఁడు జినేంద్రస్వామి తన కడపటి పథకము చెప్పఁగలడని యెచ్చటనున్న జైనమహావీరులు పాతాళగృహమును జేరుకొనిరి. యుద్ధానంతరమునఁదప్ప తిరిగి సమావేశములు జరుగవుకాన యుద్ధకారణము

నొకరినొకరు తిరిగి చూచుకొను నవకాశముండునో లేదో యని పరస్పరావ లోకనమునకైకూడ పెక్కురు జైనమతప్రముఖులు ప్రత్యేకాహ్వానముపై నాఁటి సమావేశమునకు రప్పింపఁబడిరి. అందఱును లోనఁ బ్రవేశించిరి.

చిట్టచివర అనుమకొండనగరమునుండి వచ్చిన యొకభటుఁడు పంచకల్యాణిగుఱ్ఱమునెక్కి చేతికాగడాతో చెట్లక్రింద చీకట్లను ఛేదించు కొనుచు వేగముగ నచ్చటకుఁ జేరుకొని లోనికిఁబోవ సిద్ధపడెను. సాంకేతిక పదమును దెలుపకపోవుటచే ద్వారపాలకుఁ డాతని నడ్డగించెను.

“ఎవరునీవు? లోనఁబ్రవేశించుటకు నీకర్హతలేదు. పో”మ్మని ద్వార పాలకుఁడు ఖండితముగఁజెప్పి గెంటివేసెను. ‘నన్ను బేతనప్రెగ్గడలవారు పంపినారు. వా రధిరోహించు నీయశ్వమును నాకిచ్చి జినేంద్రస్వామికి రహస్యలేఖను పంపించినారు. అతిత్వరగ దీనిని వారికందింపవలసి యున్నది’ అని భటుడు తన అంగరఖాలోపల దాచిన లేఖనుదీసిచూపెను. ‘నీవేమిచెప్పినను లోనఁబ్రవేశింప వీలులేదు. నీవిందుఁ బ్రవేశింపఁదగినవాఁడ వగుచో నీకును సాంకేతికపద మందఁజేయబడియే యుండును. నీవేదో కపటనాటకమాడ వచ్చితివనిపించుచున్నది. నీయాటలు సాగిరా’వని ద్వారస్థుడు గద్దించిపలికెను. కొంత ఘర్షణము జరిగినపిమ్మట ఆశ్వికుఁడు చేయునదిలేక ‘నేను లోనికిపోనక్కరలేదు. ఈయుత్తరము నీవే కొనిపోయి జైనస్వామి కందింపుము, పనిమాత్రము త్వరితముగ జరుగవలెను అలసింపకుము’ అని బ్రతిమాలెను. అంత ద్వారపాలకుఁడు ‘నేను లోనఁ బ్రవేశించుటతో నీవును బ్రవేశింపకుండ నీ కాలుసేతులు బంధించి యీ చెట్టునకుఁ గట్టియుంతును. జైనస్వామి నీయుత్తరమంగీకరించెనా నీకుఁ బ్రవేశము తప్పక లభింపఁగలదు. లేదా నీకు శిరశ్ఛేదమేగతి’ అని పలికి యాశ్వికుని యంగీకారముతో వాని కాలుసేతులు త్రాటితో గట్టిగబంధించి చెట్టుమొదలునకుఁ గట్టివేసి యుత్తరముఁదీసికొని సోపానమార్గముపట్టి లోనికిఁబోయెను.

ద్వారపాలకుఁడు లోనికిఁబోవుటతడవుగ గట్టిగ చెట్టుపైనుండి శంఖధ్వానము వెలువడెను. ఉత్తరక్షణముననే కవచములుధరించిన ఖడ్గపాణులగు వీరశైవసైనికులు ధ్వని వెంబడి నలుమూలలనుండి వృక్షము వద్దకుఁ జేరుకొనిరి. శంఖహస్తుఁడై బాలశైవవీరుఁ డొకడు చెట్టుదిగివచ్చి చెట్టునకుఁగట్టఁబడిన భటుని, అతఁడెక్కివచ్చిన పంచకల్యాణి గుఱ్ఱమును బరిశీలించెను. గుఱ్ఱమునుబట్టి యాభటుఁడు జేతనప్రగ్గడ అనుచరుఁడే యని నిశ్చయించి మఱుమాటాడక చేతిలోని ఖడ్గమెత్తి 'హరహర' అని యుచ్చరించి కంఠము తెగవ్రేసెను.

ఇంతలో పాతాళగృహమునుండి మెట్లెక్కి ద్వారపాలకుఁడు పైకి వచ్చుచున్న కాలియడుగులచప్పుడు వినఁబడెను. బాలవీరుఁడది గుర్తించి ఆఖరుమెట్టెక్కి వాఁడు పైకివచ్చినంత 'హరహర' అను ధ్వనితో వాని శిరమునుగూడఁ దెగవేసెను.

ఆ బాలవీరుఁడు శివదేవయ్యయే యని పాఠకులకు వేఱుగజెప్పఁ బనిలేదు. శివదేవయ్య నాఁటి సాయంకాలముననే ససైన్యముగ హిడింబాశ్రమారణ్యముఁజేరి జైన పాతాళగృహ సమీపారణ్యముఁ జేరుకొనెను. జైనవీరులందఱును గుహలోఁ జేరినపిమ్మటనే గుహనుధ్వంసము చేయఁ దలంచి సైనికులనందఱను పరిసరవృక్షముల నెక్కించి పడుకొమ్మల చాటున నేరికిఁ దెలియకుండఁజేసి దాను గుహాద్వారమువద్దనున్న వట వృక్షమునెక్కెను. తాను శంఖమూదినంత ధ్వనివచ్చిన చాయకుఁ జేరుకొనునదిగ సైనికుల కాజ్ఞపెట్టెను.

రెండుతలలును తెగిపడినపిమ్మట శైవసైనికులు గుహలోఁ బ్రవేశించుట కుత్సహించిరి, శివదేవయ్య ఆలోచించినాఁడు గుహలోని కొక్కొక్కరుమాత్రమే ప్రవేశింపఁదగు సన్నని దారియున్నది. అంద ఱొక్కుమ్మడి గుహసేర నెట్లును వీలులేదు. దిగినప్రతివానిని గుహలోని వారు మట్టువెట్టుచుండినఁ జేయదగినదేమి! అందుచే గుహాప్రవేశము

నిషేధించినాఁడు. సమావేశానంతరము బైటకువచ్చునపుడు వారు ద్వార సీమఁజేరినంత ఒక్కొక్కరినే తలతీసిన బాగుండునని యాతనికిఁదోచినది. కాని ప్రోలరాజు ఇందఱిజైనుల ప్రాణములు హరించిన కటకటబడును. దీక్షితులవారును రాజున కిష్టముకానిపనిని సహింపరు. తప్పనిసరియైనపుడే ప్రాణహింస జేయుటకు తనచే గురువు ప్రమాణముచేయించి యొప్పించు కొనినాఁడు. కాన నందఱిని జంపుటెట్లు? బైటకుఁవచ్చిన ప్రతియొకనిని చేతులు కాళ్ళు కట్టివేసి కొనిపోవుటకు నిశ్చయించినాఁడు. తలఁ దీయుటవలె కట్టివేయుట నిమిషములో జరుగునదికాదు. కట్టివేయునపుడు వారు పెనఁగులాడి హాహాకారములు చేసినచోఁ లోపలివారికిఁ దెలిసి వేఱొకత్రోవను బారిపోఁగలరు. అప్పుడు కార్యముచెడును. నైపుణ్యమునఁ గార్యముదీర్ప నిశ్చయించినాఁడు. బహుజాగరూకతతో పైకి నిర్గమించిన ప్రతివానిని నైదుగురు కాసియుండి ఒకరు నోరుమూసి గుడ్డలుకుక్కుటకు, నిరువురు కాలుసేతులుపట్టి బంధించుటకు, బంధించిన ప్రతియొక్కని నిరువురు వెంటనే అనుమకొండకు మోసికొనిపోవుటకు సైనికులకు కట్టడి చేసినాఁడు. ఎవ్వనిని కిక్కురుమనకుండునట్లుగా నాజ్ఞాపించి శివదేవయ్య బిలద్వారముఖమున నిలిచినాఁడు.

జినేంద్రస్వామి జైనవీరుల నుద్దేశించి ప్రోలునిపై క్రోధాగ్ని రగుల్కొలుప తీవ్రముగ నుపన్యసించుచుండగా ద్వారపాలునిచే బేతనప్రగ్గడ పంపిన యుత్తరమాతనికందింపఁబడినది. దానిని చదువుకొనినవెంటనే స్వామిముఖము వివర్ణమైనది. చేతులు కంపించినవి. ముచ్చెమటలు పోసినవి. కొంచెము తాళుకొని జైనవీరులనుద్దేశించి జినేంద్రుఁడు తడఁ బడుచు నిట్లుపలికెను. "ప్రోలునకు మన రహస్యము తెలిసిపోయినది. ఇదిగో బేతన యుత్తమును బంపినాఁడు, ఈ పాతాళగృహము నీరాత్రియె మట్టువెట్టుటకు ప్రోలుఁడు సైన్యమునంపినాఁడట. బేతనకీవిషయము మైలాంబ సంగ్రహించుకొని వచ్చి చెప్పెనఁట. మనలను వెంటనే పాతాళ

గృహము దాటిపొమ్మని వ్రాసినాఁడు. ఇంకను మనయదృష్టము బాగున్నది. సైన్యము గృహమును చేరుకొనలేదనిపించుచున్నది. ఇప్పుడేకదా ద్వారపాలకుఁ డుత్తరము తెచ్చియున్నాఁడు. ఇఁక నిమిషములమీఁద మీరు నిర్గమించి తలఁదాచుకొనవలసియున్నది. ఆలసించిన సంఘ మరణమేగతి. బ్రతికియుండిన మఱియొకచోట మనమందఱము కలిసి కొనుటకు మీకు వార్తలందింపఁగలను. మీరు సురక్షితముగ మీరాజులఁ జేరికొనుఁడు, పొండు. వేగిరము పొండు. తలదాచుకొండు'' అని హెచ్చరించెను.

జినేంద్రునిమాటలు విన్న జైనవీరులకు కచ్చులూడిపోయినవి. నోట మాటలేదు. ఒకరిసంగతి యొకరు పట్టించుకొనలేదు. ఎవరిప్రాణము వారికే తీపియగుటచే అహమహమికతో త్రోసికొనుచు సోపానమార్గముఁ బ్రవేశించిరి. గుహకు రెండవమార్గము లేకపోవుటచే నదేమార్గమున నందఱు నొకరినొకరు గెంటుకొనుచుఁబోయిరి. వెలుపల బాలశివదేవయ్య బహు అప్రమత్తతతోఁ బని జరిపించుచుండెను. ద్వారము దాటివచ్చిన ప్రతి వానిని ఒకఁడు నోరుమూయుట, వేఱొకడు నోట గుడ్డలుకుక్కుట, ఇరువురు శివభటులు త్రాళ్ళతో మూటగ చేతులు కాళ్ళు కలిపికట్టుట, ముడి నడుమ కఱ్ఱఁజొనిపి చెఱియొకప్రక్కను భుజములుకాసి యిరువురు త్వరిత గతి ననుమకొండమార్గమువట్టుట యన్నిపనులు చకచక లిప్తలో జరిగి పోవుచుండెను.

లోనున్నవారికి. పైనిజరుగుచున్న దావంతయుఁ దెలియదు. తెల్లవారకుండ నందఱు జైనవీరులును బంధింపఁబడి యనుమకొండకుఁ జేర్పబడిరి. శివదేవయ్య జినేంద్రస్వామికిమాత్రము బంధనముసేయక నగౌరవమునఁ బిలుచుకొని పెక్కురు శివభటుల నిరువైపుల కాపలాయుంచి పల్లకినెక్కించి పంపెను. చిట్టచివర పాతాళగృహములోపలికిఁ బ్రవేశించి యందలి ఆయుధసామగ్రిని, వస్తుసామగ్రిని అనుమకొండకుఁ జేర్చుటకు

సైనికులకాజ్ఞాపించి శివదేవయ్య పంచకల్యాణి నారోహించి అనుమ కొండఁ జేరుకొనెను,

ప్రోలరాజు అంతటి మహత్తరకార్యము హింస జరుపకుండ సాధించి నందులకు మిగుల సంతసించి శివదేవయ్యను ప్రశంసించెను. పట్టువడిన జైనులనుపరిశీలించి ప్రముఖులగువారికి వేఱుగను సామాన్యులకు వేఱుగను చెఱసాలలు నిశ్చయించి వారివారి కర్హములగు భోజనాదులను సగౌరవ ముగ గనిపెట్టియొసంగునదిగఁ బ్రోలరాజు సేవకులకాజ్ఞలిడెను. జినేంద్ర స్వామినిమాత్రము ప్రత్యేకసౌధమున నిర్బంధించి యందఱికన్న బహూప చారములు జరిపించుటకు గట్టడిసేసెను.

పదునారవ ప్రకరణము.

# జైత్రయాత్రా నిర్ణయము.

అనుమకొండనగరమున జైనయతుల నిర్బంధముతోఁ బ్రజలలో నూతనోత్సాహము గలిగినది. వీరశైవమునం దాదరాభిమానము లధికము గాఁజొచ్చినవి. ఎచటఁజూచినను బాలశివదేవయ్య చాకచక్యమును బ్రశంసించువారే. రామేశ్వరదీక్షితులను పొగడువారే. ప్రోలరాజును స్తుతించువారే. వీరశైవమతావేశఝురి ప్రతిపౌరునిలోను గట్లుగోసి పొంగులు వారినది. 'హరహరమహాదేవ, శంభోశంకర' అను నినాదములు మిన్నుముట్టినవి. 'శంభో, త్రిణయన, చంద్రచూడ, హర, శంకర, గిరిజా కాంతా। అంభోజాసన ముఖ్యదేవతావందితచరణోపాంతా' అను శైవ గీతముల నాబాలగోపాలము నివమెత్తియాడుచుఁ బాడిరి.

జైనులను నిర్బంధించి పదినెలలు గడిచిన పిమ్మట నొకనాఁడు మంత్రశాలలో జైత్రయాత్రకు సన్నాహములకై సమాలోచనము జరుపుటకు దండనాథులు, సామంతులు, ప్రముఖులు పెక్కురు సమావేశమైరి. శివదేవయ్య అశ్వారూఢుఁడై సమావేశమునకేగునపుడు పౌరులు కుసుమాక్షతలు జల్లిరి. ముఖ్యులందరు మంత్రశాలఁ జేరుకొనిన పిదప రామేశ్వరదీక్షితులవారితోఁగూడి ప్రోలరాజు బంగారుశకటము నధిరోహించి మంత్రశాలకుఁ జేరెను. దారిపొడవున నిరువైపుల బారులుదీర్చి పురుషులు, స్త్రీలు, బాలురు 'శివసంకల్పో భవ, శివసంకల్పో భవ' అను ఆశీర్వాదములతో తెల్లని కుసుమములు లాజలు రాజగురువులపైఁజల్లి హర్షోత్సాహములు వెలిఁబుచ్చిరి.

అమాత్య దండనాథ సామంత పౌరప్రముఖులు నిలఁబడి యొనర్చిన యభివాదనములనందుకొని, శివదేవుని మందహాసమున గౌరవించి

రాజగురువు లున్నతాసనముల నలంకరించిరి. పిమ్మట నందఱును గూర్చుండిరి.

పిమ్మట దీక్షితులవారు 'శివదేవయ్యా! వివిధశత్రురాజుల దేశముల దిరిగి నీవీమధ్య గ్రహించుకొనివచ్చిన విషయములను సభ్యులకు, ప్రభువునకుఁ దెలుపుము' అని యాజ్ఞయిడిరి. అంత శివదేవయ్యలేచి సభ్యులకు ప్రభువునకు నమస్కరించి రాజు ప్రక్కమొగంబై యిట్లుపలికెను. "అవధరింపుఁడు, నేను మనపైఁ గత్తికట్టిన శత్రురాజుల దేశముల పెక్కింటిని పదినెలలు మారువేషములఁ దిరిగి వారిహృదయములఁ గలదెల్లయు నరసి వచ్చితిని. కోఁటలపౌర్ణమి సమావేశమునకుఁబోయి జినేంద్రస్వామియొద్ద నుండి సమష్టియుద్ధమునకు పథకములు కొనివత్తుమని వెళ్ళిన వృషభనాథ మహావీరాది జైనయతులు ఎన్నాళ్ళకును దిరిగిరాకుండుటచే తైలపదేవాదులు నిరుత్సాహపడి యేమియు తోచక యున్నారు. వారికేమిచేయుటకు నిపుడు దారియగుపడుటలేదు. అపరిమితముగఁ బ్రోగుచేసిన సైన్యము నూరకే కూర్చుండఁబెట్టి మేపుటకు దినదినము నగు వ్యయము వారికి భరింపరానిదిగానున్నది సంపాదించిన ఆహారపదార్థములు యుద్ధము లేకుండగనే తఱిగిపోవుచుండుటకు వారు విచారపడుచున్నారు. సర్వము జైనయతుల మాటమీఁద నడచిపోవుచుండుటచే నిపుడు వారులేకుండ నేమి సేయవలసినది కర్తవ్యమెవరికి గోచరింపక తలపట్టుకొని కూర్చుండియున్నారు. ఏవో ఎప్పుడో జినేంద్రస్వామినుండి పథకములు చేరుననియు నాపథకములననుసరించి ప్రోలుని జయించుట చిటికెలో సాధ్యపడు ననియు నమ్మఁబలికిన జైనయతుల మాటలచే ధైర్యోత్సాహములనొంది యున్న రాజులలో నిపుడు స్వతంత్రాలోచనాశక్తి నశించిపోయినది, పూర్వ ధైర్యోత్సాహములు వారిలో లుప్తములైనవి.

రాజులు ఎవరితిన్న వారు తామే ఘనులమనుకొనుచున్నారు. ఒకరితో నొకరు తామై సంప్రతించుకొనుట, ఒకరు చెప్పినట్లు మిగిలినవారు

వినుట వారు న్యూనతగా భావించుచున్నారు. జైనయతుల పథకములకు లొంగి యందఱు సమష్టిగా యుద్ధముసేయ నిష్టపడిరేకాని యారాజుల హృదయములలో నొకరిపైనొకరికి విశ్వాస మణుమాత్రమునులేదు. ఇనుము బంగారు చేసికొనుటకై స్వయంభూలింగమును తానే వశపరచుకొనవలెనని ఎవనికివాఁడే యుబలాటపడుచున్నాఁడు. శైవమతవ్యాప్తిని నిరోధించుటే అందరికి లక్ష్యమైనచోఁ గలియక సాధ్యమగునేమో ! జైనమతాభిరతి జైన యతులకొఱకుఁ గొంత ప్రకటించినను లోపల నెవరికిఁ దీవ్రముగలేదు. జైనయతులు తిరిగిరాకుండుటచే నున్న లవలేశము జైనమతాభిమానముఁగూడ నిపుడువారిలో లోపించినది. వారినందఱను గూడఁగట్టు నేకైకలక్ష్యము వారిలోనుండి జారిపోవుటచే పొత్తు జతపడక మనశత్రువు లెవరికివారేయై పోయిరి ఇప్పుడు మనమాశత్రువులపై నెత్తిపడినచో నొక్కొక్కనినే విడివి డిగా తేలికగా జయింపఁగలము. కాన త్వరలోనే జైత్రయాత్రను నిర్ణయించుట యుత్తమముగా నాకుఁదోచుచున్నది''. అని సభ్యులవంక జూచి మందహాసముచేసి కూర్చుండెను. సభ్యులందరు జైత్రయాత్ర స్థిరపడునని యుత్సాహపడిరి. రాజు దీక్షితులువారిపై దృష్టిఁబఱపి 'శివదేవయ్య యూహకేమందురు?' అని ప్రశ్నించెను. దీక్షితులవారు కొంచెముసేపు కనులుమూసి ధ్యానముసలిపి పిమ్మట నిట్లు పలికిరి. 'శివదేవయ్య గ్రహించినదంతయు సత్యము. కాని నాకేలనో యుద్ధమునకింకను కొంతకాలమాగియుండుట మంచిఎనిపించు చున్నది. శత్రురాజ్యముల నింకను వీరశైవమతము నాలుగంచులు ముట్టలేదు. ఇన్నాళ్ళు శత్రురాజులు జైనతంత్రవశులగుటచే శైవమత మాయారాజ్యముల స్వేచ్ఛగా జరింపలేకున్నది. ఇప్పుడు జైన యతులు నిర్బంధములోనుండుటచే రాజుల హెచ్చరించువారు లేరు. కాన వారిరాజ్యములో మన మతవ్యాప్తికిది యదను. ఏకీకరణము కుదురనప్పుడు శత్రువు లెన్నాళ్ళకును మనపైనిదఁ యెత్తలేరుగదా? మనమిప్పుడే యుద్ధము సేయకపోయిన వచ్చిన నష్టమేమి? ఇప్పుడిప్పుడే యచటిప్రజలు శైవ మతాభిమానులగుచున్నారు. మతము ముందుఁ బ్రజలకందించి ఆపైని

రాజును జయించుటశ్రేయము. జయము వచ్చిన నేమగును ప్రజలు వశపడ నప్పుడు? ప్రజావశీకరణమే జయముకాని శత్రువునోడించుట జయమే కాదు. తొల్లి గ్రీసుదేశమునుండి వచ్చి యవనులు మనదేశమును జయించికూడ నిలుపుకొనలేకపోయినారు. వారు సైన్యబలముతో, ఆయుధబలముతో మన హైందవదేశమున పెక్కుప్రాంతములు జయించినారు కాని ప్రజల మన స్సులను మాత్రము యవనులు జయింపలేదు. కనుకనే ఆర్యచాణక్యులవారు ప్రజామనస్సును హైందవమతమునకే కట్టువడియుండుట కప్పుడు ప్రబల ప్రయత్నములు జరిపించి క్రమముగా యవన ప్రతినిధులకుఁ బ్రజలెన్నటి కిని వశపడకుండఁ జేసినారు. ప్రజలు వశపడకపోవుటచే యవనచక్రవర్తి రాజ్యము నిలువలేకపోయినది. తిరిగి హిందూరాజ్యములు నెలకొనెనవి. కౌటలీయార్థశాస్త్రము ప్రజాభిమతమున కింతింత యనరాని ప్రాధాన్యమిచ్చి నది. కాన శత్రురాజ్యములలో మనమతము ప్రజాభిమతమగునట్లుచేయుట కింకను కొంత వ్యవధి యుండుటయే అవసరమని నాకుఁ దోచుచున్నది. అపైని మీయిష్టము" అని సభ్యులవైపు దృశించి పలికెను.

రామేశ్వరదీక్షితులవారు శివదేవయ్యను సమర్థించి జైత్రయాత్రను ప్రోత్సహింతురనుకొనిన సభ్యులకు ఆమాటలు రుచింపలేదు, వారి వదన ముల నిరుత్సాహము వ్యాపించినది, ఒకరినొకరు చూచుకొని పెదవులు విఱుచుకొనిరి. ప్రోలరాజు సభ్యుల ముఖకళవళికలు గ్రహించినాఁడు. దీక్షితులవారి మాటలు తనకును నచ్చలేదు శివదేవయ్య కసలే నచ్చనట్లు ముఖచిహ్నములరసి తెలిసికొనినాఁడు, గురువుమాట కాదనవలసి వచ్చు చున్నదని మనసున నొచ్చుకొని బైటకుఁ దన వ్యతిరేకాభిప్రాయమును బ్రక టించుటకు సందేహపడి యూరకున్నాఁడు. రాజేమిచెప్పునాయని సభా సదులెల్లరు చెవులు రిక్కించుకొనియుండిరి. రాజు పలుకకుండుటచే దీక్షి తులు రాజువంకఁజూచి 'ఏమి! నీయభిప్రాయము దెలుపుటకు ఆలసింతు వేల! స్వేచ్ఛగాఁ దెలుపవలసినదే. రాజ్యాంగవిషయమున వినయ ప్రక టన మవసరముకాదు' అని హెచ్చరించెను,

అంతట ప్రోలరాజు గురువున కభివాదనమొనర్చి సభ్యులకు మందహాసమున గౌరవము నెఱపి యిట్లుపలికెను. 'గురుదేవులు సెలవిచ్చినది కాదనఁజాలను. కాని నాకు జైత్రయాత్ర కిదే యదనని తోచుచున్నది. ప్రజామనస్సు మన శైవమతమునకు నెచ్చటను విరుద్ధముగాలేదు. జైన యతుల ప్రచారమున్నన్నాళ్ళు శైవమువ్యాపించుట కవరోధమున్నయుండ వచ్చును. నేఁడు ప్రముఖజైన యతులందఱు మన నిర్బంధములో నుండ నిఁక జైనము తలయెత్తఁజాలదు. వీరి నిర్బంధము తొలగించినంత తిరిగి జైనము తలయెత్తుకొనును. ఎంతకాలమని వీరిని నిర్బంధములో నుంతుము! వీరిని జంపించుటకు నామనమిష్టపడదు ఇప్పుడేమనము శత్రువులజయించి రాజ్యములు స్వాధీనముచేసికొని మనమతము ప్రజలలో ప్రవేశపెట్టియా పిదప జైనయతుల విడిచినను మన మతవ్యాప్తికి వారడ్డుతగులలేరు. మన రాజ్యమున ప్రజలలో నన్యమతము వ్యాప్తికి వచ్చుట యసంభవము.

శత్రురాజులిపుడు నిరుత్సాహమున నున్నారని, ఆహారసమృద్ధి వారికిలేదని విన్నాముకదా! ఈయదనున వారిని సులభముగానే జయింపఁ గలము. మఱికొంత కాలము వేచియున్న ఇతరప్రదేశములనుండి క్రొత్తగా జైనయతులుచేరి తిరిగి రాజుల సమీకరించి యత్నములు సలిపినచో మనకు గోటితోఁదీరునది గొడ్డంటఁ దీర్పవలసివచ్చును. మనము సైన్యములను యుద్ధమున కాయత్తపఱచియుంచినాము. వారిలోనిపుడున్న యుత్సాహము మఱొకప్పుడు రాఁజాలదు. జైనయతుల నిర్బంధముతోఁ బ్రజలెల్లరు రాజ్యాభివృద్ధిఁ గాంక్షించుచున్నారు. మతాభివృద్ధి జరిగినపిమ్మట రాజ్యములు సులభముగా స్వాధీనములగుననుట రాజ్యాంగ మూలసూత్రమేయైనను ఇప్పటి పరిస్థితులలో రాజ్యములు స్వాధీనము చేసికొనిన పిదపనే మతాభివృద్ధి జరుపుకొనుటకడ్డులేదు. అనుభవముతో నాయా కాలపరిస్థితులఁబట్టి రాజ్యాంగసూత్రముల నన్వయించుకొనవలెనే కాని గ్రుడ్డిగా గ్రంథస్థ సూత్రము లన్నికాలములకు నొకేవిధముగా సరిపడునని కొనుట

తగదని నాకు దోచుచున్నది. రాజ్యాంగశాస్త్రపారంగతులగు గురుదేవులతో నేనీవిషయమున నేకీభవింపలేకున్నాను'. అనిపలికెను.

ప్రోలరాజుమాటలు సభ్యుల కర్ణముల కమృతము పోసినట్లయినవి. ప్రతిపదమున నెంతో విజ్ఞత, అనుభవము, స్వతంత్రాలోచనా పటిమ యుట్టిపడినట్లు రాజుపలికెనని సభ్యులు ఆనందోత్సాహములతో "శివ సంకల్పో భవ" అని యఱచిరి. గురుదేవుఁడు శిష్యునిమాటల నంగీకరించునో లేదోయని సందేహపడినను గురుని కాదనఁగలిగిన శిష్యుని ధైర్యమునకు వారు మెచ్చుకొనిరి.

దీక్షితులవారు ప్రజోత్సాహమునరసి లేచి మందహాస సుందర వదనారవిందుఁడై హస్తసంజ్ఞచే సభ్యుల కలకలము వారించెను. గురుఁడేమి పల్కునాయని సభ్యులు నిరీక్షించుచుండిరి. "సెభాష్ కాకతిరాజా! సెభాష్, నీమాటలమృతంపు తేటలు. నీయాలోచన చాల చక్కగనున్నది. రాజ్యతంత్రములందు నీ స్వతంత్రతా పరిజ్ఞానము నాకు మెచ్చుగొల్పినది. తన్ను మించినశిష్యుడు దొరికినపుడు గురునియానందమున కవధియుండదు. నిజముగా నీవు మహాయోధుడవే కాక మహాప్రజ్ఞాశాలివిగూడ. నేఁటి మనపరిస్థితులు రాజ్యాంగసూత్రములు మార్పుఁజేయఁదగియున్నవని నీవు గ్రహించుటచే నీవు రాజ్యతంత్రముల సర్వజ్ఞుఁడవైనావు. ఇఁక నీ యభిమతముప్రకారమే జైత్రయాత్ర సాగింపుము. "శివసంకల్పోభవ" అని పలికి గురువు హస్తమెత్తి దీవించి కూర్చుండెను.

సభ్యుల కరతాళధ్వనులు 'శివసంకల్పో భవ' అను ఉచ్చైర్నాదములతోఁగలిసి మిన్నుముట్టినవి. చివరికందఱి యభిప్రాయ మేకముఖముగకువచ్చుట శుభసూచకముగా భావింపఁబడినది.

తరువాత అశ్వయుజములో విజయదశమినాఁడు జైత్రయాత్రకుఁ దరలుటకు నిర్ణయము జరిగినది. సభ ముగిసినదని తెలిపి యందఱను బంపివైచి ప్రోలరాజు గురునితోఁగూడి దండనాథులతోను, శివదేవునితోను

రహస్య సమాలోచనమును జరిగించెను. సైన్య సన్నాహములఁగూర్చి పథకములు చర్చింపఁబడెను. మహాదేవునితో రుద్రదేవుఁడు ఓరుగల్లులో స్వయంభూదేవుని రక్షణమునకు నియోగింపఁబడెను. గంగాధరామాత్యుఁడు కామచమూపతితోఁగూడి అనుమకొండనగర సంరక్షణము గావింప నియమింపఁబడెను. శివదేవయ్య తోడుగా ప్రోలరాజు శత్రువులపైఁ బడుటకు నిర్ణయింపఁబడెను. అనుయాయులతో శివదేవయ్య ముందుగా మఱొకసారి శత్రుదేశములఁదిరిగి మఱికొన్ని గుట్టుమట్టులు గ్రహించి త్వరలోనే తిరిగి వచ్చుటకు నిశ్చయింపఁబడెను.

పదునేడవ ప్రకరణము.

# జైనయతుల పలాయనము.

మైలాంబా బేతన ప్రెగ్గడలకు గృహము వెడలకుండ నిర్బంధము విధింపఁబడుట రాజ్ఞి ముప్పాంబకుఁ గష్టము కల్గించెను. రాజుతోఁ జెప్పి యొకింత బంధనము సడలింపఁజేయుదమన్న నాపెకు రాజదర్శనమే యగుటలేదు. ఎప్పుడేని నంతఃపురమునకు వచ్చినను రాజు తన్నేదో యనుమానించి పరీక్షింప వచ్చినట్లు లాపెకు బొడగట్టుచున్నదేకాని పూర్వ ప్రేమానురాగములు గనుపట్టుటలేదు. వచ్చి క్షణకాలము కాకుండగనే యేదోకార్య వ్యగ్రతను బ్రకటించి రాజు పోవుచుండుట యాపెకు వింతగఁ గన్పట్టినది.

ఎప్పుడేని మనసు బాగుండనప్పుడాపెకు ప్రియమిత్త్రురాలగు మైలాంబతోడి సంభాషణ మొకింత శాంతిఁగూర్చెడిది. ఇప్పుడు మైలాంబ ఇల్లువెడలుటకే వీలులేదు. రాజు చర్యలవలన రాణి మనశ్శాంతి బొత్తిగాఁ గోల్పడినది. రాజు చర్యలను మార్చుట తనకుఁగానిపని. రామేశ్వరదీక్షితు లాతని గట్టియుంచినారు. రాజ్యవిస్తరణకాంక్ష ప్రబలముగుట రాజు గురువుమాట దాటఁడు. ఈపరిస్థితులలో మైలాంబ తన్నుఁ గలియునట్లు నిర్బంధము సడలింపకున్నచో నిఁక తనకసలే మనసునకు పిచ్చియెత్తిపోవు ననిపించినది. ముప్పాంబ ఆలోచించినది, రాజెచటనుంచెనో వెదకివెదకి కారాగారముల యొక్క తాళపుజెవులగుత్తిని హరించినది. ప్రెగ్గడదంపతులను గావలిగాయు సేవకు నొకనిఁబిలిపించి మైలాంబను ప్రతిదినము రాత్రి కారాగృహము తాళమునుదీసి అంతఃపురమునకుఁ బ్రవేశపెట్టుట కాజ్ఞాపించి తాళపుచెవి వానికొసఁగినది. రాజునకుదెలియకుండ రాణి యాజ్ఞను సేవకుఁడు గూఢముగఁ బాలించెను. మైలాంబతో రాణి రాత్రి యిష్టాగోష్ఠి నుండుచు నొకింత మనోభారముఁ దగ్గించుకొనుచుండెడిది. మైలాంబ

రాణితో సల్లాపమువలనఁ బ్రోలుని యత్నములు దెలిసికొనుట వీలగునని యుత్సాహపడుచుండెడిది.

మైలాంబ రాజ్ఞితో వినోదించుచు నాయాయుసంభాషణలవలన శత్రు రాజు లైక్యపడకుండనే శత్రువులపైనిఁబడ ప్రోలరాజు యుద్ధప్రయత్నములను సలుపుచున్నట్లును, విజయదశమినాఁడు జైత్రయాత్రకు వెడలనున్నట్లును దెలిసికొని మైలాంబ భర్తతో నావిషయములనుదెలిపినది. రాజు జైత్రయాత్రకు వెడలుటకుఁ బూర్వమే జినేంద్రస్వామితోఁగూడ నందఱు జైన యతులను చెఱవిడిపించి ప్రోలుని శత్రువులతో వారు సేరునట్లుసేసినచో తిరిగి శత్రువులందరేకమై ప్రోలుని యాటకట్టింపనగునని చేతన వారి విడుదల కూహాపోహలుసేసెను. తానే నిర్బంధములోనుండినాఁడు. ఇతరుల బంధమునుండి యెట్లుతప్పింపఁగలఁడు! చేతన తనయూహ మైలాంబకుఁదెలిపి యాపెసాయముఁ గోరినాఁడు. మైలాంబ ప్రతిదినము తన్ను వెంటఁబెట్టుకొనిపోవు సేవకుఁడు రాణికి తాళపుఁజెవినిచ్చుచు పుచ్చుకొనుచుండుటయు రాణి ఆతాళపుచెవి నొక గుత్తిలోఁబెట్టుచు దీయుచునుండుటయు జూచినది. అగుత్తి కారాగారములన్నిటికి సంబంధించినదని యాపె గ్రహించి యొకరోజున దానిని మెలకువగా సంగ్రహించి తెచ్చినది.

నాఁటిరాత్రి రాజాంతఃపురమునకుఁ బోవుసమయమున తనవెంట వచ్చు సేవకు నింటికిఁబొమ్మని తానై యంతఃపురమునకుఁ బోవుటకాతని యొప్పించినది. వాఁడును తాను స్వేచ్ఛగఁ దిరుగవచ్చునని యుత్సాహ పడిపోయెను. వాఁడు పోయినపిమ్మట మైలాంబ కావలిగాచువారి కనుగప్పి తాళములఁదీసి కారాగారముల తలుపులు దెఱచి జినేంద్రస్వామితోఁగూడ జైనయతులకెల్లరకు బంధనవిముక్తిఁగల్గించెను. తన్ను వారికెఱిఁగించి ప్రోలుని ప్రయత్నములు తెలిపి త్వరితముగాఁ బాఱిపోవుటకు మైలాంబ వారిని హెచ్చరించెను. వారందరు జంగమమహేశ్వరుల వేషములు ధరించి పోవుటకుమున్నే తాను సిద్ధపఱచియుంచిన విభూతి రుద్రాక్షమాలికలను

వారికందఁజేసి యథాపూర్వముగా మైలాంబ అంతఃపురమునకు వెడలిపోయెను. జినేంద్రస్వామితోసహా యందఱు జైనులును మైలాంబికకు కృతజ్ఞత దెలిపి జంగమవేషములు ధరించి తెల్లవారునప్పటికి సుదూరముఁబోవ బహు వేగముగ నడకసాగించిరి.

అనుమకొండనగరమున కెనిమిదిక్రోశముల దూరమున నొకయడవి దారికిఁజేరువలో నొక కాలాముఖమఠముగలదు. ప్రోలునితండ్రి బేతరాజు కాలముననే అది నిర్మింపఁబడి ప్రోలరాజుచే పోషింపఁబడుచుండెను. అనుమకొండనుండి యేయూరుపోవువారు నాదారినేపోవలెను. అనుమకొండ కేయూరునుండివచ్చువారు నచ్చటికేరావలెను. ఇట్టి కూడలియగుట ననుమకొండకు వచ్చిపోవు బాటసారులకు అన్నపానములు సమర్పించి విశ్రాంతి యొసఁగుటకు బేతరాజు దానిని నిర్మించెను. సత్రాధికారి మిగుల భక్తిశ్రద్ధలు గలవాఁడగుట యాత్రికుల లందఱును చక్కని సదుపాయము లంది యాతని యాదరమునకు తృప్తిపడిపోవుచుందురు. శివలెంక మంచెన యను కవిగ్రామణి కాలాముఖమతాచార్యుఁడై సోమశంభువను పేరు వహించి యీమఠమున నివసించియుండెను.

శివదేవయ్య మారువేషములతో శత్రునగరములుసేరి జాడలరయ నానావిధవేషధారులగు ననుయాయులతో ననుమకొండనుండి బయలుదేఱి వచ్చి యారాత్రి యాధర్మసత్రమున బససేసియుండెను. తెల్లవారుజామున లేచి పయనము సాగించుట కాతఁడు నిశ్చయించుకొనెను.

జంగమహేశ్వర వేషధారులగు జైనయతులు నాఁటిరాత్రి నడిచి తెల్ల వారుజామునకు కాలాముఖమఠమునుజేరిరి. మఠాధికారి యప్పుడే మేల్కొని యా జంగమహేశ్వరులకు మొకరిల్లి వారిని మఱునాఁడుదయము భోజనము సేసి వెళ్ళుటకు వేఁడుకొనెను. వారందులకొప్పకుండిరి. ఒకింతసేదదీర్చు కొని వెంటనేపోవుదుమనిరి. మఠాధికారి మఱింత వినయమున నర్థించు

చుండెను. వారు కాదనుచుండిరి. శివదేవయ్య తనయనుయాయులను లేపి ముందుప్రయాణమున కాయత్తపడుచు వీధిలోనికివచ్చి యా జంగమమహే శ్వరులఁగాంచి భక్తితన్మయుఁడయ్యెను. శివభక్తిపరవశుఁడై యాతఁడు వారికి 'నమశ్శివాయ' యని పాదాభివందనముసేసెను. వారొకరిమొగమొకరు చూచుకొనుచు మూగదీవెనలుజరిపిరి. వీరశైవాచారము ననుసరించి 'నమ శ్శివాయ' యని యెవఁడేని నమస్కరించినంత 'శివాయనమః' అని తిరిగి యుచ్చరించినపిమ్మటనే అతనికాశీస్సు లొసఁగవలెను. ఆ సముదాచారము జరుపకపోవుటతో శివదేవయ్య వారిని సందేహించెను. వారు వేషధారులు కారుగదా యని సంశయించెను. దిగులుదిగులుతో వారు పైకివినఁబడనటు లాశీస్సులు పల్కుట యాతనిసందియమును మఱింత దృఢపఱచినది.

అంత శివదేవయ్య వారిని 'మీరెచ్చటనుండి వచ్చుచున్నా' రని ప్రశ్నించెను. వారిమాటలు తడఁబడినవి. శివదేవునకు చీఁకటిమసకలో వారిని స్పష్టముగ గుర్తింపవలనుపడలేదు. వెంటనే కాగడాతెప్పించి వారి నెగదిగ చూడసాగెను. శివదేవయ్య పరిశీలనము తమ్ము వెల్లడిసేయఁగలదని యెంచి యావేషధారులటనుండి కాళ్ళకు బుద్ధిసెప్పిరి. వెంటనే శివ దేవుఁడనుచరులతో వారిని వెంటాడించెను. చేతికఱ్ఱలలోఁ జొనిపిన కత్తులు లాగి యనుచరు లందఱు నన్నిదిక్కులకు పరువులెత్తి వెన్నంటిరి. రాత్రి యంతయు చచ్చిచెడి నడిచియుండుటచే వేషధారులకు అడుగుపడలేదు. గుప్తముగా దాచిన కత్తులెత్తి ఎదురుతిరిగి పోరసాగిరి. శివదేవయ్య వారిని సమీపించి వారు కారాగృహమునుండి పాఱివచ్చిన జైనయతులుగాఁ దెలిసి అందినవారినెల్ల సంహరింప ననుచరుల హెచ్చరించెను. 'హరహర' యనుచు భటులు దొరికిన జైనయతుల శిరములఁ ద్రెళ్ళనేసిరి. కొందఱు పారిపోయిరి. శివదేవయ్య జినేంద్రస్వామిని మఱికొందఱను పట్టి బంధించి పరివారముతో ననుమకొండకుఁ జేరుకొనెను.

పదునెన్మిదవ ప్రకరణము.

# విజయయాత్రకు సైన్యము కదలినది.

తెల్లవారినంత అనుమకొండనగరమున జైనయతులతో జినేంద్రులు పాఱిపోయిరని పెద్ద కలకలము బయలుదేఱినది. ప్రోలరాజు కారాగారములకువెళ్ళి చూచినాఁడు. తాళములు తీయఁబడియున్నవి. సేవకులపై మండిపడినాఁడు. వారేమియు నెఱుఁగమనిరి. అధికారులనందఱఁ బిలిపించి విచారించినాఁడు. ఎవరిలోపము లేదనితేలినది. రాజునకేమియు బోధపడలేదు. దీక్షితులవారు వచ్చి బేతనదంపతుల గృహము పరిశీలించిరి. అది యథాస్థితిలోఁ దాళము వేయఁబడియేయున్నది. తాళపు చెవులగుత్తి యంతఃపురములోఁ గన్పట్టుటతో దీక్షితులమో ముగ్రతఁ దాల్చినది. అతఁ డౌడుఁగఱచి దీర్ఘాలోచనామగ్నుఁడయ్యెను. రాజు తలఁ బట్టుకొని ఆలోచన తోపక కూర్చుండెను.

జాముప్రొద్దు దాటినంత బాలశివదేవయ్య జినేంద్రుని వెంటఁబెట్టుకొని అనుచరులతో రాజసమ్ముఖమునకు వచ్చెను. అనుచరుల యొడళ్ళు రక్తసిక్తములైయుండెను. రాజగురువు లాశ్చర్యభయసంభ్రమములతో 'శివదేవయ్యా! ఏమిది! వీరెక్కడపట్టువడిరి? జైనయతులతో మీకు యుద్ధమెట్లుజరిగినది?' అని యిరువు రొక్కసారి ప్రశ్నించిరి.

'ప్రభూ! వీరు మన చెఱసాలనుండి తప్పించుకొని జంగమహేశ్వరులట్లుకాలాముఖ మఠమునకు వచ్చిరి. మేమును ప్రయాణమై యారాత్రి యట విశ్రమించితిమి. వీరునిజముగ వీరమాహేశ్వరులే యనుకొని భ్రమసి 'నమశ్శివాయ' యని సాష్టాంగపడితిని. వారు 'శివాయనమః' అను ప్రతివచనమీయరైరి. దానితో వీరిని సందేహించితిని. వీరు జైనయతులైయుందురనిపించినది. సందేహమునింకను దీర్చుకొనుటకు యోచించునంతలో

వీరు నన్నుగుర్తించి పలాయనము చిత్తగించిరి. వెంటాడి సజీవముగనే పట్టుకొననెంచితిమి. కాని వారివద్ద ఆయుధములుండుటచే మా ప్రాణ రక్షణమునకై కొందఱిని శివార్పణము గావింపక తప్పినదికాదు. మాతప్పు క్షమింపుఁడు. అందివచ్చిన జినేంద్రుని, మరికొందఱనుమాత్రము నెట్టి హింసకు గుఱిసేయక సగౌరవముగ బంధించి కొనివచ్చితిమి. జైనులను చంపక తప్పనందులకు మన్నింపుఁ' డని యంజలిపట్టి వేఁడెను. దీక్షితులు ప్రోలరాజువంక జూచెను. ప్రోలరాజు శివదేవయ్య వీఁపుచఱచి 'సెభాష్ శివదేవా! నీవు నిజముగా శివదేవుఁడవే. నీవప్పుడు వారిని చంపకతప్పదు. వారు శత్రురాజులఁజేరుకొనిన మన కపజయమే సిద్ధముగదా! తరుణ ములో నీవు అప్రమత్తుఁడవై కార్యము చక్కఁబెట్టినందుకు నీకుఁ గృతజ్ఞు డను. హింసాచరణమిపు డానందకారణమే కాని బాధాకారణముకాదు. ఈ వీరఖడ్గమును బహూకరణముగా గ్రహింపు' మని సానందముగ శివ దేవునాలింగనము సేసికొని తన పచ్చలపిడి బాకు నాతని కొసంగెను. దీక్షి తులవారు మందహాసమున వారి నిరువురశిరముల చెఱియొకచేతితో స్పృశించి ఆనందాశ్రువుల దీవించిరి.

జినేంద్రు నెంతనిర్బంధించి యడిగినను బంధవిముక్తి యెట్లు జరిగినది తెలుపలేదు. బాలశివదేవుఁడు బాకుచూపి భయపెట్టఁబోవ ప్రోల రాజు నివారించి జినేంద్రుని యథాప్రకారము కారాగారమున బంధించుట కాజ్ఞసేసెను. తరువాత గురుశిష్యు లిట్లు సంభాషించుకొనిరి.

దీక్షి:— కారాగారములెట్లు తెఱువఁబడినవందువు ?

రాజు:— నాకేమియు బోధపడుటలేదు గురుదేవా !

దీక్షి:— ఎవరికి బోధపడకుండునటు లీకార్యము జరుపఁబడు శక్తి యెవరి కుండును ?

రాజు:— అదియుఁ దోచుటలేదు. కారాగారాధ్యక్షుని ప్రమత్తతయే యిందుకుఁ గారణమగుననిపించును.

దీక్షి:— ఆతని ప్రమత్తత రుజువుపడినదా ?

రాజు:— లేదు, తాళపుచెవు లాతని యధీనములోనే యున్నవిగదా !

దీక్షి:— నీయధీనములోఁగూడ నొక గుత్తియున్నదిగా ?

రాజు:— అది నాయధీనముననే యున్నది.

దీక్షి:— అది అంతఃపురములో దాచఁబడినదా !

రాజు:— (కొంత తటపటాయించి) ఇతరులు సంగ్రహించుటకు శక్యము గాకుండుటకై యంతఃపురములోనే నాభార్య జాగ్రత్తలో దాని నుంచితిని.

దీక్షి:— అందుచేతనే నేననుమానించుచున్నాను.

రాజు:— ఎవరిని !

దీక్షి:— రాజ్ఞిని.

రాజు:— ఆమె మనకింత కీడున కొడఁగట్టదు.

దీక్షి:— నీభార్యయందు నీకంతవిశ్వాసమున్నది. భార్యమాటను కాదన లేని మనోదౌర్బల్యము మీవంశముననే సహజమైయున్నది.

రాజు:— మీరు నన్ను పరిహసించుచున్నారు. భార్యను విశ్వసింపక ఎవరికైనను గృహస్థాశ్రమము జరుగఁగలదా! గృహస్థాశ్రమమునఁ గలుగు మనోదౌర్బల్యములు మీకేల అర్థముకాలేదోతెలియకున్నది. రాజకీయము లాశ్రమధర్మముల కతీతములు కాఁబోలు.

దీక్షి:— రాజకీయవిషయముల భార్యనుగాదుగదా దేవునిగూడ నమ్మ వీలులేదు.

రాజు:— మఱెవ్వరిని నమ్మవలె !

దీక్షి:— తన బుద్ధినిమాత్రమే. తనలోని దింకొకరికిఁ దెలియనేకూడదు.

రాజు:— మఱి రాణియే జైనులను చెఱవిడిపించెనందురా ! నన్ను నా రాజ్యమును నాశనముచేయుటకే ఆమె సంకల్పించెననియే మీ భావమా !

దీక్షి:— అంతవరకు నేను నిర్ణయించిచెప్పలేను. ముప్పాంబకు మైలాం బకు గాఢస్నేహమున్నదనునది యందఱకు దెలిసినదే. ఆమె నేస్తమే రాణిచే నీపని చేయుంచియుండును.

రాజు:— అట్లయిన మైలాంబను విడిపింపక జైనులను చెఱనుండి ముప్పాంబ విడిపించెననుట పొసఁగదే!

దీక్షి:— జైనపలాయనముఁగూర్చి నేను గట్టిగా విచారింపగా ముప్పాంబ యీమధ్య మైలాంబ నంతఃపురమునకు చెఱవిడిపించి రాత్రి ప్రతి దినము రప్పించుకొనుచున్నదను విషయమొకటి తేలినది.

రాజు:— ఆఁ! రాణినే మీరనుమానించుట తగదు. ఆమెవిషయము నాకుఁ దెలిసినంత మీకుఁ దెలియదుగదా!

దీక్షితులవారింక ప్రసంగము పెంచుట మంచిదికాదని యంతటితో సంభాషణమాపివేసిరి. రాజునకు దీక్షితులవారి మాటలవలన స్వాభిమానము దెబ్బతినినటులనిపించినది. కొంతసేపిరువురును మౌనమువహించి లోని భావోద్రేకములఁ దమాయించుకొనిరి. దీక్షితులు ప్రసంగముమార్చి 'రాజా! నేఁటిపరిస్థితులలో మనము జైత్రయాత్ర విజయదశమివరకాపియుంచుట మంచిదికాదు. కొందఱు జైనయతులు శివదేవునకందక పాఱిపోయియున్నారుగదా! వారు మన శత్రువులఁజేరి తిరిగి వారందఱకైకమత్యము సంఘటించిన మనపని కష్టముకాఁగలదు. మఱియు మన రాజ్యముననే మనలోనుండి మనకు గీడుఁదలచువారున్నారు. వారి పథకములు జైనపలాయనముతో బలపడఁగలవు. కాన ఇంటను బయటను శత్రుపథకములు సాగకుండగనే మనము శత్రువులను మట్టుపెట్టవలెను. నేఁడే జైత్రయాత్రకు సైన్యమును చరలింపవలెను" అని పలికెను.

"ఇది భాద్రపదమాసము శూన్యమాసముగదా! అందును ఇవి పితృతిథులాయె. ఇది ప్రయాణమునకు శుభకాలము కాదుకదా! ఈ

మహాలయపక్షముదాఁటిన నీఁక విజయదశమిమాత్ర మెంతిలోనున్నది! ఇంతలోనే ప్రమాదము వచ్చిపడునందురా!" అని రాజు గురుని ప్రశ్నించెను.

"అటనకుము. రాజకీయములందు పదునుదప్పి నిమిషము జరిగిపోయినఁజాలు నంతయు విషమఫలిత మీయఁగలదు. శుభాశుభకాలములఁ జర్చించుచు కూర్చుండుటకిదే సమయముగాదు. ఇది శుభతిథినక్షత్ర పరిగణనముసేసి యాలసింపఁదగిన కార్యమునుగాదు. తిథివారనక్షత్రములు మిక్కిలి పరిగణించుచుఁ గూర్చుండువారికి కార్యములు సిద్ధింపవు. గజములు ప్రతిగజములచేతవలెఁ గార్యములు కార్యయత్నములచేతనే సిద్ధింపఁగలవు. మంగళతిథినక్షత్రేష్టిత్వము లాభవిఘ్నములలో నొకటిగా ఆర్యచాణక్యులవా రర్థశాస్త్రమునఁ దెలిపియున్నారు. ఇఁక క్షణమాలస్యము సహింపరానిది. ఆలస్యమున అమృతముఁగూడ విషముగామాఱఁగలదు." అని దీక్షితులవారు పలుకుటతోడనే ప్రోలరాజు నాఁడే జైత్రయాత్రకు సైన్యములు తరలించుటకు నిశ్చయించెను.

పిమ్మట రాజు కొందఱు ప్రమత్తులగు కారాగారసేవకులను పనుల నుండి మానిపించి క్రొత్తవారిని నియమించెను. కొందఱను పనులనుండి వేఱుపనులకు మార్పులుసేసెను. అంతఃపురమున ముప్పాంబ చెయ్వులఁ గనిపెట్టి చెప్పుటకు రహస్యముగ విశ్వాసపాత్రలగు స్త్రీలను కొందఱను నియమించెను. కారాగృహములకన్నిటికి రెండుతాళములువేయించి ఒక తాళపుచెవులగుత్తి రామేశ్వరదీక్షితులవారివద్దనుంచెను. సేనానాయకులకు తోమర, ముసుంద, కౌక్షేయ, కార్ముక, గదా ప్రాస, కుంత, పట్టిసాద్యాయుధవాహకములగు శకటములతో సైన్యముల నాఁడే జైత్రయాత్రకుఁ గదలింప నాజ్ఞవెట్టెను.

పంధొమ్మిదవ ప్రకరణము.

# తైలపదేవుని బంధించి తిరిగి విడుచుట.

"సైన్యములు ముందెచటకుఁదరలింపవలెను? ఎవరిపైకి ముందు యుద్ధమునకు దిగవలెను?" అను ప్రశ్నలుదయించినవి. "తైలపదేవుఁడందరిలోను ప్రబలుఁడగు శత్రువు కాన ఆతనిని ముందు జయింపవలెను. సైన్యముల సమీకరించుకొనుచు నాతఁడిపుడు కల్యాణినివదలి పోడూరులో మన ప్రక్కనేయున్నాఁడు. ఆతనికిఁ బిమ్మట హీనశత్రువుల నెట్లులైన జయింపవచ్చును". అని దీక్షితులవారు పల్కిరి. "హీన శత్రువులనే ముందు సులభముగా జయించి బలము పుంజుకొనినపిమ్మట ప్రబలశత్రువు మీఁద పడుట శ్రేయముగదా" యని ప్రోలరాజు ప్రశ్నించెను.

పైకేమి చెప్పుచున్నను ప్రోలరాజు తైలపుని జయించుట కిష్టపడకున్నాఁడని లోపలనున్న భావము దీక్షితులు చిటికెలో గ్రహించివేసెను.

దీక్షి:— హీనశత్రువులను ముందు జయించుటకుఁ దలపడినచో వారు ప్రబలుని సాయమపేక్షింపఁగలరు. ఇరువురును కలిసిన మనకు జయము కష్టసాధ్యమగును. ప్రబలుఁడు తనబలముపై దృఢవిశ్వాసముఁగల్గి హీనులను సాయపడఁగోరఁడు. అది తనకుఁ దగనిదిగా భావించుకొనును. అప్పుడు ఏకాకియైన యాతనిని మనము సుఖముగా జయింపనగును. ఏమందువు?

రాజు:— మీ రాజకీయవిజ్ఞతను కాదనఁజాలను. కాని—

దీక్షి:— నీహృదయము నాకవగతమైనది. నీవు విక్రమాదిత్యుఁడు బ్రతికియున్నపుడు ఆతనికి సామంతుఁడవు. ఆతని కుమారుఁడగుట తైలపుఁడు నేఁడు నీకు శత్రువైనను యుద్ధమునకు దిగుట కృతజ్ఞతయని ఇష్టపడకున్నావు. అంతియేనా!

రాజు:—అంతియేకాదు. నాతండ్రి తొల్లి మనసహస్రగ్రామ పరిమితమగు సబ్బిసాయిరమండలమును విక్రమాదిత్యునిచే బహుమానముగఁ బడసియున్నాఁడు. అతనికున్న 'త్రిభువనమల్ల' బిరుదమునుగూడ వహించినాఁడు. వంశపరంపరగ వారి యాశ్రయము నొందినవారమగుట ఆవంశీకుని నేనై యుద్ధమునకు పురికొల్పి సంహరించుట నాకెంత మాత్రము నిష్టముగానుండలేదు. కృతఘ్నత మహాపాపముగదా!

దీక్షి:—రాజ్యాంగతంత్రముల నిట్టి యాత్మాభివృద్ధి భావములుతగవు. తైలపునిపైకి నీవు యుద్ధమునకు దిగకున్న అతఁడే నీపైని పడగలఁడు. శత్రువులు మనపైకి బలపడిరాకుండ ముందు మనమేయుద్ధమునకు దిగిన సులభముగా జయింపవచ్చుననిగదా యీప్రయత్నము! ఇంతకు నిందు కృతఘ్నతా దోషమునులేదు. తైలపుఁడిపుడు కాకతి రాజ్యము వృద్ధియైపోవుచున్నదని మత్సరగ్రస్తుఁడై శత్రుభావము వహించి నీపై నేఁడో రేపో పడఁబోవుచుండ నాతనిపై నీవు విక్రమించుట కృతఘ్నతయగునా! నీపైఁబడినపుడుకూడ నీవాతని చేతులలోఁ జిక్కుటకే నిశ్చయించుకొంటివా! ఇట్టి క్షుద్రమగు హృదయదౌర్బల్యము త్యజించి లెమ్ము. ముందు తైలపునే జయింపక తప్పదు. తైలపుని పిమ్మటనే గోవిందరాజాదుల సంగతి పట్టింపవచ్చును.

ప్రోలరాజు దీక్షితులవారి చివరిమాటలలోని నైశిత్యమును గ్రహించి మఱుమాట పల్కలేదు. గుర్వాజ్ఞప్రకారము తైలపునిపై యుద్ధమునకుఁ దలపడుటకు సిద్ధపడెను. సైన్యములు తైలపదేవుని జయించుటకు కోడూరునకు తరలింపఁబడినవి.

ప్రోలరాజు మహాయోధుఁడు. ప్రజ్ఞాశాలి. అతని శౌర్యమునకు సాటిలేదు. అతనిది ఉదారమైన హృదయము, ఆత్మాభివృద్ధికిఁ దగ్గ సల్లక్షణము లాతనిలో పొతరలాడినవి. యుగయుగములవరకు భవిష్యత్తులో

ప్రకాశించెడి నొక మహాసామ్రాజ్య నిర్మాణమున కాతఁడు సంకల్పించు కొనినాఁడు. కాన తన కిష్టములేకున్నను ఆత్మభావముల నణఁచికొని రాజకీయవిజ్ఞత పాటించి తైలపదేవునిపైకి యుద్ధమునకుఁ గదలినాఁడు.

ప్రోలరాజుపైఁ దానే యెపుడో పడవలెననియుండఁగా నాతఁడే తనపై నింత హఠాత్తుగఁబడుటకు తైలపదేవుఁడు వితాకుపడినాఁడు. ఇంత వరకు జైనయతులు తన్నొకనిర్ణయమునకు రాకుండఁజేసిరి. ఎప్పుడో జినేంద్రునియొద్దనుండి పథకములుదెత్తుమనిరి. ఆకారణమున తనసైన్యమున నిప్పు డుపేక్షాభావము ప్రబలినది. మొదటిబిగువు తిరిగి కల్గించుటకంతలో శక్యముకాలేదు. తానెంత హస్త్యారోహణకర్మ కర్మఠగతియైనను ఒక పథకములేక సైన్యమున నుత్సాహములేక యేమిచేయఁగలఁడు! తన తాతతండ్రులనుండి తమ సామంతులైన కాకతీయరాజులలో నేఁడు ప్రోలుఁడు స్వతంత్రుఁడై రాజ్యమేలుటే తనకు కంటకముగనుండెను. ఆపై నాతఁడే తనపైఁబడుట కుగ్రుఁడై బుసలుకొట్టెను. మీదపడుచున్న శత్రువు నెదిరింపక చేయునదేమి! తనబలమిప్పుడు యుద్ధమునకుఁ జాలదు. తన కితరసహాయములేదు. తనకు మంత్రియు దండనాథుఁడు నగు కళచురి బిజ్జలునిఁ బిలిచి ఇతరరాజుల సాయము లభింపఁగలదా యని యాలోచన మడిగినాఁడు.

బిజ్జలుఁడు సచివుఁడేయయ్యు తైలపదేవునిపై భక్తివిశ్వాసములు గోల్పోయెను. కల్యాణిలో నున్నపుడు మొదటినుండియు నాతఁడు ప్రోలునిపైఁ బడుటకు యత్నములు సలుపవద్దనియు, విక్రమాదిత్యునిపైఁగల భక్తిచే ప్రోలుడు మైత్రికెన్నఁడు విఘాతముసలుపఁడనియు, చాళుక్యరాజ్యభాగము లక్రమముగా నాక్రమింపఁడనియు, మైత్రి పాటించియుండుటే మంచి దనియు, చెవినిల్లుగట్టుకొని బోధించెను. కాని తైలపునకు జైనయతులు గొలిపిన ప్రలోభము తలకెక్కి బిజ్జలునిమాట కాతరుచేయనీయలేదు. పైఁగా సర్వరాజ్య నిర్వహణమందును జైనయతుల సలహాలనే పాటించి బిజ్జలుని

చిన్నబుచ్చుచుండెడివాఁడు. బిజ్జలుఁడు జైనయతుల కుతంత్రముల నేవగించు
కొని వారిమతమునందు విశ్వాసముఁగోల్పడెను. ఆ యదనుఁజూచి రామేశ్వర
దీక్షితులు వీరభద్రమాహేశ్వరునిఁ గల్యాణిపంపి బిజ్జలుని మనసు శైవము
నకు మ్రొగ్గునట్లుజేసివైచెను. బిజ్జలుఁడు రామేశ్వరదీక్షితునకు వశపడి
పోయెను. దీక్షితులు బిజ్జలునిసాయమున చాళుక్య కల్యాణి రాజ్యమున
వీరశైవము ప్రచారపడునట్లుచేసి ప్రజామనస్సును శైవమునకభిముఖముగఁ
జేసెను ఎప్పటికైన తైలపునిదింపి బిజ్జలుని చాళుక్యరాజ్యమున నిలుప
రామేశ్వరుఁడు తలఁచి తనతలంపు బిజ్జలునకందఁజేసెను. సహజముగ
తైలపునిపై భక్తివిశ్వాసములు గోల్పడిన బిజ్జలునకు రామేశ్వరదీక్షితులిడిన
ప్రోత్సాహముతో స్వార్థపరత యావేశించెను ఆతఁడు స్వార్థమును
పూరించుకొనుటకుఁ బ్రజలలో వీరశైవము విరివిగా ప్రచారపఱచెను.

ప్రోలుఁ డింతత్వరగ తైలపునిపైనిఁబడుటకు బిజ్జలుఁడు నిష్టపడ
లేదు. తైలపునిఁజంపి రాజ్యము తనకు పట్టముగట్టుదుమని దీక్షితులు కబురు
పెట్టినను కల్యాణిరాజ్యమందలి ప్రజలనువలె మహబూబునగర, నల్లగొండ,
నెక్కొండ, పానుగల్లు ప్రాంతములప్రజలను వీరశైవమునకు మొగ్గింపలేకపో
యెను. ప్రజామనస్సు తనకువశపడకుండ తైలపుని ప్రోలుఁడు జయించినను
రాజ్యమును తాను నిలుపుకొనుట కష్టము. కాన తైలపుఁడోడిపోవుటగాని
యుద్ధమునఁ జచ్చుటగాని తనయభిమతమొడఁగూర్చునదికాదు. బిజ్జలుఁడు
తైలపదేవునకు ఇతరరాజులసాయము రాదనియు ప్రోలునితో సంధిగావించు
కొనుట యుక్తమనియు సలహాచెప్పెను. సహజదురభిమానియగు తైలపునకు
బిజ్జలునిసలహా రుచింపలేదు. తనకున్నసైన్యముతో తానే ప్రోలు నెదిరించు
టకుసిద్ధపడినాఁడు. తైలపదేవుఁడు గజయుద్ధమున బహుకుశలుఁడు. గజబల
మును ముందుంచి సైన్యమును కోటచుట్టు చక్రవ్యూహముఁ దీర్చినాఁడు.
తాను ధనుర్బాణములు దాల్చి పట్టపుటేనుఁగు నైరావతమునెక్కి సాహస
శౌర్యప్రదర్శనకు సైనికుల నుత్సాహపఱచుచు రణరంగమున నిలిచినాఁడు.

ప్రోలుని సైన్యము సముద్రమువలె నపారమైన తురంగ తరంగములతో కరిఘటా నక్ర భీకరమై దురవగాహమైయుండెను. ప్రోలుఁడు ధవళాశ్వమునెక్కి యచ్చటఁజూచిన తానయై తనసైన్యమును శత్రుసైన్యముపై కుసిఁగొల్పెను. ప్రోలుఁడు తైలపుని గజసైన్యమును తన యశ్వసైన్యముతో నెదిరించినాఁడు. రెండుసైన్యములు ఎదురుబొదురుగ ప్రవహించు రెండు నదీప్రవాహములువలెఁ దలపడినవి.

ప్రోలుఁడు ఖడ్గముధరించి తిరుగుచు చేతికందినశత్రువుల చెఱిగి వేయుచుండెను. తైలపుని సైన్యమున నొకఁడుచనిపోయిన మఱొకఁడక్కడ ప్రత్యక్షమై ప్రోలు నెదుర్కొనుచుండెను. ఒకగుఱ్ఱముపడిన మఱొక గుఱ్ఱమక్కడ సిద్ధముగనుండెను. ఏనుఁగులమీదనుండి శరపరంపర ప్రోలుని సైన్యముపై వర్షించినవి. ప్రోలుని సైనికులును శరసంధానకుశలురు. ఇరుపక్షములనుండి వచ్చిపోవు బాణములతో ఆకాశమునకు కప్పు ఏర్పడినట్లయినది. ప్రోలుని సైనికులబాణములు గురితప్పుటలేదు. ఏనుఁగులపైనున్న తైలపునిసైనికులు బాణహతులై క్రిందఁబడిపోయినంత మఱికొందరా యేనుగులపై కెక్కుచుండిరి. ఒక్కక్షణముపాటు ఇరుసేనల భవిష్యత్తు ఇదమిత్థమని చెప్పుట కష్టమైనది. పిమ్మట తైలపుదేవుఁడెక్కిన పట్టపు టేనుఁగుతో అరుమున్నూరేనుఁగులు గాయబడినవి. అవి తత్క్షణమే మూర్ఛిల్లఁబడినవి, ఆయేనుఁగులకుబదులు పదియేనుఁగు లెదుటికి ముందు వచ్చినవి. క్రమముగా సంఖ్య ఎక్కువైనది. గజములపై సైనికులు బాణహతులై నశించినను ఏనుగులు పెద్ద మూలములనుదెచ్చి ప్రోలుని సైన్యము మీఁదపడి కొట్టినవి, వానిపైని ప్రోలునిసైనికు లెన్నిబాణములు ప్రయోగించినను వాని యినుపకవచములను భేదింపలేక వర్షధారలవలె బాణములు జారిపడిపోయినవి.

ప్రోలుని సైనికుల కీగజముల నెదిరించుట కష్టమైనది. ఇనుపకవచములతో నేనుఁగులు నడగొండలవలె వచ్చి తొండములతోఁ దెచ్చిన

కత్తిదూలములచే సైన్యములను చెల్లాచెదరు చేసివైచినవి. సేనావ్యూహము చెదరిపోయినది. సైనికులు గజముల నెదిరింపలేక పలాయితులు కాఁజొచ్చిరి ప్రోలుఁ డీవిషమపరిస్థితి చూచినాఁడు తనకు గజబలమల్పము. గజయుద్ధమునఁ దనకు శిక్షణమునుదక్కువ. తైలపుని గజబలము నెదిరించుట అసాధ్యమేయని దిగులుపడినాఁడు. అంతలో నాతనికి మెఱుపుమెఱసినట్లొక యుపాయముతట్టినది. నూనెతోడను, గంధకద్రావముతోడనుఁ దడిపినగుడ్డలు తెప్పించి వెనుకపాటున ఆశ్వికులచే నైపుణ్యముతో నాయేనుఁగుల తొండములందున్న కొయ్యమొద్దులపై నిప్పంటించి పడవేయించెను. ప్రతి కొయ్యకు గంధకముతోఁదడిపిన గుడ్డలనుండి నిప్పు దరికొని భగభగ మంటలెగఁబోసెను. తొండములు జ్వాలాభీలములైనవి. అన్నివైపులను గంధకపువాసన కప్పివైచినది. పదిదిక్కులు మంటలమయమైనవి దానితో గజములు హడలెత్తి తోకలెత్తి వెనుకకు పరుగెత్తినవి. ఆత్రొక్కిడితో తైలపుని కాల్బలము ఛిన్నాభిన్నమైనది. మంటలచే నొడళ్ళు కాలిన గుఱ్ఱములు కుప్పకుప్పలుగ నేల కొఱగిపడినవి.

తన గజబలము ప్రోలుని సైన్యమును చీకాకుపఱచివైచుచున్నదను నుత్సాహముతోఁ జూచుచున్న తైలపునకు ఈ భీభత్సకృత్యమును జూచుసరికి గుండెలు జాఱిపోయినవి. తాను హస్త్యారోహణకర్మకౌశలుఁడే. తన గజబలము తనకే ముప్పుతెచ్చిపెట్టినది. ప్రోలుని బుద్ధిచాతుర్యమునకు తైలపుఁడు దిగ్భ్రాంతిపడెను, తనసైన్యము తన గజబలముచేతనే నశించినది. తానిప్పుడేమిసేయవలె! పౌరుషము బిగఁబట్టి యాతఁడు తన యైరావతమును ప్రోలునివైపు మఱలించినాఁడు. దారిలో బాలశివదేవుఁ డడ్డుపడినాఁడు. శివదేవుఁడు పంచకల్యాణిగుఱ్ఱముపై ధనుర్బాణములు ధరించి తైలపు నెదుర్కొనినాఁడు. తైలపుఁడు ప్రోలునికొఱకే వెదకుచున్నను శివదేవు నెదిరింపకతప్పినదికాదు. ఏనుఁగు శరీరమంతయు నినుపకవచమునఁ గప్పబడినదగుటనెంచి శివదేవుఁ డొక్కబాణము

సూటిగా గుఱిపెట్టి ఏనుఁగు నాసారంధ్రములోనికి విడిచినాఁడు. దానితో నేనుఁగు మావటివానిశిక్షకు లొంగలేదు. ఘీంకారముతో తలదిరిగి యిటు నటు చిందులుద్రొక్కఁజొచ్చినది.

ఇఁక గజముమీఁదనేయుండినచో దానువదలిన బాణము శివదేవునిఁ దాకుట సంభవముకాదని తైలపుఁ డొరనుండి ఖడ్గమునులాగి క్రిందికుఱికి అశ్వమును బొడువఁబోయినాఁడు, శివదేవుఁడు తానశ్వముపైనుండి తైలపుని బాణపాతమున కెరజేయుట అతిసులభమైనను నది ధర్మయుద్ధముకాదని పంచకల్యాణినుండి క్రిందికిదిగి యొరనుండి చంద్రహాసము పెఱికి యెదురునిలిచినాఁడు. ఇరువురు నేలమీద ఖడ్గయుద్ధమునకు దిగినారు. ప్రాణములకు తెగించి ఎంత భీకరయుద్ధముచేసినను ఒకరికొకరు లొంగనే లేదు ఇరువురుకూడ తమకు సాయపడుటకు వచ్చిన సైనికుల సహాయ మును నిషేధించినారు. ఒక జాము సేపట్లు గడచినపిదప తైలపున కాయాసము హెచ్చినది ఆతనిఖడ్గమున చలనవేగము తగ్గినది. శివదేవుఁ డాయదనుఁగనిపెట్టి తన చంద్రహాసమును సూటిగా తైలపునిమెడకు గుఱిపెట్టి యెత్తి 'హర హర మహాదేవ' అని యుచ్చైర్నాదముఁగావించెను. అంతలో వెనుకనుండి యొక యాశ్వికుఁడు బాలశివదేవుని మణికట్టును గట్టిగపట్టుకొని 'నమశ్శివాయ' అనినాఁడు. శివదేవుఁడు చేతినివదలించుకొని వెనుకకుఁదిరిగిచూచినంత ప్రోలరాజు ప్రత్యక్షమై 'నమశ్శివాయ' యని తిరిగి యుచ్చరించెను. శివదేవుని యుద్రేకము తగ్గిపోయెను. శివదేవుఁడు 'శివాయనమః' యని సముదాచారము జరిపి ప్రోలరాజునకు నమస్కార క్రియనడిపెను. తైలపుఁ డీదృశ్యమును గమనించి యదేయదనుగఁ దన సైనికుఁడు తెచ్చిన అశ్వమునెక్కి పలాయనమున కాయత్తపడెను. వెంటనే ప్రోలుని యనుచరు లాతనివాలకము గమనించి బంధించి ప్రోలుని ముందుఁబెట్టిరి. ప్రోలరాజు తైలపునిఁజూచి మందహాసముసేసెను, తైల పుఁడు ముఖము భూమికిదించుకొనెను. ప్రోలుఁడంత తైలపుని బంధములు

ఛేదింపించి విడిచివైచెను, తైలపుఁడు సిగ్గుపడి బిజ్జలునటనిలిపి తాను కల్యాణిమార్గముఁబట్టి బోయెను.

శివదేవుఁడు ప్రోలుని చెయిదమునకు అసంతృప్తిపడి నిరుత్సాహ దృక్కుల వీక్షించెను.

ప్రోలు:— శివదేవా! అంతగా నిరుత్సాహపడుదువేల! నాపని నీకు నచ్చలేదా!

శివ:— ఎట్లు నచ్చగలదు! చేఁజిక్కిన ప్రబలశత్రువును నిష్కారణముగా విడిపించినారు.

ప్రోలు:— నిష్కారణముకాదే!

శివ:— ఏమి! ఇంతలో నంతకారణ మేమివచ్చిపడినది? ప్రభువువారి మనస్సునుండి తిరిగి విక్రమాదిత్యులవారిపై భక్త్యావేశ మునికినది కాఁబోలు.

ప్రోలు:— భక్త్యావేశము మాట యటుంచుము. ఇప్పుడు తైలపుని విడుచుట కది కారణముకాదు.

శివ:— మఱింకేమివచ్చినది?

ప్రోలు:— మీయిరువురు ద్వంద్వయుద్ధమున కుపక్రమించినపిమ్మటనే కళచురి బిజ్జలుఁడు నాకు వార్తనంపినాఁడు.

శివ:——బిజ్జలుఁడా! అతఁడు తైలపునకుఁ బ్రక్కనే నిలిచియుండి మాయుద్ధ మును దిలకించుచునేయుండుట నేను చూచితినే!

ప్రోలు:— అతఁడు తైలపదేవునికి ప్రక్కనిలఁబడి చూచుచుండుట నీవాతనిఁ జంపకుండఁజేయుటకే.

శివ:— అదేమి? తైలపుఁడు చచ్చుట ఆతనికెనిష్టములేదా?

ప్రోలు:—లేదు. ఆసంగతినే నాకు వార్తనంపినాఁడు. నేను శిబిరమునఁ గూర్చుండి యనంతరకర్తవ్య మాలోచించుచుండినంత మన వీర భద్రమాహేశ్వరులు నాయొద్దకు రొప్పుకొనుచువచ్చి త్రైలపదేవుని శివదేవుఁడు కొలఁదిసేపటిలో చంపివేయుటకు సిద్ధముగానున్నాఁ డనియు, వారి యుద్ధమును వెంటనే ఆపివేయవలసినదనియు, త్రైలపునకు గర్వభంగము కలుగునట్లు చేయుటయేకాని చంపుట యెంతమాత్రము తగదని బిజ్జలుఁడు తెలుపుమనినాఁడనియు నాకు వార్తనందించిరి.

శివ:— బిజ్జలునకుఁగూడ విక్రమాదిత్యునిపైని భక్త్యావేశ మబికినదా!

ప్రోలు:— (నవ్వుచు) లేదు. ఇంకను ప్రజ వీరశైవమునకు మొగ్గలేదఁట. ఇప్పుడు త్రైలపుఁడు చచ్చినచో నాతని రాజ్యములోని ప్రజామనస్సు మనవైపునకుఁదిరుగక జైనమతావేశముతో విప్లవములు రేపునఁట. కాన కొన్నాళ్ళు ఆగి జయించుట యుత్తమమఁట. ఈసంగతి బిజ్జలుఁడు వీరభద్రులవారిద్వారా తెలియఁజేసినాఁడు. అతని కార ణము సరిగానేయున్నది. ప్రజామనస్సు వశపడకుండ రాజ్యమును వశీకరణము చేసికొనఁజాలమని మొదటనుండి దీక్షితులవారు చెప్పు చున్నదేకదా! ఎవరినిపంపినను నీవు వినవని నేనే త్వరితముగ బయలుదేఱివచ్చితిని, అదృష్టవశమున చివరిగడియకైన రాఁ గల్గితిని. నీవు త్రైలపునిఁ జంపివేసియేయున్నచో పరిస్థితులడ్డముగఁ దిరిగియుండును.

శివ:— ప్రభూ! మీ రాజనీతివిజ్ఞతకు జోహారులు. దీక్షితులువారి యాదే శముమీఱి మీరు త్రైలపుని విడిపించినారని ముందు తలఁచి యుంటిని. ఆభావముతోనే మిమ్ము కొంచెము నిరాదరణముగఁ జూచి మాటలాడితిని క్షమింపుఁడు.

శివదేవుఁడు ప్రోలరాజునకు శిరమువంచి విధేయతతో సమస్కార క్రియ జరిపెను. ప్రోలుఁడు ఆదరపురస్సరముగ శివుని భుజముపై మృదువుగఁజఱచి మందహాసము సేసెను. తరువాత నిరువురు శిబిరమునకుఁ బోయి రామేశ్వరదీక్షితులవారిని దర్శించి జరిగిన యావద్వృత్తాంతము వివరించిరి. దీక్షితులవారు ప్రోలరాజు సమయజ్ఞతకు, బిజ్జలుని కార్యజ్ఞతకుఁగూడ మెచ్చుకొనిరి.

"ఆతనిప్రాణము ప్రోలునిచేత రక్షింపఁబడుటచే తైలపదేవునకు గర్వభంగమైనది. ఆతఁడింతలో మనమీదకురాలేఁడు. ఈలోపున బిజ్జలుఁడు ప్రజామనస్సును వీరశైవమునకుఁ ద్రిప్పుకొనఁగలఁడు. మన వీరభద్రమాహేశ్వరుఁడాతనికిఁ దోడుపడఁగలఁడు. తైలపుని రాజ్యభ్రష్టత బిజ్జలుని చేతనే జరిపింపవచ్చును. ఇప్పుడు విజయభేరీ మ్రోగించి విక్రమాదిత్యునిపైఁగల భక్త్యనురాగములచే తైలపుని ప్రాణములతో ప్రోలరాజు విడిచిపుచ్చెనని ప్రకటించి సైన్యమును మఱలించుఁ" డని దీక్షితులువారాదేశించిరి.

రాజాజ్ఞతో సైనికులు సమరముచాలించి విజయభేరీ మ్రోగించిరి. యుద్ధమువలనఁ గలిగిన ప్రబలనష్టమును తిరిగి పూరించుకొనుటకు, క్రొత్తబలములఁ గూర్చుకొనుటకు, అనుమకొండలోఁ గొంతకాలమాగుటకు, దారిలో * నేలకొండపల్లిసీమ పాలకుఁడగు గోవిందరాజుపై బడుటకు ప్రోలరాజు నిశ్చయించి సైన్యమును మరలించెను.

* నేలకొండపల్లి ఒరంగల్లుజిల్లాలోనున్నది.

ఇరువదవ ప్రకరణము.

# గోవిందరాజును బంధించుట.

గోవిందరాజు అనుమకొండరాజ్యమునకు నాతిదూరమునఁ గల నేలకొండపల్లిసీమను పాలించుచుండెను. ఈతఁడు ఆఱవ విక్రమాదిత్యుని సేనాధిపతియగు ననంతభూపాలుని సోదరపుత్రుఁడు. ప్రోలరాజును, ఆతనితండ్రి బేతరాజునుకూడ చాళుక్యవిక్రమాదిత్యునివద్ద సామంతమాండలికులగుటచే అనంతభూపాలునికి నెఱపు విశేషగౌరవపురస్కారమును అతని సోదరపుత్రుఁడగుట గోవిందరాజునకును నెఱపుచుండెడివారు. స్వతంత్రరాజైన ప్రోలరాజువలన నిపుడు పూర్వవిధేయతాపురస్కృతి గోవిందరాజునకు లభించుటలేదు. నానాఁటికి ప్రోలుఁడు బలపడి రాజ్యవిస్తరణముఁ గావించుటవలన పొరుగురాజ్యమగుట తన కెప్పుడేమికీడు ఆతనివలన మూడునో యను భయసందేహములు గోవిందరాజును పీడించుచున్నవి.

ప్రోలుఁడు జైనమునువీడి వీరశైవమును చేపట్టుటతోడనే గోవిందరాజు జైనమున కండగానిలిచిన తాను బలపడవచ్చునని భావించెను. ప్రజామనస్సును ప్రోలునినుండి తనవైపునకాకర్షించుకొనుట కది యుక్తిగా నాతఁడూహించి జైనయతుల కాశ్రయమిచ్చెను.

అనుమకొండకుఁ బొరుగుదేశమగుట ప్రోలునివలన విరక్తినొందిన జైనులు పెక్కురు నేలకొండపల్లిసీమఁ జేరుకొని తలదాచుకొనిరి. జైనయతుల ప్రచారమువలన నా సీమలోని ప్రజలకు జైనమతాభిమానము చిగురించినది. ప్రజలు తమ శక్తినంతను ధారవోసి జైనమతమును నిలఁబెట్టుటకు బద్ధకంకణులైరి. రామేశ్వరదీక్షితులు వీరశైవమతప్రచారముతోపాటు ప్రతిగ్రామమందు ప్రజలకు సైనికశిక్షణ మొసంగుచుండు

టను గమనించి జైనయతులు నేలకొండపల్లిసీమలోని ప్రజలకుఁగూడ జైన మతోన్మాదము హెచ్చించి యూరూర ప్రజాసైన్యమును తయారుచేసిరి.

ప్రజలలోఁ బదునారుసంవత్సరములుదాటి నలుఁబదికిమించిన వయసువారినందఱను ప్రతిగ్రామములోను ప్రతిదినము నొక నిర్ణీతసమయమున సమావేశపడునట్లుసేసి యైచ్ఛిక సైనికశిక్షణ మొసంగిరి. అందఱకు కత్తి కఱ్ఱసాము లలవడసేసిరి. మతోన్మాదమును దలకెక్కించి తమ మతరక్షణకై ధన ప్రాణముల తృణప్రాయములుగ త్యజించుట కావేశము లెత్తించిరి.

గోవిందరాజునకున్న మూలబలము బహుపరిమితమైనను ప్రజా సైన్యము తన కవసరపడినప్పుడు తోడ్పడఁగలదను ధైర్యముతోఁ బ్రోలుపైఁ బడుట కతఁడుత్సహించుచుండెను. కోఱలపౌర్ణమి సమావేశమునుండి తిరిగి వచ్చి జైనయతులు ప్రోలునిపైఁబడుటకు మంచిపథకములు దెల్పెదు మనిరి. వారు తిరిగిరాకపోవుటతో గోవిందరాజు మిక్కిలి నిరుత్సాహ పడెను. జైనయతుల చేతిలో నంతవరకు కీలుబొమ్మ యైయుండుటచే రాజకీయతంత్రములందు నాతఁడేమియు నిప్పుడు స్వతంత్రింపలేకుండెను.

ప్రోలరాజు నెదిర్చి తైలపదేవుఁడు నిలువలేక రాజధాని కోడూరు వదలి కల్యాణికిపోయెనని చారులవలనఁ దెలిసికొని గోవిందరాజు భయ భ్రాంతుఁడయ్యెను. తైలపుదేవుఁడంతటివాఁ డట్లుకాగా ప్రోలుని తానెదిరించి యిఁక నిలువఁగలఁడా! ఇంతటిలోఁ బ్రోలునిపై దానెట్టియుద్ధము తలపెట్ట కుండుటే యుక్తమని యాతని కనిపించినది. తా నాతనిపైఁ బడకున్న నేమాయె, కల్యాణినుండి తిరుగుముఖములోఁ దనపైఁబడుటకు ప్రోలుఁడే బయలుదేరుచున్నాఁడని వార్త యందినంత గోవిందరాజునకుఁ జేతులు గాళ్ళు నాడలేదు. భయవిహ్వలుఁడై కర్తవ్యము గోచరింపక స్తబ్ధుఁడయ్యెను.

చోడవంశీకుఁడగు ఉదయరాజు గోవిందరాజునకు మొదటినుండి గూర్చు మిత్రుఁడు. జైనమతమున కాశ్రయమిచ్చి ప్రోలుని స్నేహము

చెఱచుకొనవద్దని యాతఁడు గోవిందరాజునకు బోధించియుండెను. "ప్రోలు నకు నీయందుఁ దొల్లిటినుండి గౌరవముహెచ్చు. దానినే పెంపొందించు కొనిన నాతఁడు నీతోఁజెలిమిగానుండి నీరాజ్యముజోలి కెన్నఁడురాఁడు. ప్రోలుఁడు రాజనీతినెఱింగిన యాత్మగుణముకలవాఁడు, అతనితోఁ జెలిమి వాటించినంతకాలమును నేలకొండపల్లిసీమ రాజ్యమునకు విచ్ఛిత్తియేలేదు. నీవు జైనమున కాలంబమైనంతనే ప్రోలుఁడు నీపైఁ గత్తిగట్టునట్లు రామేశ్వర దీక్షితులు ప్రోత్సహింపకమానఁడు. నేఁటి జైనమునకుఁ బ్రజలులొంగి నీకు బాసటయై నిలుతురనుమాట వట్టికల్ల. ఈ జైనమతము హైందవము నకుఁ బూర్తిగా విరుద్ధము. క్రొత్తవింతయగుట కొన్నాళ్ళు ప్రజలు జైనమున కుత్సాహముఁ జూపించి ఆవేశితులైనను శైవము హైందవమతాంతర్గతమే యగుటచే నెప్పటికైన వారి మనస్సులు పూర్వమతమునఁ గలియకపోవు. నదులెన్నివంకరలుతిరిగినను సముద్రమునఁ బడకతప్పనట్లే యెన్నిమత ములుమారినను రక్తము తొల్లిటిదేకాన తొల్లిటిమతమును విడువనీయదు." అని యుదయరాజు చెప్పిన బోధనలను గోవిందరాజు పెడచెవినిఁబెట్టి జైన యతు లెట్టులాడించిన నట్టులాడి ముప్పుఁదెచ్చుకొనెను.

ఉదయరాజు గోవిందరాజునకు మిత్రుఁడైనను జైనమతమునకు మిత్రుఁడుగాఁడు. ఈసంగతిని గుర్తించిన రామేశ్వరదీక్షితులు బసవనాథ మాహేశ్వరునిఁబంపి యుదయరాజు క్రమముగా శైవమతాసక్తుఁడగునట్లు గావించియుంచెను. క్రమముగా గోవిందరాజు ఎంత జైనమతోన్మాది కాగల్గెనో యుదయరాజంత శైవమతారాధకుఁడయ్యెను. మైత్రి మైత్రిగనే యుండి వారిమధ్య మతములు భేదించియుండెను.

ప్రోలరాజు గోవిందరాజుపైఁ బడుటకు సైన్యముల మరలించిన వార్త తెలిసి యుదయరాజును చకితుఁడయ్యెను. తానేమిసేయవలె? గోవిందుఁడిన్నాళ్ళు తాను చెప్పినది వినలేదు. తాను తలఁచినది నిజ మైనది. జైనపుపిచ్చియెత్తించి ప్రజలను యుద్ధమునకాయత్తపఱచి యుద్ధ

ములోఁ జచ్చునట్లుచేయుటతప్ప గోవిందరాజు జయమునొందఁగలుగునది లేదు. ప్రజానాశనము తనకు సుతరాము నిష్టముకాదు, ప్రజలు వట్టి యమాయకులు. ప్రజారక్షణము సేయవలసిన రాజు స్వప్రయోజనము నకై ప్రజానాశనము చేతులారఁ జేయుచుండుట దలఁచినపు డాతని కొడలు కంపరమెత్తినది. గోవిందుఁడు దురభిమానగర్వి. ఇన్నాళ్ళు ప్రోలుతో చెలిమిగ మెలఁగుటకే యిష్టపడని యాతఁడిప్పుడు ప్రోలుని శరణమర్థింపు మనిన వినునా? గోవిందుఁడు తనకిష్టుఁడే. గోవిందుని ప్రాణము పోవుచుండఁ దాను చూచుచునుండలేఁడు. అయినఁ దానిపుడాతనికెట్లు సాయపడఁగలఁడు? అతని యడుగుజాడలో తానును నడిచిన నాతనికి, తనకు, ప్రజలకు నాశ నముతప్పదు. ఇఁక మార్గమేమి? ఉదయరాజు తీవ్రముగ నాలోచించి వెంటనే బసవనాథమాహేశ్వరులను రామేశ్వరదీక్షితులవారి యొద్దకు "ప్రోలరాజు పూర్వమునుండి గోవిందరాజు కుటుంబముపై నెఱపు గౌరవము గుర్తించి అతనిని ప్రాణములతో విడిచిమాత్రము రాజ్యమును వశపఱచుకొనుట యుక్తము. గోవిందుఁడు మిమ్ము మధ్యదారిలోనే యెదిరింపఁజేయుదును. అతఁడెంతయెదిర్చిన నాతని తలఁదీయకుండుట నాకు వరముగా ననుగ్రహింపుఁడు. ప్రజానాశనముగాకుండ రాజ్యము మీకు వశపడుటకు నేను సహాయపడుదును. నాసహాయము నంగీకరించి వీరశైవమును విస్తరింపఁజేయుటలెస్స" యని వ్రాసి లేఖనొసఁగి కార్యము చక్కఁబెట్టుట కర్థించిపంపెను.

విజయోత్సాహముతో ప్రోలరాజు సైన్యము నేలకొండపల్లెకు సాగి నది. సముద్రఘోషవలె వీరుల యుత్సాహవచనముల సందడిహెచ్చినది. విజయభేరీల మ్రోఁత యాకాశమునంటినది. దిగంతములనున్న గజముల చెవులు చిల్లులుపడినవి.

ముందు గజదళము బయలుదేఱినంత కొండలు నడిచివెళ్ళుచున్న ట్లున్నది. అశ్వదళము ఎగురుచున్న గండభేరుండపక్షులులాగున దాని

వెనుక నడిచినది. దానికి మఱింతవెనుక చీమలబారువలె కాల్బలము సాగినది. భయంకరములైన చర్మపుటుడుపులతో, లోహశిరస్త్రాణము లతో, ధనుర్బాణములతో, సుశిక్షితగమనముతో టకటకనడుచుచున్న అసం ఖ్యాకులగు కాలిబంటులు నేలయీనినట్లు నడిచిరి.

కాలిబంటులకు అశ్వదళమునకు నడుమగా పంచకల్యాణి గుఱ్ఱ ములపై ప్రోలరాజును, బాలశివదేవుఁడును చెఱియొకప్రక్క మందగమ నముసాగింప రామేశ్వరదీక్షితులవారి బంగారుపల్లకి మధ్యగాసాగినది. మణులుపొదిగిన కళ్లెములు. జరీజీనుగలిగి ఛత్రచామరములతోఁ గూడిన తెల్లని పాలవన్నె అశ్వమును ప్రోలరాజు దక్షిణపార్శ్వమున పల్లకీనడకతో సమముగ నడిపించుచు గురువుతో వినయమధురముగ సంభాషణము జరుపుచు పయనముసాగెను. వామపార్శ్వమున బాలశివదేవుఁడు వారి సంభాషణ మాలకించుచు మందముగ పంచకల్యాణిని నడిపించెను.

మఱిరెండు మజిలీలలో నేలకొండపల్లిని సమీపింతురనఁగా మార్గ ములో బసవనాధమాహేశ్వరులు ఉదయరాజు పంపిన లేఖను దీక్షితులు వారికొసఁగిరి. లేఖనుజదివి దీక్షితులు ప్రోలరాజువైపుఁజూచి "రాజా! నీకు విజయలక్ష్మి దారిలోనే స్వాగతమొసంగుచున్నది. అదృష్టవంతుడవు. అందుకో" మ్మని యుదయరాజు వ్రాసిన యాలేఖను ప్రోలునకొసఁగెను. ప్రోలుఁడు చదివికొని గురుదేవుఁడు ముందుగనే యుదయరాజును తమ మతమునకుఁద్రిప్పి మార్గము నిష్కంటకముఁ గావించినందుల కాతని దూరదృష్టి నభినందించెను. బసవనాథమాహేశ్వరులకు వందనముఁ గావించి వేఱొక బంగరుపల్యంకికపై నాతనిఁ గూర్చుండఁబెట్టి వామ పార్శ్వమున గురుదేవునికి ప్రక్కగా నడిపించెను. దారిలోనే యుద్ధము సిద్ధమగునని సైనికులను హెచ్చరించి వారిని యుద్ధసన్నద్ధులఁ గావించెను.

గోవిందరాజు ప్రోలుఁడు తన రాజ్యసరిహద్దు సమీపించినాఁడని తెలిసి దిక్కుతోచక ఉదయరాజును బిలిపించి కర్తవ్యమడిగెను. ప్రోలుని

శరణమర్థించుట వినా శరణ్యాముతేదని యుదయుడు చెప్పినమాట యుక్త మని తెలిసియు, దురభిమానమున గోవిందరాజు వినలేదు. ప్రజాసైన్యము తనకు యుద్ధమున సాయపడుటకై నేలకొండపల్లి రాపలసినదిగా గ్రామములకు వార్తలనంప నాతఁడు తలఁచెను. ఉదయరాజది తెలిసికొని ప్రజలు, ప్రభువు నాశనముకాకుండఁ జేయఁదలఁచి యిట్లు పలికెను.

"ప్రోలుఁడు తిన్నగా రాజధానియగు నేలకొండపల్లెపైనిఁ బడఁడు. ప్రజల భీభత్సపరచుటకై మూఁడుప్రక్కలనుండి రాజ్యముపైఁబడి గ్రామముల నెక్కడికక్కడ వశపఱచుకొనును. అట్లు వచ్చునెడల ప్రోలు నెదిరించుటకు గ్రామములలో సైన్యము లేకపోయిననెట్లు? రాజ్యమంతయు వశపడినపిదప రాజధానిలో నెంతసైన్యమును సమీకరించుకొని కూర్చున్న నేమగును? కాన గ్రామసైన్యము లెచ్చటవచ్చటనే శత్రుసేనల నెదిరించుటకు సిద్ధపడియుండునది యని హెచ్చరించుట యుక్తము. నీవు మూల సైన్యముతో ప్రోలుఁడు నీసరిహద్దుచేరి గ్రామములపైనిఁ బడకుండఁగ దారిలోనే యెదిరించుటమంచిది. నీసైన్యమల్పమని సందేహింపనవసరములేదు. ఒకవేళ నీవు నీసైన్యముచాలకప్రోలుని జయించుట సాధ్యము కాదనుకొన్నప్పుడు దురభిమానమునకుఁ దెగి రణరంగమున విక్రమింప సాహసింపవలదు. బంధితుఁడవైననుసరే ప్రాణములఁ దక్కించుకొనుటయే యుత్తమము. ఏలనన ప్రోలుఁడు నిన్ను బంధించి నీరాజ్యములో నడుగు పెట్టినచో నీబంధమునఁగలిగిన కోపావేశము ప్రజలలో కట్టదెగి ప్రవహింపఁగలదు. సైనికశిక్షణనందియున్న ప్రజ లెక్కడికక్కడ ప్రతియంగుళముమేరను ప్రోలు నెదుర్కొనఁగలరు. అన్నిగ్రామములలోను ప్రజలావేశముతో నెదిర్చినప్పుడు ప్రోలునికి విజయముదక్కుట యసంభవము. ప్రజావశీకరణములేనిదే యాతఁడు రాజ్యమునెప్పటికిని చేఁజిక్కించుకొనఁడు. తైలపదేవుని ప్రోలుఁడు చేఁజిక్కినను బంధింపక విడిచినకారణమదేయని నేను చారులవలనఁ దెలిసికొంటిని. ప్రజలతోడి యుద్ధములోఁ బ్రోలుఁడు

తెగటారెనా! మంచిది. లేక విడిచిపోయెనా ప్రజలు నిన్ను నీరాజ్యమున తిరిగి నిలుపుకొనెదరు. కావున ప్రాణము రక్షించుకొనియుండుట లెస్స. ఇది రాజనీతివిజ్ఞులతోఁగూడిన యుపాయమని నాకుఁ దోచుచున్నది. ఆపైని నీచిత్తము" అని యుదయుఁడు కర్తవ్యము నుపదేశించెను.

కర్తవ్యమూఢుఁడై యున్న గోవిందరాజునకు ఉదయరాజు చెప్పిన మాటలునచ్చినవి. అతఁడు ప్రతిగ్రామమునకు ప్రోలుని సైన్యము మీదపడిన నెక్కడికక్కడ నెదిరింపవలసినదిగా ప్రజాసైన్యముల కాజ్ఞలుపంపెను. తాను మూలబలముఁ దీసికొని ప్రోలుఁడు తన సరిహద్దుపైనిఁ గాలుపెట్టకుండ ఎదురునన్నాహముఁ జేసెను. ఉదయరాజునకుఁగొంతసైన్యమొసఁగి రాజధానీ నగరరక్షణకు నియోగించి సర్వసేనాసమేతుఁడై గోవిందరాజు దారిలో ప్రోలు నెదుర్కొనెను.

మహాజ్వాలాభీలముగనున్న నగ్నిని శలభము లెదిరించినఁ బ్రయోజన మేమున్నది? ఎదురువచ్చు గోవిందరాజు సైన్యమునకు మూఁడు ప్రక్కల ప్రోలుఁడు అర్ధచంద్ర వ్యూహమునుపేర్చి తనసైన్యమును నిలఁబెట్టినాఁడు. గోవిందుని సైన్యము తమ్మెదుర్కొనినంతనే నాల్గవప్రక్కగూడ సైన్యమునునర్చి ప్రోలుఁడాతి,ముఖవ్యూహమును చక్రవ్యూహముగ మార్చినాఁడు. ఎటుఁజూచిన శత్రుసైన్యములే! గోవిందుఁడేమి సేయఁగలఁడు! నిమిషములో గోవిందుని సైన్యము నేలకొఱిఁగిపోయెను.

గోవిందునకు పాఱిపోవుటకుఁగూడ దారిచిక్కలేదు. ఏవైపునకుఁ బారిన నావైపునుండియే శత్రుసైన్యము తన్నెదుర్కొనుచుండెను. ఉదయరాజు చెప్పినటుల తనప్రాణములు దక్కించుకొందమన్నను నాతనికి తెరువు తోచలేదు. తానిఁక చనిపోవుటనిశ్చయము. ప్రోలునిచంపి దానుచచ్చినఁ దనకొకతృప్తి. అది జరుగుటయెట్లు!

తన గండ్రగొడ్డలి పూర్వమెందఱోరాజుల రక్తము లెన్నియోమా చవి చూచినది. అకుంఠిత పరాక్రమ గ్రాసకోత్కృష్ట - ప్రాణిప్రాణ చతురుం డని పేరుమోసిగినవాఁడు తాను. పరాక్రమించి నిలిచి గండ్రగొడ్డలి భుజమున వైచుకొని ఎదురుపడిన సైనికుల తలల నెగ్గమిట్టునేయుచు ప్రోలునిపై గాలించితిరిగినాఁడు గోవిందుఁడు. ప్రోలునియాజ్ఞచే సైనికులు తమచేతికి గోవిందరాజు శిరమందివచ్చినను తెగవేయక తామే తెగిపోవలసి వచ్చుచు న్నది. గోవిందరాజునకుఁ దనచేతిలో సైనికుల తలలు దుల్లిపోవుచుండు టానందమును గల్గించినది. అట్లు చిరవిహారము సలిపిసలిపి యాఁతడలసి పోయినాఁడు. భుజసంధులు పట్టుసడలినవి. చేతిలో గండ్రగొడ్డలి నిలుచుట లేదు, ఇంతలోఁ బ్రోలుఁడు గుఱ్ఱమును వడిగానడిపి గోవిందునిముందు నిలిచెను. పట్టువదలినవ్రేళ్ళతో గోవిందుఁడు ప్రోలునిఁజూచి గండ్రగొడ్డలి నెత్తెను. ప్రోలుఁడాతని సమీపించి మందహాసముసేయుచు శ్రీరాముఁడు పరశురాముని పరశువు నాకర్షించి నిర్వీర్యునిఁజేసినట్లు గండ్రగొడ్డలి పట్టి లాగి దూరమునకు విసరివైచినాఁడు. గోవిందుఁడు చేయునదిలేక విన మ్రుఁడై నిలిచినాఁడు. వెంటనే యిరువురు భటులువచ్చి గోవిందుని చేతు లకు బంగారు సంకెలలు తగిలించి తీసికొనిపోయిరి.

పిమ్మట గోవిందుని బంధనవార్తనువిని ఉదయరాజు ప్రోలరాజునకు స్వాగతమొసఁగి ఆనందముతో రాచనగరునఁ బ్రవేశముగూర్చినాఁడు.

రామేశ్వరదీక్షితులకు బసవనాథమాహేశ్వరులకు ఉదయరాజు పాదాభివందనముసేసి కొన్నాళ్ళచట నివసింపవేఁడుకొనెను. 'నీ నూతన రాజ్యమున తప్పక కొన్నాళ్ళు వసించియే వెళ్ళఁగల' మని దీక్షితులు మందహాసముసేసెను. ఉదయుఁడామాట లర్థముకాక తికమికపడెను. దీక్షితులు ప్రోలరాజును పిలిచి 'ఈ నేలకొండపల్లెసీమకి ఉదయరాజ చోడు నభిషేకించునది' అనియాజ్ఞాపించెను. ప్రోలుఁడు వెంటనే కిరీట మును దెప్పించి చోడోదయరాజుశిరముపై నుంచి తనఖడ్గమునాతనిచేతఁ

బెట్టెను. ఉదయుఁడు 'శివాజ్ఞను బద్ధుఁడను' అని ప్రోలునకు నమస్కరించి 'ఈ సుఖసమయమున నామిత్రుని గోవిందుని బంధనమునుండి విముక్తునిఁజేయ నంగీకరింపవేఁడెదనని యంజలిపట్టి ప్రార్థించెను. ప్రోలరాజు దీక్షితులవారివైపు దృష్టిసారించెను. దీక్షితులవారంత 'ఉదయరాజా! నీమిత్రభావము మాకుమెచ్చుఁగొల్పెనది. నీమాట చెల్లించుటకుఁ గొంత గడువుకావలెను. ఈ రాజ్యమున జైనము తలయెత్తక యణఁగియుండు వరకు గోవిందరాజును విడుచుట ప్రమాదకరము. నీవు ఎంతత్వరగా వీరశైవమును వ్యాప్తిఁజేసి ప్రజలలో నలజడితగ్గించి ప్రజామనస్సును వశీకరింపఁజేసికొందువో అంతత్వరలో నీమిత్రుఁడు బంధవిముక్తుఁడు కాఁగలఁడు. అంతవరకాతఁడు అనుమకొండలో మాయొద్దనే బంధింపఁబడియుండును. ఆతనికి రాజోపచారములు నడుచును. నీవేమియు బాధపడకు' మనిపలికెను. ఉదయచోడుఁడు సర్వాజ్ఞను శిరసావహించెను.

పిమ్మట ప్రోలరాజు సైన్యము అనుమకొండకుఁ దరలింపఁదలఁచెను. దీక్షితులవారు కొన్నాళ్ళు ఉదయుని ఆతిథ్యగౌరవమంది పిమ్మట అనుమకొండఁజేరుకొందమనిరి. ఉదయరాజుకూడ ప్రోలుని నేలకొండపల్లెలోఁ గొన్నాళ్ళు విశ్రమించి మఱివెళ్ళవలసినదిగా ప్రతిమాలుకొనెను. ఉదయుని కోర్కె ప్రోలరాజంగీకరించుటవలన జైనమతస్థులగు ప్రజలు సైన్యభయమున జైనమువిడిచి వీరశైవమున సులభముగాఁ జేరిపోదురని, పిమ్మట ఉదయునకు రాజ్యపాలనము సులభము కాఁగలదని దీక్షితులవారు వివరించిచెప్పి ప్రోలరాజునుకూడ నచట తమతోఁగొన్నాళ్ళు ససైన్యముగనుండుట కంగీకరింపఁజేసిరి.

ఇరువదియొకటవ ప్రకరణము.

# గుండరాజును చంపుట.

ఒకనాఁడు వినోదసల్లాపములో నుదయరాజు తమ పొరుగుననున్న మంత్రకూటపు రాజగు గుండరాజు ఎవ్వరికినిఁ దెలియకుండ రహస్యముగ సైన్యమాయత్తపఱచినాఁడనియు, ఆతఁ డోరుగంటి వెలసిన స్వర్ణవేదిలింగమును తరలించుకొనిపోయి బంగారపుకోట కట్టుకొనవలెనని యాశయమును కల్గియుండెననియు, గోవిందరాజు సాయము తనకు లభించునని యున్నాళ్ళు కనిపెట్టుకొని యుండెననియు, నిప్పుడు గోవిందరాజు పరాజయముతో నాతఁడు శోకముడుచుకొని కూర్చుండెననియు ప్రోలరాజునకుఁ దెలిపెను. గుండరాజు స్వర్ణవేదిలింగమును దరలించు నాశ నొందియున్నాఁడని తెలిసినంతనే ప్రోలున కరికాలిమంట నెత్తికెక్కినది. గుండరాజుసంగతి చూచియే యనుమకొండకుఁ జేరుకొనవలెనని యాతఁడు దీక్షపట్టెను. శిష్యుని దీక్షను రామేశ్వరదీక్షితులు మఱింత ప్రోత్సహించెను.

ప్రోలుని సైనికులు రెండుయుద్ధములలో క్షతగాత్రులైరి. గజాశ్వ దళములు క్షీణించినవి. అయినను సైన్యములో నుత్సాహబల మినుమడించియేయున్నది, జయముపై జయము వారికష్టములను లెక్కకురానీయ లేదు. ఎందుకైన మంచిదని కామచమూపతిని మూలసైన్యమునుండి కొంత మంత్రకూటమునకు వెంటఁబెట్టుకొనిరమ్మని ప్రోలుఁడు అనుమకొండకు వార్తనంపి సైన్యముతో తాను ముందుగా యుద్ధమునకై మంత్రకూటమునకు బయలుదేఱెను

మంత్రకూటాధీశ్వరుఁడగు గుండరాజును, మిగిలినవారివలెనే జైన యతుల మంత్రాంగమునకు మ్రొగ్గినాఁడు. ప్రోలునిబంధించు పథకములకై యెదురుచూచిచూచి నిస్పృహపడినాఁడు. జైనుల మంత్రాంగముతో గోవిందరాజాదుల సాయమును తనకుఁగల్గునని యాతఁడాశించెను. పొరుగు

రాజగు గోవిందరాజు బంధితుఁడయ్యెనని తెలియుటతోనే యాతఁడు తన ప్రయత్నము మానుకొనెను.

ప్రోలరాజు సైన్యములు హఠాత్తుగా మంత్రకూటమును జేరుకొన్నవి. గుండరాజు మొదట పాఱిపోవఁదలఁచెను. కాని ప్రోలుని సైన్యము రెండుయుద్ధములలో క్షీణించి యల్పసంఖ్యలోనున్నదని తెలిసికొని తాను సమాయత్తపఱచియుంచిన సైన్యముతో నాతని నెదిరింపవచ్చునను నాశ తళుకుమనుటచే సైన్యమునుదీసికొని యుద్ధమునకుఁ దలపడెను. తానెదురు సనక సైన్యమును వెనుకనుండి యుద్ధమున కుసిగొల్పిపంపెను.

రెండుసైన్యములు వీరవిహారము సల్పినవి. ప్రోలరాజు సైనికుల నుత్సాహపఱచుటలో, సాహసశౌర్యములను ప్రదర్శించుటలో నప్రమత్తుఁడైయుండెను. ఎచ్చటజూచిన నచ్చటే ప్రోలుఁడు గుఱ్ఱమును దుమికించుచు ప్రత్యక్షమగుచుండెను. చేతికందిన శత్రువుల నూచకోఁత కోసివైచెను. శివదేవుఁడు ప్రోలరాజు ప్రక్క నెప్పుడు విడువక అంగరక్షకుఁడై కనిపెట్టుకొనియుండెను. స్వయంభూలింగాపహరణోద్దేశము కలిగిన గుండరాజు సేనపై ప్రోలుఁడు చూపిన తైక్ష్ణ్యము అనిర్వచనీయమైనది. గుండరాజును వెదకిపట్టుకొనుటకై ప్రోలుఁడు శత్రుసైన్యమునంతయు గాలించెను.

గుండరాజుసైన్య మెంతనశించినను తఱుఁగుటలేదు. ఒకవ్యూహము వెనుక నొకవ్యూహముగా గుండరాజు దొంతరవ్యూహముఁదీర్చి ప్రోలుని సేనలను విసివించెను. ప్రోలుఁడాతని వ్యూహరచనానైపుణ్యమున కచ్చెరువడెను. ఎంతగా వ్యూహముల భేదించుకొని ముందుకుపోయినను గుండరాజు ప్రోలుని కంటఁబడనేలేదు. పద్మదళముల నడుమనున్న బొద్దువలె నాతఁడేవ్యూహముమధ్య నెటదాగెనో యని ప్రోలుఁడు ప్రాణముల లక్ష్యపెట్టక యొంటరిగా వ్యూహములు ఛేదించుకొని లోలోపలకుఁ బోయెను.

గుండరాజు తాను కనుమఱుఁగై తన సైన్యమును మెఱయించి ప్రోలునకు దిగ్భ్రాంతికొలుపుచుండెను. సులభముగా గుండరాజును బంధింపవచ్చుననుకొనిన ప్రోలునకు ధైర్యము సన్నగిలెను, కామచమూపతి సైన్యముతో తన్నుఁ ద్వరలోఁ గలిసికొననున్నాఁడని తెలిసినపుడుగాని ప్రోలుని మనసు స్థిమితపడలేదు.

ప్రోలుని సైన్యము తఱఁగిపోవుచు క్షీణబలమగుట గుర్తించి యుత్సాహపడుచున్న గుండరాజునకుఁ గామచమూపతి అనుమకొండనుండి విశేషసైన్యమును వెంటఁబెట్టుకొని వచ్చుచున్నాఁడను వార్త చారులవలన చెవిఁదాకి పిడుగుపడినట్లయినది. ఇఁక తనయాశ వ్యర్థముకాకతప్పదని యాతఁడు బెదరిపోయినాఁడు. తాను పలాయితుఁడగుటకు నిశ్చయించుకొని సైన్యమును యుద్ధభూమినుండి తరలించినాఁడు.

గుండరాజు సైన్యము తిరోగమనముపట్టి తన్నెదిరింపకుండుటచే ప్రోలునకు గుండరాజు నన్వేషించుటకు వీలుచిక్కినది. ఇంతవరకు వ్యూహములను ఛేదించుకొనిపోవునపుడు ప్రోలునిచుట్టు క్రొత్త సైన్యమునిలిచి యుద్ధమునకుఁ దలపడుచుండెడిది. అందుచే నెదిర్చినవారిని విదళించుపని లోనే నిమగ్నుఁడైయుండుటతో ప్రోలునకు గుండరాజు జాడఁదీయఁగుదిరి నదికాదు. ఇప్పుడు శత్రుసేనలు తన కొత్తిడిగల్గించుటలేదు. తానెటఁదిరిగిన తన్ను తప్పించుకొనిపోవుచున్నవేకాని తన గమనమున కడ్డుతగులుటలేదు. ప్రోలరాజు ఉదయరాజుతోఁగలిసి సైన్యమునంతఁ గలయదిరిగినాఁడు, ప్రోలుని దూరముగాఁజూచి గుండరా జొతలు కుంచించుకొని యశ్వముపైఁ ద్వరితగతిని బోవుచుండుటను ఉదయరాజు ప్రోలునకుఁ జూపినాఁడు.

క్షణములో ప్రోలరాజు ధవళాశ్వము వాయువేగము నందుకొన్నది. గుఱ్ఱముకాళ్ళు భూమినానుటే లేదు. ఆకాశములో నెగిరి ప్రోలేంద్రుని యుచ్చైశ్శ్రవము గుండరాజుముందు దుమికినది. ప్రోలునివెనుకనే బాల

శివదేవుఁడు పంచకల్యాణి నురికించినాఁడు. ప్రోలునిగుఱ్ఱము గుండరాజును చేరినంత గుండరాజు గుఱ్ఱమునుండి క్రిందికుఱికి ప్రోలుఁడు తనపైకెత్తిన ఖడ్గము తనమీఁదఁబడకుండ దప్పించుకొనినాఁడు. ప్రోలుఁడాతనిప్రక్కగా గుఱ్ఱమును మోకాళ్ళపైఁ బరుండఁజేసి గుఱ్ఱముమీదనుండియే మొలలోని పచ్చలపిడిబాకు లాగి విసరినాఁడు. వెనుకనుండివచ్చిన బాలశివుఁడు తన గుఱ్ఱము నతివేగముగా ముందునకుఁబోనిచ్చి విసరిన ప్రోలుని ఖడ్గమును గుండరాజు మెడఁజేరకుండనే మధ్యలో నెడమచేత నైపుణ్యముతోఁబిడిబట్టు కొనెను. "రాజా! ఇంతవరకు నేశత్రురాజును చంపియుండని నీకిపుడుమాత్ర మీకళంకమేల?" అని పలుకుచు గుఱ్ఱమునుండి యురికి గుండరాజు ప్రక్క దొరకబుచ్చుకొని ప్రోలుని కాళ్ళపైఁబడునట్లొక్క త్రోపుదోసినాఁడు. ప్రోలరాజు "శివదేవా! ఇతని నాఖడ్గమున కెఱగాకుండఁ గాచితివేల! స్వయంభూలింగాపహరణ యత్నమునకుఁ బ్రాణదండనమునకుఁ దక్కువ శిక్షలేదే!" అనెను. "ప్రభూ! ఇప్పుడు తమచిత్తమువచ్చినట్లే చేయ వచ్చును. మీకు బంధించుట కందిరానందున విసివి ఖడ్గము విసిరియుందు రని భావించి ఖడ్గముఁబట్టితిని. ఇరువుర శత్రువులఁబట్టివిడిచిన మీకీతఁ డును అనుగ్రాహ్యుఁడు కాకపోవునా! యనుకొంటిని. నాతప్పుక్షమింపుఁడు. ఇదిగో! నాఖడ్గమునకిపుడు బలివెట్టుచున్నాను" అని యొరనుండి ఖడ్గము పెరికెను. ప్రోలుఁడు శివదేవుని వారించి 'పోనిమ్ము అగినదెటులను నాగినది. ఇంతలో మునిఁగిపోయినదేమి. తలఁదఱుగుటకంటె యిదే మంచి' దని గుండరాజును దగ్గఱకుఁబిలిచి చిరునగవుతో గడ్డంబును, మీసంబును, దలయు రేవులవాఱఁగొఱిగి విరూపిఁజేసి తప్తాయశ్శలాకతో వాని గుండెపై తమ పతాకచిహ్నమగు ఆదివరాహమును ముద్రించి విడిచివైచెను. బాలశివుఁడు "తలయును మూతియుఁదఱుగుట తలఁదఱు గుటకంటె మెచ్చఁదగును మహాత్మా!" అని విఱగఁబడి నవ్వెను.

గుండరాజు సిగ్గుపడి తలవంచుకొని బ్రతికిబయటపడినందులకే మహాభాగ్యమనుకొని మఱలిపోయెను. బాలశివదేవుఁడును నుదయరాజును తన కృత్యమును మెచ్చుచు తన్ననుసరింపఁ బ్రోలరాజు నేలకొండపల్లి సేరుకొని రామేశ్వరదీక్షితులవారికి సర్వము విన్నవించెను. దీక్షితులవారు గుండరాజును విడిచివేయుట రాజనీతిజ్ఞతకుఁ దగినపనికాదనిరి. 'కళచురి బిజ్జలుని కోరికపై గోవిందరాజును బంధించుటవంటిదికాదిది. ఉదయరాజు కోరికపై గోవిందరాజును విడుచుటవంటిదియుకాదిది. బిజ్జలుఁడును, ఉదయుడును మన వీరశైవమును వ్యాప్తికిఁదెచ్చువారుగాన వారి కోరికలు మన్నించుట మన ప్రయోజనము సాధించుకొనుటేయగును. గుండరా జిపుడు తీవ్రావమానమునకుఁగూడ గుఱియైనాఁడు. కౌటల్యనీతి నెఱిఁగిన రాజు ప్రబలులనెప్పుడు నవమానమునకుఁ బాల్పఱుపఁడు. ఏరాజును నవమానపడి యణఁగియుండుననుట కల్ల. తనకు మంచికాలము వచ్చు వరకు నివురుగప్పిన నిప్పువలెఁ బైకిరాకున్నను నదను పదనుఁ జూచి శత్రు శేషము విజృంభింపకమానదు. రణశేషము, ఋణశేషము, నగ్నిశేషము వలెనే శత్రుశేషమును నుపేక్షించిన గోటఁదీర్చునది గొడ్డంటఁదీర్పవలసి వచ్చునుగదా!' అని దీక్షితులవారు పలుకగా బాలశివదేవుఁడు, ప్రోల రాజునుకూడ స్వకృత్యములందలి లోపమును గుర్తించి తమ చెయిదముల నిందించుకొనిరి.

గురువాక్యములతో ప్రోలరాజు తిరిగి సైన్యమును తోడ్కొని మంత్రకూటముసేరి గుండరాజును మఱలయుద్ధమున కాహ్వానించెను. గుండరాజు ఎంతకును యుద్ధమునకురాలేదు. అతఁడెచటనో రహస్యముగఁ దలదాచుకొనెనని చారులవలనఁ దెలిసికొని ప్రోలుఁడంత అనుమకొండ నుండి సేనలఁగొనివచ్చిన కామచమూపతిని మంత్రకూటము ముట్టడించి వశపఱచుకొని గుండరాజు తలఁదఱిగి స్వయంభూదేవుని ఆలయద్వారము నకుఁ గట్టవలసినదిగా నాజ్ఞాపించి తాను నేలకొండపల్లె చేరుకొనెను.

అటుపిమ్మట ప్రోలరాజు మూఁడుయుద్ధములలోఁ బాల్గొని బహు నష్టపడిన అశ్వగజపదాతిదళములను మఱలించి గురుదేవునితోఁగూడి అనుమకొండనగరమును జేరుకొనెను.

ఇరువదియొకటవ ప్రకరణము.

# వ్య వ సా యా భి వృ ద్ధి.

జైత్రయాత్ర ముగించి అనుమకొండఁ జేరగానే గంగాధరామాత్యుఁడు ప్రముఖులతో ప్రోలరాజున కెదురేగి స్వాగతమొసంగి పురప్రవేశము జరిపించెను. ప్రజ లింటింట రాజునకు నివాళులెత్తి "చలమర్తిగండ" "జగత్కేసరి" బిరుదములతో సత్కరించిరి, ప్రోలరాజు వచ్చుచునే ఓరుగంటిలో దాను ప్రతిష్ఠించిన తమ ఆది కులదేవతయగు 'రేణుకాదేవిని, 'ఏకవీర' యను పేరుతో కాకతమ్మకు సైదోడుగ ప్రతిష్ఠించెను. కాకతి మహాశక్తికెఱఁగి, స్వయంభూదేవుని దర్శించి, యనుమకొండఁ జేరుకొని పద్మాక్షిదేవిని, సిద్ధేశ్వర శ్రీమన్మహాదేవుని పూజించి మ్రొక్కులు సమర్పించెను. విజయోత్సాహమున కాతఁడు కారాగారముల శిక్షల ననుభవించువారినెల్లర విడుదలచేయుట కాజ్ఞలుసేసెను. బేతసదంపతులను, పాఱిపోయి తిరిగి బంధితులైన జినేంద్రస్వామిని, యాతని యనుచరులను మాత్రము విడుచుట యుక్తముకాదని రామేశ్వరదీక్షితులవారు వాదించి చెప్పినారు. కాని ప్రోలరాజు 'ఇంకను జైనులను బంధించుట చేతకానిపని యనిపించును. ఏకార్యములకు వారడ్డువచ్చిరో ఆకార్యము తీరినవెనుక వారిని నిర్బంధములో నింకను నుంచుట అసమర్థుల లక్షణమనిపించును. వీరి విడుదల మనకింక నేహానియుఁ జేయజాలదు' అని గురునకుఁజెప్పి యందఱను విడిపించెను. అనుమకొండప్రాంత రాజులనెల్లర జయించి, ప్రోలరాజు సమీపప్రాంత దిగ్విజయయాత్ర ముగించి అనుమకొండరాజ్యమును స్థాపించెను. ఇంక యావదాంధ్రరాజ్యమునకు రాజు కావలసియున్నది. అందులకై సామ్రాజ్యమును పెంచుటకాతఁడు దూరప్రాంత రాజ్యముల జయింపవలసియున్నది. ఇంటగెలిచి రచ్చగెలువఁదలఁచి ప్రోలుఁడు ముందుపొరుగుననున్న శత్రువులఁ బరిమార్చి బలపడెను. కొంతకాలము విశ్రమించి మహాంధ్రరాజ్య విస్తరణ ప్రయత్నమునకాతఁ

డుత్సాహపడెను. అందులకు వలయు ప్రయత్నములలో నాతఁడు నిమగ్నుఁడయ్యెను.

అనుమకొండనగరమునకు తొల్లి తాను నిర్మించిన శిలాప్రాకారమును మఱింత సుదృఢముగావించెను. సైన్యమున గజబలము పెంచెను. సైనికుల హెచ్చుఁజేసి వారికి నూతనయుద్ధపద్ధతులు నేర్పించెను.

పిమ్మట ప్రోలరాజు ఆహారసమృద్ధిని సాధించి సైనికులకు యుద్ధముల నెన్నాళ్ళకైన సరిపడు నాహారములు నిలువయుంచుటకు తన రాజ్యమంతెల్లెడల వ్యవసాయాభివృద్ధి సాగుటకై కృషి సాగించెను. తనపూర్వులు వ్యవసాయ పాశుపాల్యములతో నెంతగా భూములు సంపాదించి రాజ్యములనెట్లు స్థాపింపఁగల్గినది శ్రీపాదులవారివలనఁ దొల్లి వినియున్నవాఁడగుట నాతనికి కృషిపాశుపాల్యములను తనదేశమున వృద్ధిసేయుట కాసక్తిహెచ్చినది. పొరుగున శత్రువులు లేకుండుటచే రాజ్య సంపద్వృద్ధికరములగు కార్యక్రమములయందు పనిపూనుటకు ప్రోలునకు తగు మనస్థైమిత్యమును జిక్కినది.

వ్యవసాయమునకు ముఖ్యముగఁ గావలసినది నీరు. అపైని పశు సంపద. ఎచ్చటపడిననచ్చట నీరు సమృద్ధిగలభించుట కాతఁడు సప్తర్షి ప్రీతిగ సప్తసంఖ్యలో పెద్దపెద్ద చెఱువులు త్రవ్వించి వరుణప్రతిష్ఠలు జరుపసమకట్టి ముందుగా సముద్రమునకు ప్రతిసృష్టియో యననొప్పు నొక మహాతటాకమును త్రవ్వించెను. తొల్లి తనతాత మొదటిప్రోలరాజు త్రవ్వించిన తటాకమున కాతనిబిరుదమగు 'అరికేసరి' నామము పెట్టఁబడినది కాన తాను త్రవ్వించిన మహాతటాకమునకు 'జగత్కేసరి' యను తన బిరుదునామమును పెట్టవలసినదిగా ప్రజలు ప్రోలుని బలవంతపఱచిరి. తనపేరిటివాఁడగు తన తాత బిరుదమునువలెనే తన బిరుదునామమును శాశ్వతముచేయుపనిపై ప్రజలకు గల మోజును ప్రోలుఁడు కాదనలేక పోయెను. 'జగత్కేసరి తటాకము'న వరుణప్రతిష్ఠ దీక్షితులవారిచే

బ్రహ్మాండముగాఁ గావింపఁబడెను. ఆ ప్రతిష్ఠ శివసప్తాహముతో నారంభ మయినది. రాజ్యము నలుమూలలనుండి శివభక్తులు పెక్కురు, ప్రజలు పెక్కురు వచ్చి మహోత్సాహము వెలువరించిరి.

రామేశ్వరదీక్షితులువారి యాధ్వర్యమున శివసప్తాహము ప్రతి దినము నొక నూతనవిధముగఁ బ్రజల కానందముగొల్పినది. శివభక్తి భక్తులలో పరాకాష్ఠనొందినది. పూజాపురస్కారములు మహోద్యజాయ మానముగ జరిగిపోవుచుండెను. ప్రజలు ప్రోలరాజు విజయయాత్రల పెల్లుగ నభినందించిరి.

నాఁడేడవరోజు, వ్రతసమాప్తిదినము. ప్రజలసమూహము నాఁడు మఱింత పెరిగినది. వివిధగ్రామములనుండి జనులు తండోపతండములుగఁ జూడవచ్చిరి. పశుసంపదభివృద్ధికై ప్రోలరాజు నూటయెనిమిది యాఁబోతు లకు త్రిశూలచిహ్నముల ముద్రించి విడుచుటకుఁ దలపెట్టెను.

నాఁడు వృషోత్సర్జనామహోత్సవదినము. చక్కని నడివయస్సులోని తెల్లని పాలవన్నె యాఁబోతులు నూటయెనిమిది పూలదండలచే నలంక రింపబడినవి. వెండిగొరిజలతో, బంగారు శృంగములతో, చిఱుగంటల మాలలతో, చిత్రవర్ణ వస్త్రములతో చక్కగ నలంకరించిన వృషభములను ఒక్కొక్కటిగ తప్తశూలచిహ్నములుంచి ప్రోలరాజు దీక్షితులవారియొద్దకుఁ గొనిపోవ దీక్షితులవారు వీపుచఱచి నందీశస్తుతిశ్లోకములు పఠించుచు వానిని స్వేచ్ఛాసంచారమునకై విడచుచుండెను. వెన్నునిమిరి రామేశ్వర దీక్షితులు వృషభముప్రక్క నిలిచినపుడు సాక్షాత్తు పరమశివుఁడు నంది వాహనముప్రక్క నిలఁబడినట్లు చూపఱకు గొచరించెను. వారాప్రత్యక్ష శివదైవమును జూచి దూరమునుండియే చేయెత్తి నమస్కరించి స్తుతించి భక్తిపరవశులైరి. వృషోత్సర్జన కార్యము ముగించినపిమ్మట నట సమావేశ పడిన వేలాదిప్రజల నుద్దేశించి ప్రోలరాజిట్లుపన్యసించెను.

"శివభక్తులారా! నేఁటితో వరుణప్రతిష్ఠావ్రతము సమాప్తియగును. శివునకుఁ జేహార్చు గంగామతల్లియే జగత్కేసరితటాకము. శివదేవుని వాహన ప్రతిరూపములే యుత్సర్జితములైన యీ వృషభములు. జగత్కేసరి తటాకమునుండి పెక్కు కాలువలు త్రవ్వుకొని ప్రతిగ్రామమునకు నీరు సమృద్ధిగ సస్యములఁ బండించుటకుఁ బ్రవహింపఁజేసికొనవచ్చును. ఇఁక మీరు మీమీ గ్రామక్షేత్రముల సస్యములను సమృద్ధిగఁ బండించుకొనుఁడు. పశు సంపదభివృద్ధికై నేఁడు దీక్షితులవారు విడిచిన నూటయెనిమిది వృషభముల నూటయెనిమిది సీమలవారికిఁ బంపఁగలము. వృషభముల నందికొనిన సీమాధికారులు ఒక్కొక్కరెనిమిదవంతున వృషభములఁ గ్రొత్తగా నచ్చుఁబోసి మహాగ్రామములవారి కందింపఁగలరు, వాని నందుకొన్నవారు తిరిగి యెనిమిదవంతున తప్తశూలముద్రితములగు వృషభముల పల్లెగ్రామముల కెన్మిదింటికిఁ బంపవలెను. పల్లెలవారు తిరిగి ఒక్కొక వృషభమును పాలెములవారి కందింపవలెను. ఈపనివలన మంచి పశూత్పత్తి ప్రతిచోటునను జరిగింపవచ్చును. చిన్న పెద్దలేకుండ ప్రతిగ్రామమున నీశ్వరవాహనము పూజింపఁబడవలెను. బసవేశ్వరారాధనమే మనకు భుక్తి ముక్తిప్రదము. బసవనాథుని సేవవలననే శివునకు మనపై ననుగ్రహము పుట్టుకొనివచ్చును. బసవనాథుఁడు కృషికర్మకు మూలదైవము. ఆతఁడు లేనిదే కర్షకవృత్తియేలేదు.

కర్షకవృత్తి శివప్రీతికరము. కృషిధర్మము మన జీవనవ్యాపారము. శివభగవానుని యాకృతివిశేషము మన జీవనవ్యాపారమును స్పష్టపరచుచున్నది. మనము కృషిధర్మపరులము కావలెను. శివభగవానుని ఆకారచేష్టావిశేషములు మన కాదర్శములు.

లోకులకందఱకుఁ బ్రాణాధార మన్నముగదా! అన్నముచేఁ బ్రాణమునిల్చి మనసునకు స్థితి యేర్పడును, మనసువలన జ్ఞానము సాధింపనగును. జ్ఞానమువలన శివసాయుజ్యము నందఁగలము. ఇంతకు

నన్నము మూలము. కనుక అన్నమే భగవత్స్వరూపముగఁ బ్రవచింపఁ బడెను.

అన్నము సస్యమువలన లభించును. వృషభములచే భూమిని దున్నించి జలాధారమునఁ గృషికులు సస్యములను బండించుచున్నారు. మన కన్నాధారమగు వృత్తి కృషి. కృషికునకు కలవు కాలకములులేవు. కర్షకుఁడు తాను రాత్రియుఁ బగలును శ్రమించి జుట్టు జడలుగట్ట, మెడలు బూడిదప్రుంగఁ, బాములు మొదలగు విషజంతువులతోఁ గలిసి బయళ్ళలో విహరించుచున్నాఁడు. తాను గష్టించి యితరులకు నన్నముఁ బెట్టుచున్నాఁడు. ఇట్టి త్యాగమూర్తిని శివమూర్తికాదనుట యెట్లు! కర్షక మూర్తియే శివమూర్తి. జీవనాధారమగు కృషివృత్తికి జలమెంత ప్రాధాన్యమో తెల్పుటకే శివుఁడు తలను గంగనుదాల్చినాఁడు. కృషికర్మకు భూమి ముమ్మారు నినుపకొఱ్ఱుతో దున్నుట సూచించుటకై ముమ్మొన వాలు ధరించినాఁడు. కృషికునకున్నతస్థితి నిచ్చుదానినిగా సూచించుటకై వృషభమును తన్ను మోసికొనిపోవు వాహనముగఁ జేసికొన్నాఁడు. కృషివిహారరంగములను సూచించుటకో యన నగరములఁగాక కొండలను, బయళ్ళను తనకు విహారభూములుగఁ జేసికొన్నాఁడు. జలము, వృషభము, ఖననసాధనము నీ మూఁడునున్న నేప్రదేశములైన బంగారు పండింప వచ్చుననుటను దెలుపుటకే శివమూర్తిలో నీమూఁడును ప్రదర్శింపఁబడినవి. జడలుగట్టినతలతో, తోలుగట్టిన మొలతో, బూడిద సలముకొని యాశ్రితుల కోరికలదీర్చుచున్నారు. శివమూర్తి, కర్షకమూర్తియు" అని వచించినాఁడు.

ప్రోలుని యుపన్యాసము కృషికర్మపరులలో దైవభావము నావేశింపఁజేసి యానందముబికించినది. దీక్షితుల వారికి, ప్రోలరాజు వ్యవసాయ రంగమును వృద్ధిచేయుటకు శివభక్తులకు శివమూర్తిని కర్షకమూర్తిగా సృష్టించి యుత్సాహపఱచినవిధము మిక్కిలి మెచ్చుగొల్పినది. తాను తలపెట్టినది శివకార్యముగ భావించి రాజు శివసంకల్పుఁడై నందుల

కొంతఁడానందపడెను. ప్రజలు ప్రోలరాజుయొక్క మహోపన్యాసమునందు కొని కృషికర్మలో శివప్రీతి సాధింపఁగలమను నుత్సాహమును నిలు వరించుకొని స్వగ్రామములకుఁ జేరుకొనిరి.

దీక్షితులవారి యనుమతితో కౌటలీయార్థశాస్త్రము ననుసరించి ప్రోలరాజు రాజ్యపాలనముఁ గావించెను. యోగ్యతఁజూచి ప్రతిగ్రామమున కొకరెడ్డిని (గ్రామమునసబు) గౌరవాధికారిగా నిలిపి గ్రామాధికారమాతని చేతనుంచెను. గ్రామస్వామికి ప్రతిగ్రామమునందు కొందరు గ్రామవృద్ధు లతో నొక పరిషత్తు తోడ్పడునట్లుచేసెను. గ్రామములో సేతుబంధనము లొనర్చుట, వ్యవసాయాభివృద్ధి సాధించుట, భగ్నములగు దేవాయతన ములు బాగుచేయించుట, ఉత్సవప్రదర్శనములు గావించుట, వివాదములు పరిష్కరించుటయు నీ పరిషత్తుచేయుపని. ప్రతిగ్రామములోను స్థానికుఁడు (కరణము), జంఘాలికుఁడు (సమాచారములను దూరదేశముల కందిం చువాఁడు), చికిత్సకుఁడు (వైద్యుఁడు) ననువారిని నిలిపి వారికి పన్ను బందులులేకుండ భూములొసంగెను. గ్రామరక్షణకు వీరభద్రులు, తలా రులు నిలుపఁబడిరి.

ప్రతిగ్రామమున వ్యవసాయ మభివృద్ధిజెందుటకు సర్వవిధముల శ్రద్ధవహింపఁబడినది. తనరాజ్యమందెల్లెడల చెఱువులు కుంటలు త్రవ్విం చుటకు సామంతులకు, నధికారులకు పరిషత్తులకు నధికారములొసంగఁ బడినవి. సప్తసంతానములలో శ్రేష్ఠమగు తటాక వరుణప్రతిష్ఠజరిపి తమ నామములు శాశ్వతపఱచుకొనుటకు జగత్కేసరి తటాకముతో ప్రజలకు ప్రోత్సాహమందింపఁబడినది. భూములకు కొలఁతలువేయించి పన్నుల నేర్పాటుచేయుటకు అధికారులు నియమింపఁబడిరి. కృతక్షేత్రములు (నీటి వసరు తీర్పుఱచి సాగుబడియగు భూములు) పన్నులుగట్టి పండించుకొను కొనుటకు గ్రామప్రజల కీయఁబడినవి. కృషిచేయనివారినుండి భూములు తిరిగి లాగుకొనుటకు శాసనములుచేయఁబడినవి. కర్షకుల లోపమువలన

కృషిఫలము తగ్గినచో ఫలహానికి సమముగా జుల్మానా విధించుటకు శిక్షలు నిర్ణయింపఁబడినవి.

గ్రామస్థులందరు నానకట్టలు తామే నిర్మించుకొనవలెనని, గ్రామస్థులింటివంతుగ మనుష్యులువచ్చి కలిసి యుమ్మడిగఁ బని నిర్వర్తించుకొనవలెనని, యెవండేనిఁ బనిసేయుటకు రాఁజాలనిచోఁ దన యెద్దులను సేవకులను తోడుపంపవలెనని కర్షకప్రజలకు నియమములు విధింపఁబడినవి.

కృషితంత్ర గుల్మవృక్షాయుర్వేద శాస్త్రజ్ఞులను సీతాధ్యక్షులనుగా (Superintendents of Agricultural department) నిలిపి కాలాతిక్రమము గాకుండ బీజములఁ జల్లించి కృషికర్మపరులను హెచ్చరింపఁజేసెను. తటాకములనుండి వాయుయంత్రములయొక్కయు, వృషభములయొక్కయు సహాయముచేత సంపాదింపఁబడిన నీటివలన ఫలించు కేదార ఆరామషండవాటముల సస్యవర్ణముల ననుసరించి పన్నుపుచ్చుకొనుటకు నిర్ణయములసేసెను. వ్యవసాయమునకై నీటిని గూడలువేసి చేతితో తీసికొనిపోవువారినుండియు ఏతములమూలమునఁ దీసికొనిపోవువారినుండియుఁ దోడిన నీటి హెచ్చుతగ్గుల ననుసరించి పన్నులు పుచ్చుకొనుటకు నిర్ణయింపఁబడెను. తూములనుండితప్ప మఱియొకచోటినుండి చెఱువులలోనికి నీరు ప్రవహింపఁజేయువారికిని, దూములనుండి నీటిని నిరోధించినవారికిని దండనములు నిర్ణయింపఁబడెను. గవాధ్యక్షులకు (Superintendents of Cows etc) నిలిపి పశువులను చంపినవారికి, చంపించినవారికి, హరించినవారికి, హరింపఁజేసినవారికి శిక్షలు విధించుటకును, మంచి పశుగణము వృద్ధిసేయుటకును నేర్పాటులు జరిపించెను.

వ్యవసాయ పాశుపాల్యముల విషయమై ప్రోలరాజు మిక్కిలి శ్రద్ధవహించి రాజ్యమున నెల్లెడలఁ బ్రజలు వలసినంత ఆహారసమృద్ధితో సుభిక్షముగ జీవించునట్లుసేసెను.

స్వయంభూలింగముపైని గుండరాజువలెనే యింకను కొందఱు శత్రువులు కన్నువేసి యపహరింప యత్నించుచున్నవార్త వేగులవాండ్ర వలనఁ దెలిసి ప్రోలరాజు స్వయంభూదేవాలయ సంరక్షణము నతిశ్రద్ధగా జరిపింప తద్రక్షకుఁడుగనున్న తన కుమారుఁడగు రుద్రదేవునకు హెచ్చరిక లందించెను. రుద్రదేవుఁడు స్పర్శవేదిలింగముసన్నిధినే యుండుచు రాత్రింబగళ్ళు కాపలాకాయుటకును, తానెవరో ముందుగాఁ దెలుపకుండ నపరిచితు డెవఁడటకు వచ్చిన మఱి ప్రశ్నింపకుండ ఖడ్గమున వానిశిరము స్వయంభూదేవునికి బలివెట్టుటకును కఠినియమముల నందించెను. కామ చమూపతి యుద్ధమునందుఁ జంపితెచ్చిన గుండరాజు తలను స్వయంభూ దేవాలయమువాకిట గుమ్మమునకుఁ గట్టించి శత్రువులకు భీభత్సముఁ గల్గించెను. పిమ్మట ఉదయరాజు కోరికపై గోవిందరాజునకు బంధవిముక్తి సేసెను. ఎన్నాళ్ళకైన సైన్యమునకు వలయు నాహారపదార్థములు కోటలో నిలువ సేయించెను.

ఇట్లు వ్యవసాయరంగములం దపరిమితాభివృద్ధి సాధించుటేకాక ప్రోలరాజు శత్రునిర్మూలనమునకును నమితమగు శ్రద్ధవహించెను. అక్కడక్కడ జైనమతావేశముతలకెక్కి తిరుగుబాటుచేసిన చిల్లరరాజుల ననేకుల జయించి ప్రజలలో శాంతి నెలయించి యా రాజ్యభాగములు అనుమకొండ కాకతీయరాజ్యమునఁ గలిపివైచి కప్పముఁలేర్పరచి కొన్నిటను సామంతులను నిలిపి, కొన్నిట ప్రతినిధులను నిలిపెను, మఱికొన్నిటిని స్వాధీనముఁజేసి కొనెను. అన్నిటను జంగమహేశ్వరులఁబంపి ప్రజామనస్సు శైవాభిరత మగునట్లు శ్రద్ధవహించెను. అనుమకొండ పరిసరసీమలు చాలవరకుఁ గలిసి కాకతీయ స్వతంత్రరాజ్యవిస్తరణ మారబ్ధమైనందుకుఁ బ్రోలుఁడు కడు సంతసంపడెను. ఇఁక దూరప్రాంతముల గెలిచి మహాంధ్రసామ్రాజ్య సుస్థిర స్థాపనము చేయవలెనను నాకాంక్ష తీర్చుకొనుటకై ప్రయత్నముల నారంభింపఁ బ్రోలరాజు కుతూహలపడెను.

ఇరువది రెండవ ప్రకరణము

# కళ్యాణికి సైన్యములు కదలినవి.

ఇన్నాళ్లనుండి రామేశ్వరదీక్షితులవారి మాటలను తు.చ తప్పకుండఁ బాటించుచువచ్చిన ప్రోలరాజేంద్రుఁడు దిగ్విజయానంతరము దీక్షితులవారి మాట లెక్కసేయకుండుట యెల్లరకు వింతగొల్పినది. వద్దువద్దనినను గురునిమాటలను మన్నింపక జినేంద్రస్వామిని, ఆతని యనుచరులను దేశము దాటించి వదలివేయుటయేగాక బేతిన ప్రెగ్గడను బంధవిముక్తునిఁ జేసి తిరిగి అమాత్యగౌరవము నెఱపుచుండుట వీరమాహేశ్వరాచార వర్త నులకు లోలోపల కోపమురేఁపినది. తాను బలపడునంతవరకు గురు నుప యోగించుకొని ప్రోలరాజిపుడాతనిఁ గాదనుట వారికి కష్టముఁగలిగించి నది. ఇఁకప్రోలుఁడు శైవమువిడిచి జైనమునుద్ధరింపఁ బూనఁడుగదా యను సందేహముఁగూడ వారికపుడపుడు కలుగఁజొచ్చినది. మైలాంబ, బేతనలు తంత్రావాపములిఁక స్వేచ్ఛగనే నడుపుదురని వారికి జడుపు పుట్టినది. రాజగురువులమధ్య మతములు భేదించినచో రాజ్యము నాశముగాక తప్ప దని రాజ్యతంత్రవిజ్ఞులు వాపోయిరి.

ఒకనాఁటి రాత్రి రామేశ్వరదీక్షితులవారు బాలశివదేవునితోఁ దమ నివాస కుటీరమునఁ బరిస్థితులిట్లు చర్చించిరి.

దీక్షి:—శివా! నీవుగ్రహించితివా! విజయయాత్ర ముగిసిన పిమ్మట రాజు మనవాఁడుగాఁ గన్పట్టుటలేదే!

బాల:— విజయమునకుఁ బూర్వము మాత్రము రాజు మనవాఁడుగా నుండెననియే మీరు భావించితిరా!

దీక్షి:— తత్పూర్వమాతఁడు మనమాటఁ గాదనలేదుగదా!

బాల: – మీశిష్యవాత్సల్య మాతనిలోటు గుర్తింపలేక పోయినది. చేఁ జిక్కినను జైనులను వధింపవలదని మమ్ము శాసించిననాఁడే

యాతని యాంతర్యము నాకుఁగన్పట్టినది. మీరును రాజశాసనము ననుసరించి యుండుటచే నేను కిక్కురుమనకుండితిని.

దీక్షి:— అహింసాధర్మమందు రాజునకుఁగల యభిమానముగా మాత్రము దానిని భావించి యానాడు నేను రాజుమాటను కాదనకుంటిని.

బాల:— అహింసా ధర్మాభిమానముకాదది. జైనమతాభిమాన మహింస ముసుగున తలదాచుకొన్నది. ఇప్పుడది యదనుచూచుకొని తల యెత్తినది. మీరాతనికి లోఁబడిరికాని యాతఁడు మీకు లోబడిన దెప్పుడునులేదు. రాజ్యప్రాప్తికి మాత్ర మాతఁడు మిమ్మనుస రించినాఁడు.

దీక్షి:— మనము మతవ్యాప్తి కాతనిఁ జేపట్టక తప్పదుకదా!

బాల:— నిజమగు మతాభిమానములేక రాజ్యప్రాప్తికిమాత్రము మత వ్యాప్తిని దలపెట్టిన రాజువలన మన ప్రయోజనము శాశ్వతముగ సాధింపఁబడునా! ఒకరు రాజ్యముకొఱకు మతమును, ఒకరు మతముకొఱకు రాజ్యమును చేపట్టిరి. రాజును గురువును భేదించి నపుడు రాజ్యమునకో మతమునకో నాశము తప్పదు.

దీక్షి:— శివా! నీవు చెప్పినది సత్యము. ఈతని తండ్రి బేతరాజుకూడ నన్ను కొన్నాళ్లుపయోగించుకొని పిమ్మట నామాట నుల్లంఘించి నాఁడు. ఇప్పుడీతఁడు నట్లే చేయుచున్నాఁడు. ఆతండ్రి కొడుకుఁ గాదా యితఁడు!

బాల:— రాజనీతి విజ్ఞతలో శిష్యుఁడు గురువునుమించి పోయినాఁడు. మతము కొఱకే రాజ్యముఁ బాలించు రాజుకావలెను మనకు.

దీక్షి:— శివా! చక్కనిమాట చెప్పితివి. ఇప్పుడు మనమేమిచేయఁదగి నది! అట్టిరాజు మనకెవరు లభింపఁగలఁడు? ప్రోలరాజును దింపి

మఱియెవ్వరి నాప్రదేశమున నిల్పనగును? మనకు మార్గమేది? కలచుఱి బిజ్జలుఁడు శైవమతమునకుఁ దగినరాజగునేమో!

బాల:— గురుదేవా! తొందరపడకుఁడు. శివానుగ్రహమున్న మార్గ మదియే యేర్పడును. బిజ్జలునిమాత్రము నమ్ముటెట్లు! అతఁడును మొదటనుండి జైనాభిమానియే. తైలపుని రాజ్యమును హస్తగతము చేసికొనుటకే మీకు శిష్యుఁడై ప్రస్తుతము మీ యాజ్ఞలు పాలించుచున్నాఁడు. ఎప్పుడెట్లు తిరుగునో కని పెట్టిచూచి మఱినమ్మవలెను. ఒకవేళ నాతఁడింతకన్న నమ్మఁదగినవాఁడైనను ఈతని రాజ్యము నాతనికిఁగట్టఁబెట్టుటంత సులభమేనా!

దీక్షి:— సులభమునుకాదు. మాటవరస కట్లంటినిగాని నాకు ప్రోలుని నాశమునకు మఱియొకనిఁ బ్రోత్సహింప నిష్టము కాదుసుమా!

బాల:— ఏలయిష్టమగును! మీశిష్యవాత్సల్యమే యట్టిది. అందును వంశపరంపరాగతమగు గురుత్వము మీది. ఈనాఁడు ఆప్రేమ బంధమును తెంపుకొనుట మాటలా!

దీక్షి:— కాదుశివా! విషవృక్షమైనను పెంచిన దానిని స్వయముగ ఛేదించుట అసాంప్రతముగదా! మఱి రుద్రుని వర్తనమును నీ వెపుడైనఁబరిశీలించితివా! ఆతనిని రాజ్యాధిపతిని జేసిననెట్లుండును!

బాల:— మంచిమాట సెలవిచ్చితిరి. బిజ్జలునికంటె రుద్రుఁడు నూరురెట్లు మెఱుఁగు. రుద్రుఁడు స్వయంభూదేవ సేవాపరతంత్రుఁడై నిజమగు వీరమాహేశ్వరాచారము నడుపుచున్నాఁడు. ఆపైని మీపుత్రుఁడు అజితేంద్రుఁడన్న నాతనికిఁ బ్రాణము. వారిరువురశైవమతాభిమానము తిరుగులేనిది. తండ్రినిదింపి కుమారునకు రాజ్యముకట్టఁబెట్టుటలో మీ శిష్యవాత్సల్యమునకు నాఘాతమును కలుగదు. ఈపని

యెంత త్వరలో జరిగించిన సంతసముంచిది. ఇన్నాళ్ళనుండి తండ్రి కొడుకులు విడివడియుండుటవలన మంచికే వచ్చినది. లేకున్న తండ్రిగుణములు కొడుకు కందిపుచ్చుకొనియేయుండును.

దీక్షి:— మొదటినుండి తండ్రికొడుకులు వేఱుపడుటకు కారణమున్న దైవమే కల్పించుట వీరశైవమతము మనుగడను శాశ్వతపఱచుటకై యైయుండునేమో !

బాల:— అదేమి ! దైవప్రతిబంధకమునని వారు వేర్పడిరా? అదెట్లు? ప్రోలుడు మీరేదో విడదీసి తమ్మిరువురను గలియజేయకున్నారని తలచుగా ననుచుండునే ? అతనికి బుత్రునిపై వాత్సల్యప్రేమ గట్టుతెగి ప్రవహించుచున్నది. ఏమైనను వారిరువుర కలయిక యొకమునుదుగూడ జరుగరాదు.

దీక్షి:— శివానుగ్రహమున్న నదియు జరుగదు. వారిరువుర విడదీసిన కారణము ప్రోలుని మరణమునుండి కాపాడుటకే. అతడు మాత్రమది యెఱుగడు. ఆరహస్యము తరువాత బయలుపఱచెదను. నీవు ప్రతిక్షణము ప్రోలుని కనిపెట్టుకొనియుండుము. ఇంక మనమాట లక్ష్యపెట్టక యాతడు పుత్రప్రేమ విరిసి నాకుం జెప్పకయే రుద్రుని కలిసికొనవచ్చును. నీవుమాత్రము ప్రోలు నేదోవిధమున ననుసరించియేయుండి యాతని ప్రాణములను కాపాడుటలో నప్రమత్తుడవై యుండవలెను.

బాల:— ప్రోలునకు బుత్రునివలనం బ్రాణాపాయమున్నదా! నాకేమియు బోధపడుటలేదే ! పుత్రునివలననే యాతడు మడిసిన మనపనికది మఱింత మంచిదిగదా! తండ్రినిదించి కొడుకును రాజుచేసిన తిరిగి వారిరువురు కలియకుండం జూడవలసినపని మనకుం దప్పిపోవునుగదా !

దీక్షి:— శివా ! అట్లుకాదు. ప్రోలుని ప్రాణమెప్పుడును రక్షించుచునే మనకార్యము నెఱవేర్చుకొనవలెను. ఈవిషయము నింక విస్తరింపఁజేయక నాయాజ్ఞ పాలింపుము.

బాల:— గుర్వాజ్ఞ శిరసావహించుచున్నాను. మీ ప్రోలరాజునకు నాకంఠమున జీవముండగా రుద్రునివలన నపాయమురాదు, నమ్ముఁడు.

గురుశిష్యు లిట్లు సంభాషణ జరుపుచుండ ద్వారపాలకుఁడేతెంచి యెవరో జంగమపరమేశ్వరులు వచ్చి దర్శన మపేక్షించుచున్నారని తెలిపెను. గురుశిష్యు లిరువురును నెవరావచ్చినవారని యెంత యూహించియు నిర్ణయించుకొనలేకపోయిరి. 'వెంటనే ప్రవేశపెట్టునది' యని దీక్షితులువారాజ్ఞాపించిరి. ద్వారపాలకునివెంట వీరభద్రమాహేశ్వరులు ప్రవేశించుచునే గురుపాదములనుబట్టి సాష్టాంగప్రణామముఁ గావించెను. గురువు శిష్యుని లేవనెత్తి గాఢాలింగనము చేసికొనెను. కొన్నిక్షణములు మౌనముతోఁ గాలముగడచినది. పిమ్మట నిట్లు సంభాషణ మారంభమైనది.

దీక్షి:— వీరభద్రా ! ఎచ్చటనుండి యాగమనము ?

వీర:— ఎచ్చటనుండియగును ! నన్ను కల్యాణిలో బిజ్జలరాయనియొద్ద నుంచితిరిగదా !

దీక్షి:— అవునది మఱువలేదు. ఎకాయెకి కల్యాణినుండియే వచ్చితివా ?

వీర:— అవును.

దీక్షి:— ఏమి ? తొందరపనివచ్చినదా ! బిజ్జలుఁడు కుశలమేకదా !

వీర:— బిజ్జలరాయనికి సేమమే. ఆతడిపుడు తైలపుని దండనాథుఁడు గాదు. అతఁడు తైలపునిపైని ప్రజావిప్లవము లేవఁదీసి ప్రత్యక్షముగ వేరై శత్రువైనాఁడు. వీరశైవమతమందుకొన్న ప్రజలకు తైలపదేవుని కార్యక్రమము నచ్చుటలేదు. వారు రాజు నెదిరించుచున్నారు. తైలపుఁడంత ప్రజలపైఁ బ్రబలదండనీతిని ప్రవేశపెట్టి

నాఁడు. ఇటీవలనే యిచటనుండి బంధవిముక్తులైన జైనయతులు కల్యాణిచేరి తైలపుని క్రూరతకు మఱింతగా దోడ్పడి శైవప్రజలను అతిక్రూరముగా హింసింపఁజేయుచున్నారు.

దీక్షి:— ప్రజలాదండనమునకు భయపడి యణఁగి విప్లవోద్యమము విడిచిరా !

వీర:— లేదు. బిజ్జలరాయఁడును, నేనును బ్రజలలో నావేశాగ్నిని రగుల్కొలిపియే యుంటిమి. ఏమైనను ప్రజలపై సైన్యమును బంపి యెచ్చటకచ్చట ప్రతిగ్రామమున దండనీతి బ్రయోగించుచున్నాఁడు తైలపుఁడు. ఆయుధసామగ్రి లేనికారణమునఁ బ్రజ లెంత తెగించియు సైన్యముముందట నిలువలేకున్నారు.

దీక్షి:—ప్రోలుని సైన్యసహాయ మర్థించుటకు నిన్ను బిజ్జలుఁడుపంపినాఁడా?

వీర:— అవును గురుదేవా! ఎంత త్వరితముగ సేనలు కల్యాణి చేరిన నంత ప్రజానాశనము గాకుండును.

అప్పటి కర్ధరాత్రి దాటినది. దీక్షితులువారు వెంటనే బాలశివదేవుని ప్రోలరాజునకు రహస్యాగారమున వీరభద్రమాహేశ్వరులతోఁ గలిసి దర్శనమొసంగుచున్నామని తెలుపునదియని యెఱిగింపఁబంపిరి. పిమ్మట నొకింతసేపు బిజ్జలుని ప్రజోద్యమవివరముల నడిగి తెలిసికొనినపిమ్మట దీక్షితులవారు వీరభద్రమాహేశ్వరులతోఁగలిసి రాజ రహస్యాగారముకుఁ జేరుకొనిరి.

బాలశివదేవునితో రహస్యాగారమున ప్రోలరాజు గురుదేవునకు, వీరభద్రమాహేశ్వరులకు స్వాగతమొసంగి యుచితాసనములఁ గూర్చుండబెట్టెను. కుశలప్రశ్నానంతరము వీరభద్రమాహేశ్వరుఁడు బిజ్జలరాయని సందేశమును రాజునకు వినిపించి సత్వరముగ సైన్యమును బంపవలసినదిగ నర్థించెను.

ప్రోల:— వీరభద్రమాహేశ్వరా ! మీరు మమ్మాదేశింపవలసినదేకాని అర్థించుట కూడదు. ఎంతసైన్యము మీయవసరమునకుఁ గావలసి యున్నది ?

వీర:— ఎంతయని నిర్ణయించి చెప్పఁగలము! ప్రజోద్యమము నానాఁటికి విపరీతపరిస్థితులఁ జిక్కుకొనుచున్నది. ఏగ్రామమునకాగ్రామము తైలపుని సైన్యము నెదుర్కొనవలసియున్నది. రాజ్యము పెద్దది. ఉద్యమము తీవ్రరూపమున నున్నది. ఎంతపంపిన నంతమంచిది. చీటికిమాటికి గబురుపంపి తెప్పించుకొనుటకుఁ దగ్గరకాదుగదా!

దీక్షి:— మనకున్న సైన్యమున మూఁడింట రెండువంతులు పంపినఁ జాలవచ్చును,

ప్రోల:— మనకిప్పుడు లక్ష యెనుబదివేల సైన్యమున్నది. అందు రెండు వంతులు పంపవలసిననెట్లు ? మూఁడవవంతు సైన్యముతో నిచ్చట మనము గడుపుకొనఁగలమా ?

దీక్షి:— గడుపుకొనవలెనుమతి! ప్రస్తుతము శత్రువులపైఁబడు కార్యము తలపెట్టకుండిన గడుపుకొనవచ్చును.

ప్రోలు:— మన మెత్తిపడకపోయిన శత్రువే మనపైఁ బడిననెట్లు ?

దీక్షి:— అట్టిపరిస్థితు లిప్పుడేమున్నవి ? ఒకచో హఠాత్తుగ నేర్పడినను మనము శత్రువును మన బుద్ధిబలముచే విజితునిఁ గావింపలేక పోదుమా !

ప్రోల:— మీ బుద్ధిబలముపై నా కమితవిశ్వాసమున్నది.

దీక్షి:— అవును. బుద్ధిచేత సాధ్యముకానిపని యేది ? అడవిలోని చెవులపోతుచేత సింహ మోడిపోయినది, ఏనుఁగు అంకుశమునకు లొంగిపోవుచున్నది. ప్రబలమైన తమస్సు మినుకుమను దీపముచేఁ

దొలగింపఁబడుచున్నది. నీకువచ్చిన భయములేదు. ముందు బిజ్జలునికార్యము జయప్రదమగునట్లు చూడుము. నేనుండగా నీమీఁద నీగయు వ్రాలఁజాలదు.

ప్రోలు:— మీయాజ్ఞకు బద్ధుఁడను. బిజ్జలునికార్యము కాదది, మనకార్యమే. బిజ్జలుఁడు మనబలముచేత సాధించితెచ్చిన జయము మనదేకదా!

దీక్షి:— కాకేమి! అంచటిపనియు దైవమతవ్యాప్తియేకదా! సందేహింపకుము. బిజ్జలుఁడు తైలపుని జయించుట మన కింతింతనరాని లాభము చేకూర్పఁగలదు. కల్యాణి చాళుక్యు లంతమందినచో నిఁక కాకతీయరాజ్యము పెరుగుదల నాప నెవ్వరికిని శక్యము గాదుగదా!

ప్రోల:— మీసంకల్ప మమోఘము, సందేహించుటలేదు. కాని జగద్దేవుఁ డొకఁడు మనపైఁబడుటకు మాండలికులఁ గూడగట్టుకొనుచున్నాఁడని వేగులవారివలన వినఁబడినది. వానిని మన మెదిరింపవలసినచో సైన్య మెంతయవసరముండునో యని ఆలోచించుచున్నాను.

దీక్షి:—జగద్దేవుని జినేంద్రుఁడు లేవఁదీసినాఁడు. జినేంద్రుని, జైనయతులను వడ ంవర్దనిన, వింటివికాదుగదా! మనచే విడువఁబడిన జైనయతులే కల్యాణిఁ జేరుకొని తైలపదేవునికిఁ బాసటయైనారఁట.

ప్రోల:— అపరాధము క్షమింపుఁడు. బిజ్జలునికి సైన్యము పంపవలసి వచ్చు పరిస్థితు లేర్పడునని నేనూహింపనైతిని. బిజ్జలునికి సైన్యము పంపనవసరములేకున్న జగద్దేవుఁ డెందఱితో నెత్తివచ్చినను మనకు భయములేదు. జగద్దేవుని జయించినపిమ్మట కల్యాణిపైఁ బడవచ్చు ననుకొంటిని ఇప్పుడు రెండుపనులకు నొకేసైన్యము కావలసి వచ్చినదే యని సందేహపడుచున్నాను.

దీక్షి:— ఏమైనఁగానిమ్ము. బిజ్జలరాయఁడు మనలను చిరకాలమునుండి నమ్ముకొనియున్నాఁడు. ఆతనిని మనమే తైలపదేవునిపై నెగఁగొల్పితిమి ఇప్పుడు మనము దిగఁదీసిన మిత్రద్రోహమగును. తైలపుని ప్రతిబంధకము దీఱినంత ద్రోహమొనర్చితిమని మనపైకే బిజ్జలుఁడు విఱుచుకొని పడఁగలఁడు. బిజ్జలుఁడు, తైలపుఁడు ఎవరెవరిని జయించినను పిదప వారు మనపై తెగిపడుట ఖాయము. బిజ్జలుఁడు నేఁటివరకు మనవాఁడు. తైలపుఁడు మనకుఁ నిత్యశత్రువు. ఈ యదనులో బిజ్జలునికి సాయపడకున్న మన కాకతిరాజ్యము మనుగడకే ప్రమాదమని భావించుకొనుము.

ప్రోల:— ప్రజోద్యమము ఒక్కనాటితోఁ దీఱిపోవదు. ఎన్నాళ్లైన దానిఁ బట్టియుంచవచ్చును. కాన ప్రస్తుతమునకు ఎనుఁబదివేలిటనుంచి, మఱి ఎనుఁబదివేల సైన్యమును పంపుదము, ఆపై నవసరము వెంబడిని పంపవచ్చును. ఇది నాయభీష్టము.

దీక్షి:— పోనీ! అట్లేకానిమ్ము. నీకు నామంత్రబలముపైని మునుపటి విశ్వాసము సడలినది.

ప్రోల:— గురుదేవా! అట్లెన్నటికినిగాదు. మీరు కాదన్న నాకు రాజ్యమే లేదు. నా యూహ తెలిపితిని. ఆపైని మీయిష్టమే సాగింతును.

దీక్షి:— పోనిమ్ము. నీయూహనే సాగింతము. త్వరలో సైన్యము కల్యాణికిఁ గదలించుటకు నుత్తరువులొసంగుము.

ప్రోల:—క్షణముకూడ ఆలస్యము జరుగదు. కామచమూపతినిఁ దోడ్కొని వీరభద్రమాహేశ్వరు లుదయముననే సైన్యము నడిపించుకొని పోవచ్చును.

వెంటనే ప్రోలరాజు కామచమూపతిని రప్పించి తెల్లవాఱినంతనే సైన్యమున సగఁబాలు వీరభద్రమాహేశ్వరుల వెంట కల్యాణికిఁ దోడ్కొనిపోయి బిజ్జలరాయని యాజ్ఞలు పాలింపవలసినదిగా నియమించెను.

తరువాత రామేశ్వరదీక్షితులు సాగనంపుచు వీరభద్రమాహేశ్వరునితో "బిజ్జలుఁడు తైలపుని రాజ్యచ్యుతునిఁ జేసినపిమ్మట ప్రోలునకు సామంతుఁడుగా నుండఁబనిలేదు. మైత్రి పాటించుచు స్వతంత్ర రాజుగనే పాలింపవచ్చును. ఈ ప్రోలరాజవలన వీరశైవము వ్యాప్తి చుఱుకుగా జరుగునటులేదు. ప్రోలునిదింపి అతని పుత్రుని ప్రతాపరుద్రదేవుని రాజుగా త్వరలోనే చేయుటకు యత్నపడుచున్నాను. మొదటినుండి రుద్రదేవుని వీరశైవమతవ్యాప్తి కనువగు పరిస్థితులలోఁ బెంచియుండుటచే నాతనిపై నాకు ఆసయున్నది. ఒకవేళ కొడుకుఁగూడ తండ్రినిఁబోలినవాఁడే యగుచో మన వీరశైవమతవ్యాప్తికి బిజ్జలరాయనే ఆధారము చేసికొనవలసివచ్చును. ఏరాజును పూర్తిగా నమ్మవీలులేదు. కాన కాకతీయరాజున కాతని వశ పఱచియుంచుట యిప్పటిలో నంతమంచిదికాదు. బిజ్జలుఁడు, రుద్రుఁడు ఇరువురిలో నెవరు మనకార్యమునకుఁ దోడ్పడిన వానినిఁజేర్చుకొని, రెండవ వానిని త్రోసివేయవచ్చును. కల్యాణిరాజ్యమున వీరశైవప్రచారమున కచిరకాలములోనే పరమశివుఁ డవతరింపఁగలఁడని యేలనో నాయాత్మ ప్రబోధించుచున్నది. శివదేవునికిఁదోడు అచితేంద్రుని కాకతిరాజ్యమున నిలిపి త్వరలోనే నేను ప్రతాపరుద్రుని రాజ్యమున కభిషిక్తునిఁ గావించి కల్యాణికివచ్చి వీరశైవమత ప్రచారమునకు నీతోఁగలియఁగలను" అని రహస్యముగ నెఱింగించెను. మతవ్యాప్తికి గురుదేవుని యూహలు బహు సమంజసముగ నున్నవని వీరభద్రుఁ డానందపడి గురువు నాశీర్వచనముఁ గొని సేనలఁదోడ్కొని కల్యాణికి బయలుదేఱెను.

ఇరువదియూఁడవ ప్రకరణము

# జగద్దేవుఁడు క్షణములో నిర్గతుఁడైనాఁడు.

ప్రోలునిచే బంధవిముక్తిఁ గావింపఁబడిన జినేంద్రస్వామి అనుమకొండ ప్రాంతమున వేములవాడ రాజ్యములను బాలించుచున్న జగద్దేవునిఁ జేరుకొనెను. జినేంద్రుఁడు పాతాళగృహమున వైచిన పథకము ఫలింపకుండఁ జెఱబెట్టఁబడినపుడే మతిసెడి మఱియు బంధనమునుండి పలాయితుఁడై తిరిగి చెఱజిక్కి మఱింత కృంగిపోయెను. ప్రోలుఁడు తన్ను చంపినను తానంత బాధపడకుండును. కాని ఏమిచేయఁగలఁడను నిర్లక్ష్యభావమున తన్ను రాజ్యపుసరిహద్దు దాటించి విడిచిపుచ్చినపుడిఁక నాతనికిఁ జెప్పరాని బాధకలిగినది. తన కనుకూలురగు రాజులందఱు ప్రోలునిచే జితులైరి. తన యనుయాయులగు జైనయతులు మృతులైరి. తాను చేయగలిగినదిలేదని ప్రోలుఁడు తలంచుటలోఁ దప్పేమి! తాను బ్రతికి చేయునదిఁక లేదనిపించినది. నిరశనవ్రతమొనర్చి జైన సాంప్రదాయముననుసరించి ప్రాణత్యాగముసేయుటే తగినదనిపించెను. కాని యాతనికిఁ బ్రోలుని నాశనముఁ గనులారఁ గాంచినఁగాని మంట యాఱునట్లులేదు. అందుచేఁ బ్రోలునిచే జయింపఁబడగా మిగిలిన అనుమకొండ ప్రాంతమునందలి రాజులను బ్రోలునిపై యుద్ధమునకుఁ బురిగొల్పుటకు పునః ప్రయత్న మారంభించినాఁడు. జగద్దేవుఁడు జైనయతుల కాశ్రయమిచ్చియుండిన పూర్వపరిచితుఁడే యగుట జినేంద్రునకుఁ జేరినంతనే స్వాగత వాక్యము పల్కినాఁడు.

ప్రోలుఁడు తైలపదేవునే తఱిమితఱిమి వదలిపెట్టినాఁడు. గోవిందరాజాదు లాతనిముందు నిలువనేలేకపోయిరి; ఇఁక జగద్దేవుఁడు విక్రమించిన నేమగును! ప్రాంతరాజులనందఱను గూడఁగట్టు పథకములఁ

చెత్తునని వెడలిన తమ గురుఁడగు సర్వతోముఖమహావీరుఁడు తిరిగిరానే లేదాయె. అతఁడెంత జైనమతాభిమానియైనను శైవమతవ్యాప్తినిఁ జూచుచు నూరకుండవలసివచ్చినది. ప్రోలుఁడింతవరకు నాతనిపై నెత్తిరాకపోవుటే యదృష్టముగా నాతఁడు భావించుకొనినాఁడు. జగద్దేవుని లోనిపగ పరిస్థితులుసరిలేక ప్రబలలేదుగాని యారను లేదు. ఈసమయమున జినేంద్ర స్వామి యాపనిచెంతఁ జేరుటతో నణఁగిన నిప్పు రాఁజినది.

జగద్దేవుఁడు తన మిత్రులగు మేడరాజును, దొమ్మరాజును, మాండలికులను వేములవాఁడ కాహ్వానించి జినేంద్రస్వామి రాకను వారి కెఱుకపఱచెను. జినేంద్రుఁడు వారినందఱను దన మధురభాషణముల నలరించి వారిలో జైనమతావేశము నెక్కొలిపెను. అందఱును గలిసి ప్రోలునిపైనిఁ బడ సైన్యములను సమాయత్తపఱచుటకు యత్నవంతులఁ గావించెను. జగద్దేవుఁడు నాయకుఁడుగా నందఱు ప్రోలునిపై నొకేసారి విజృంభించుట కాయత్తపడిరి.

దొమ్మరాజు ధర్మపురినుండి గోదావరితీరమందలి భద్రాచలము వరకుఁ గల భూభాగమున కేలిక. జైనమతాభిరతితో జగద్దేవునితో మైత్రి గట్టెను. ఈతఁడు తన రాజ్యమందు ప్రశంసలందుకొన్న ప్రభువగుట పెక్కురు మాండలికులీతని మాటబాటను నడుచుకొనుచుండిరి. దొమ్మరాజు తాను జగద్దేవునకుఁ బ్రోలునిపైఁ బడుటకుఁ దోడుపడుటేకాక తన పలుకుఁబడి నుపయోగించి తన మాండలికులనెల్లరఁ బ్రోలునిపై నెత్తిపడుటకుఁ బురిఁగొల్పెను.

మేడరాజు మాధవవర్మ వంశజుఁడగుట ప్రోలునకు జ్ఞాతివర్గములోనివాఁడు. ఒరంగల్లుప్రాంతమందలి కురువపట్టకును గోదావరికిని మధ్య దేశమున కితఁడధిపతి. తమవంశస్థులందఱు జైనమతస్థులు. ప్రోలుఁడు నిన్నాళ్ళు జైనుఁడైయుండి నేఁడు తమ పూర్వులకు విరుద్ధముగా జైన

మతమును చేపట్టుట యాతని కాగ్రహ కారణమైనది. అందుచే నాఁడు జగద్దేవుఁడు తలపెట్టిన యుద్ధమునకుఁ జోడు కుదిరినాఁడు.

అనుమకొండ ప్రాంతరాజ్యమునకున్న పొలవాసరాజ్యమునకు ముఖ్యపట్టణము మైలగి. మైలగిదేవుఁడు మైలగి రాజధానిగాఁ బాలించు రాజు. మైలగిదేవుఁడు జైనమతావిష్టుఁడగుట జగద్దేవుని యుద్యమమునకు సాయపడ సిద్ధమైనాఁడు. వీరందఱిని జినేంద్రస్వామి జైనాభిమానమను త్రాట గుచ్చినాఁడు. అందఱను గలిపి యనుమకొండ ముట్టడి జరిపించుటకాతఁడు సర్వశక్తులఁ బ్రయత్నములు సలిపెను. కొందఱు జైన యతులను గల్యాణికిఁ బంపి యచ్చటనుండి వార్తలు దెలిసికొనుచు తైలపుని తోడ్పాటుఁగూడఁ దమకు లభించుటకు వేచియుండెను. అనుమకొండరాజ్య రహస్యపరిస్థితు లెప్పటికప్పుడు బేతనప్రగ్గడనుండి తన కందుచుండుటకు శైవవేషధారులగు జైనయతుల నేర్పరచుకొనెను.

తైలపదేవుని రాజ్యమున దండనాయకుఁడగు బిజ్జలరాయఁడు వేఱుపడి ప్రజావిప్లవములు రేపి రాజున కూపిరాడనిచ్చుటలేదు. సైన్య బలమునకు శత్రుసైన్యము నుఱుమాడఁగలిగినట్లు ప్రజావిప్లవము నణచుట చేతగాలేదు. బిజ్జలుఁడు తొల్లి దండనాథపదవి నందినవాఁడగుట సైన్యములు కూడఁ జాలవరకు రాజునువిడిచి బిజ్జలుని యాజ్ఞలు గూఢముగఁ బాలింప జొచ్చినవి. ఆపైని ప్రోలుని సేనలు కల్యాణిచేరఁగనే బిజ్జలుఁడు తన్నుఁ జేరియున్న కల్యాణి సైన్యసహాయము దానికి జతపఱచినాఁడు, ప్రజలాతని యండ నిలిచియేయున్నారు. అంతట తైలపదేవుని కథ యడ్డముదిరిగినది. ఈకారణమునఁ గల్యాణినుండి జినేంద్రునకు సహాయమేమియు నందు నాశ కనిపింపలేదు. త్వరలో తైలపదేవుఁడు రాజ్యచ్యుతుడు గావచ్చునను దుర్వార్తలుకూడ నాతనిచెవిసోకసాగినవి.

పరిస్థితులు గమనించి కల్యాణినుండి తైలపుని సాయమురాదని గట్టిగ నిశ్చయించినంతనే జినేంద్రుఁడు అనుమకొండ ముట్టడికి జగద్దేవాదు

లను ద్వర పెట్టినాఁడు, ''ప్రోలుని సేనలలో సగఁబాలు కల్యాణిలో నున్నవి. కల్యాణినుండి తిరిగి యవి రాకుండగనే మన మనుమకొండ ముట్టడి జరుపవలెను, కల్యాణిని లోబఱచుకొని బిజ్జలుని సైన్యముకూడ ననుమకొండకుఁ దోడ్పడిన మనమెన్నటికి ననుమకొండదిక్కు చూడనే లేము. ప్రస్తుతము అనుమకొండలోనున్న ప్రోలుని సైన్యము సంఖ్య యెనుఁబదివేలనియుఁ నందుఁగూడ మఱికొంతభాగము దిరిగి కల్యాణికిఁ బంపుట కుద్దేశింపఁబడినదనియు బేతనప్రగ్గడనుండి రహస్యవార్తలందినవి. మనము అనుమకొండ ముట్టడించినంతనే బేతన కోటలోపలనుండి మనకు సాయపడ వాగ్దానమంపినాఁడు. కాన ప్రోలుని సైన్యము నెదుర్చుట కిదే తగినయదను" అని జినేంద్రుఁడు జగద్దేవుని, ఆతని యనుచరులను ద్వర పెట్టి యనుమకొండ ముట్టడికి సైన్యములఁ దోలించినాఁడు. నేల యీని నట్లున్న సైన్యముతో నలువురురాజులు, పెక్కురు మాండలికులు ముట్టడి జరిపింప ననుమకొండఁజేరిరి. వెలుపల నెచ్చటను ప్రతిఘటనము లేకుం డుటచే వారు కోటను ముట్టడించిరి.

ప్రోలరాజీహఠాత్సంఘటనమునకుఁ గళవళపడినాఁడు. కోటలోని సైన్యమును బైటపెట్టిన తట్టుకొనఁజాలదు. అతఁడు ధైర్యమువహించి సైన్య మునంతను శిలాప్రాకారము లోపలితట్టునఁ గావలిపెట్టి దుర్గసంరక్షణమం దప్రమత్తతవహించెను. ప్రతినిమిషము చాల విలువయినదిగ భావించి నాఁడు, శత్రువుల సేన లపారముగనున్నవి. శివదేవునకు సర్వసేనాధిపత్య మొసంగినాఁడు. ప్రతి చిన్నపని ప్రోలుఁడు స్వయముగా పరిశీలించు చున్నాఁడు. కార్తికేయునిలాగు విజృంభించి కన్నులలో నిప్పులు కురి పించుచు ఆజ్ఞలు జరిపించుచున్నాఁడు. సమున్నతదేహముపై కవచము ధరించి ప్రోలరాజు తేజస్సు వెదజల్లుచు అనుచరుల నాజ్ఞాపించుచుండుటఁ జూచి రామేశ్వరదీక్షితు లాతనిని వీరభద్రావతారముగ భావించి ముగ్ధుఁడై నాఁడు. తన బుద్ధిబలమునకుఁ బనిచెప్పి యీ యాపత్తు నివారింపఁ

దానానాఁడు ప్రోలునకొసఁగిన యభయవాగ్దానమును దీర్ప నాకఁడు పథకముపైఁబధకమూహించుచు నూహాపోహలు సాగించినాఁడు యుద్ధమారంభమైనది. బురుజులపైనుండి వెలుపలిశత్రువులపై బాణవర్షము కురిసినది. శత్రుసైన్యములకు శిలాప్రాకారము వెలుపల చుట్టునునిలిచి బాణముల విడుచుటేకాని ప్రాఁకారము భేదించుట యశక్యమైనది.

కోటతలుపుకు ప్రక్కగా బండరాళ్ళు పేర్చి తలుపులు శిధిలపడినను తెఱచుకొనకుండ బిగించినారు. ఆపైని ఏనుఁగులను తలుపులకు దాపెట్టి నిల్పినారు. సైనికులు కోట గోడమీఁద రాళ్ళు రాసులురాసులుగ పోసికొని కూర్చుండి శత్రుసైన్యముపై శిలావర్షము బాణవర్షముతోఁ గలిపి కురిపించినారు. కోట గోడలపైనుంచి 'హరహరమహాదేవ' అను శబ్దములు దిశదిశలు చిల్లులుపడునట్లు చేసినవి.

శిలాప్రాకారము దుర్భేద్యమైనది. అది యానడుమనే కట్టుదిట్టముగ బాగులుగూడ చేయింపఁబడినది. వెలుపల నెంతసైన్యమును ప్రోగుపెట్టుకొని కూర్చుండిననేమి! కనుపడక శత్రువులుపైనుండి బాణములు వర్షమువలె తమపైఁ గురిపించుచుండ నేమిసేయుటకు జగద్దేవునకుఁగాని అతని మిత్రులకుఁగాని పాలుపోలేదు. ఎన్నాళ్ళకు దుర్గము భేదింప శక్యముగాదనిపించినది. తమసైన్యము ఎంతోకొంత రాళ్ళకుచితికి నష్టపడుటతప్ప వారికి సాధింపగలిగినది కనుపింపనేలేదు, ప్రోలునిసైన్య మీవలకువచ్చి నిలఁబడిన తమకుఁ జాలలేదనుమాట నిజమే. కాని యది వెలుపలి కెప్పుడు వచ్చును? జినేంద్రస్వామి ఆలోచనతో కోటలోనివారీవలకు వచ్చువరకు రాళ్ళవర్షమునకు దూరముగా కొన్నాళ్ళు సైన్యముల విశ్రాంతిదీర్చి నిలుపుటకు వారు నిశ్చయించిరి కోటలోపలి ఆహారపదార్థములు దఱిగిపోయినంత శత్రువు తనంతతాను లోబడకతప్పదని వారూహించి యుద్ధమాపి సైన్యముల విశ్రమింపఁజేసిరి. కొన్నినాళ్ళు యుద్ధము చప్పఁబడి యిరుసైన్యముల స్తబ్ధతయేర్పడినది.

ప్రోలరాజు రామేశ్వర దీక్షితులవారి పాదముల కెఱఁగి 'అన్యథా శరణం నాస్తి త్వమేవ శరణం మమ' యనినాఁడు. దీక్షితులు మందహాసము చేసి ధైర్యము చెప్పినాఁడు.

ఉండియుండి యొకనాఁడు దీక్షితులవారి సలహాపై కోటగోడలపై నుండి రాళ్ళకుబదులు చిన్నచిన్న సంచులలో నింపబడిన మధురపదార్థ ములమూటలు క్రిందికి విసరివేయింపఁబడినవి. పొట్లములు విప్పి వెలుపలి సైనికులు ఆశ్చర్యపడిరి. మధురమగు నేతిమిఠాయి, కలకండ మొదలగు వాని మూటలు వర్షమువలెఁ గురిసినవి. ఈ వింతపని కర్థము దెలియక జగద్దేవాదులు విస్తుపోయిరి. ఇంతలో లోపలినుండి జయజయ ధ్వానములు, విజయసూచకములగు భేరీల మ్రోఁతలు వినఁబడినవి. ఆకాశములో వరాహరూపములగు గాలిపటము లెగిరినవి. కోటపైని వరాహధ్వజ మెగురవేయఁబడినది. సైనికు లానందోత్సాహములతో నాక సము పగులునట్లు నగారా మ్రోయించి కోలాహలముచేసిరి.

జగద్దేవుఁడు, మేడరాజు, దొమ్మరాజు, మైలగిదేవుఁడు, మాండలికులు జినేంద్రుని పరివేష్టించి యీ వింతకార్యములకు భావములు చెప్పుకొను చుండగా నొక సేవకుఁడువచ్చి కోట తూర్పుద్వారములు తెరువఁబడినవనియు నందుండి యొక అశ్వికుడీపలకువచ్చి యెటకో యిప్పడే బయలుదేఱి పోవు చున్నాఁడనియు జగద్దేవునకు విన్నవించెను. వెంటనే వాని ననుగమించి పట్టి తీసికొనివచ్చునది యని జగద్దేవుఁడు పదిమంది వేగరులగు నాశ్వికులఁ బంపెను. ఇదేమైయుండునా యని వారి యాలోచనలు పరిపరివిధముల సాగినవి. ఇంతలో పలాయితునిఁ బట్టుకొని జగద్దేవుని సైనికులు వచ్చిరి. నీవెవ్వర వెచటకుబోవుచున్నావని యెన్ని ప్రశ్నించినను భటుఁడు వారికి ప్రత్యుత్తర మీయలేదు. అంత జగద్దేవుఁడాతని దుస్తులను శోధింపించెను. కత్తియొరలో నొక యుత్తరము వారిచేఁ జిక్కెను. అది ప్రోలుని ముద్రాం కితమగుట గాంచి దానిని విప్పి జగద్దేవుఁడుజినేంద్రాదులు విననిట్లుపఠించెను.

"స్వస్తిశ్రీ పరమశివపాద సేవానిరతులగు బిజ్జల రాయలవారికి అనుమకొండ రాజ్యాధిపతి ప్రోలదేవుఁడు సస్నేహప్రణామము లొనరించి వ్రాయునది మీరు తైలపదేవుని రాజ్యభ్రష్టునిఁజేసి విజయము సాధించిన వార్తచేరి బ్రహ్మానందము నొందితిమి శివసంకల్పము సాధింపఁబడినందులకు మాకుఁ గలిగిన సంతస మింతింత గాదు. శ్రీ దీక్షితులవారు మీకుఁ ద్వరలోనే మతవ్యాప్తి కింకను సలహాలు పంపఁగలరు. మా సైన్యమును మాకు పంపుచున్నామని వ్రాసినారు. ఇప్పుడు మాకోటవెలుపల జగద్దేవాదులు సైన్యములు తిష్ఠవేసి కూర్చుండినవి మాకు ఎంత తొందరగా మాసైన్యములు వచ్చిచేరిన నంతమంచిది. మీయుత్తరము ననుసరించి త్వరలోనే చేరఁగలవని భావించుచున్నాను. సకాలములో మాసైన్యములు మాకుఁ బంపఁబడుచున్నందుకు మేము మిగుల ఆనందించుచున్నాము. మాకు వచ్చిన చిక్కు గమనించి మీరు మీ సొంతసైన్యముఁగూడ నెంతహెచ్చు పంపగలిగిన నంతహెచ్చుగాఁ బంపి మాకు సాయపడ నర్థించుచున్నాను. మీరీతరుణమున మాకుఁ దోడ్పడినచో సాయమునకు ప్రతిసాయము వెంటనే జేసినవారగుదురు. మన గురువులగు శ్రీ దీక్షితుల వారి ఆశయముగూడ నిదియే. ఇట్లు, మీమిత్రుఁడు ప్రోలరాజు."

ఉత్తరములోని విషయములు విని జినేంద్రాదులు చలించిరి. కల్యాణినుండి తైలపుని రాజ్యచ్యుతునిఁజేసి సైన్యములు అనుమకొండ కిఁకనో యిప్పుడో చేరనున్నవనియు ఆకారణమున కల్యాణి విజయముతోపాటు వెలుపలనుండి తమకు సహాయములభించుచున్నదను నుత్సాహమును లోపల నుండి ప్రోలరాజు వెల్లడించుచున్నాఁడని వారందఱేకముఖముగ వ్యాఖ్యాసించుకొని భయవిహ్వలులైరి. తాము అచ్చటనే క్షణమాలసించిన తమ చుట్టును కల్యాణినుండి వచ్చుచున్న సైన్యము పరివేష్టించియుండుననియు నాపైని కోటతలుపులన్నియుఁగూడతీసి లోపలిసైన్య మీవలకు రప్పింపఁ బడుననియు దమపని అడకత్తెరలోని పోకచందముగుననియు వారాందోళిత మనస్కులైరి. క్షణమేని యాలసింపక ఎవరి శక్తికొలఁది వారు పలాయితులై

ప్రాణములు దక్కించుకొను టొకటే శరణ్యమని యందఱును తలఁచిరి. అంత వారు తిరోగమనమునకు సైన్యముల నాదేశించి సత్వరగమనమునఁ దిరుగుముఖముపట్టిరి. సైనికులు సరకు సామగ్రు లెక్కడవక్కడ విడిచి కాందిశీకులై పిక్కబలముకొలఁది ప్రాణముల దక్కించుకొన పరుగుఁ దీసినారు.

ప్రోలరాజు కోటబురుజుపైనుండి శత్రుపలాయనముఁ జూచి విరగఁ బడినవ్వుకొని గురువర్యుని ధీనైశిత్యమున కబ్బురపడినాఁడు. కల్యాణికి సేనలుబంపునపుడు గురువు తనకు ధైర్యముచెప్పి చేసినవాగ్దాన మపుడర్థము సేసికొన్నాడు. జగద్దేవుఁడు ససైన్యముగ నిర్గతుఁడైనందున ప్రోలరాజు ఆనందసాగరమున నీదినాఁడు.

"కోటతలుపులన్నీ తెఱపించి సైన్యమునుబంపి శత్రుసైన్యమును వెన్నంటి చేతికందినంత నాశనముచేయునది" యని దీక్షితులవారు ప్రోలుని ప్రోత్సహించిరి "పాఱిపోవు శత్రువులనుబట్టి వధించుట పాటిగా"దని గురునిమాటను ప్రోలుఁడు వినమ్రతతోఁ గాదనినాఁడు. శిష్యుని ధర్మ తత్పరతకు గురువు లోననే యానందించి తలపంకించి నవ్వుకొనినాఁడు.

పలాయనము చిత్తగించునంతసేపు జగద్దేవుఁ డఱచేత ప్రాణములు పట్టుకొనినాఁడు. తనదేశము చేరుకొని స్థిమితపడి తేరుకొనినప్పటి కాతనికిఁ గొన్నాళ్ళుపట్టినది.

తాము పలాయితులైనది రామేశ్వరదీక్షితులవారి రాజనీతిప్రభావము వల్లనేకాని కల్యాణినుండి అనుమకొండకు సేనలెవ్వియుఁ జేరలేదని తరువాత జగద్దేవుఁడు తెలిసికొని స్వకృత్యమునకు సిగ్గుపడిపోయినాఁడు. జినేంద్రుఁడు తన నీతి వమ్మైనదని తలఁగొట్టుకొనినాఁడు. "ప్రోలుఁడు తమ్మెదిర్చి నిలువలేక మాయచేసినంత నదియాతని విజయముకాదు, తమకు చాలలేకే యట్లు వారు కుతంత్రముసేయుట నిజమునకు తమకు వారోడి

పోయినట్లే'' యని మేడరాజు, దొమ్మెరాజు, మైలగిదేవుఁడు వ్యాఖ్యానించి జగద్దేవునకొకింత అవమానబాధను తగ్గించిరి.

జగద్దేవుఁడు మిత్రుల జయవ్యాఖ్య కామోదము తెలుపుటయేకాక తామే ప్రోలుని యెనుఁబదివేలసైన్యమును జయించినట్లు వ్రాయించి తన రాజ్యమందలి నగునూరులో నొక శిలాశాసనము నిలిపి సంతుష్టిపడెను.

తిరిగి సర్దుకొని ప్రోలునిమీఁద బడవచ్చుననుసరికి నిజముగా కల్యాణినుండి తైలపదేవుఁడు రాజ్యచ్యుతుఁడై అన్నెగిరికి పలాయితుడయ్యె ననియు, అనుమకొండసైన్యములు బిజ్జలునిచే బహుమానములంది తిరుగు ముఖముపట్టెననియు వార్తలు తమ వేగువారివలన తమకే చేరినవి. ఇఁక చేయునదేమి ? ఎప్పటికైన తమ్మవమతిపాలుఁజేసినందులకు అనుమకొండ రాజ్యమును కైవసము చేసికొనియేతీరవలెనని జగద్దేవునితో నందరేకాభిప్రాయులై నుసిగప్పినట్లుండిన లోనియగ్ని నారకుండ మాత్రము నిలిపి యుంచుకొనిరి.

ఇరువది నాల్గవ ప్రకరణము.

# కుతంత్రము.

జగద్దేవాదుల తిరోగమనముతో బేతనదంపతులు కుప్పగూలిన ట్లైనారు. ప్రోలు నెదిరింపఁగలవారందఱు చతికిలఁబడిపోయినారు. ఇఁక జినేంద్రుఁడేమిచేయగలడు? తామేమిచేయఁగలరు! అనుమకొండను ముట్టడించి యుద్ధముసాగించినచోఁ దాము జగద్దేవునకు లోనుండి సాయమందించుటకై చేసిన ప్రయత్నములు వ్యర్థమగుటేకాక ఆ ప్రయత్నములు దీక్షితులు పసిగట్టివేసెనుకూడ. తమ్ము చంపింపఁదలఁపుగొనియున్న దీక్షితులిపుడీ నేరము ధృవపఱచి ప్రోలుచే నేఁడు చంపింపకమానఁడు. పూర్వమెప్పుడో చంపింపఁదలఁచినను దీక్షితులు ఇన్నాళ్ళు దముపైనిఁగల నేరములెవ్వియు ప్రోలునకు రుజువుసేయలేకపోయినాఁడు. ఇప్పటి నేరము రుజువుపడకతప్పదు. జినేంద్రునకు జగద్దేవునకుఁ దాను బంపిన యుత్తరము లొకటిరెండు దీక్షితుల చేతిలోఁబడినవి. నాఁటినుండి దీక్షితులొక కన్ను తమ దంపతులపై నిలిపియేయుంచినాఁడు. ఇపుడాయుత్తరముల బయటఁబెట్టి తమపైని రాజునకు అనుమానము సులభముగ దృఢపఱచి తమ్ముఁ జంపింపకమానఁడు. బేతన పరిస్థితి వకింంచినందులకు దిగులు పడినాడు.

ప్రోలునియొద్ద ఇంతబ్రతుకుబ్రతికి ప్రోలునిచేతనే జంపింపఁబడుటకంటె జైనమతానుసారము అనశనదీక్ష సాగించి యేదేనొక జైనవిహారములో ప్రాణత్యాగముఁ జేసికొనుట యుక్తమని తలంచి యొకనాఁటి యర్ధరాత్రి బేతనదంపతులు శైవజంగవేషములు ధరించి యనుమకొండ రాజ్యము విడిచి పాఱిపోయినారు.

బేతనదంపతులు పాఱిపోయిన సంగతి తెలిసికొని ప్రజలు ఆశ్చర్యపడిరి. రాజు, రాణి బేతనదంపతుల నిర్గమనమునకు మిగుల విచారపడిరి.

దీక్షితులవారు ఇంటిలోని శత్రువులు తమంత వెడలిపోయినందుకు సంత సించినను వారు బైటకుఁబోవుట మఱింత స్వేచ్ఛగ జినేంద్రునితోఁ గలసి ప్రోలుని నాశముజేయు యత్నములు సలుపుటకే యైయుండుననిభావించెను.

జినేంద్రుతోసహా బేతనదంపతులనుగూడ వెదకిపట్టి చంపింపక పోయిన శత్రుశేషము మిగిలి యెప్పటికైన రాజుకొని యది మహానలము కాకతప్పదని దీక్షితులు ప్రోలునికి దెలిపెను. బేతనకు, జినేంద్రునకు రహస్యముగ జరిగిన ఉత్తరప్రత్యుత్తరములఁ దాను సంగ్రహించినవి ప్రోలునిముందుఁబెట్టి వారు మొదటినుండియుఁ గావించు ద్రోహ చింతలను సాక్ష్యాధారములతో రుజువుపఱచెను. ప్రోలరాజు బేతనదంపతుల విద్రోహచర్యకు చకితుఁడయ్యెను. ఐనను బేతనదంపతులనుగాని, జినేంద్రునిఁగాని చంపించుట తనకు మనస్కరింపలేదు. తనతండ్రి కావలయునని జినేంద్రుని గౌరవించి యాతనిమూలమున జైనమతస్థుల యాదరముఁ జూఱగొని రాజ్యముఁ బాలించినాఁడు. తన తండ్రినాఁడే చాళుక్యరాజ్యములోఁ గలిసిపోవలసిన కాకతిరాజ్యము వైజదండనాథుని సామర్థ్యమున బ్రతుకుఁగాంచినది, వైజదండనాథుఁడు బేతనకుఁ దండ్రి. నేఁడు జినేంద్రుని, బేతనదంపతులను జంపించి తాను కృతఘ్నుఁడుకావుట కిష్టపడ లేదు "పోయినవారెటులునుపోయిరి. వారు జినేంద్రునిఁ గలిసిన మాత్ర మేమి చేయగలరు! ప్రబలురగు శత్రువులు మనకు లొంగిపోయినారు. కాన ఇప్పుడు వారు బ్రతికియుఁ జచ్చినవారే పోనిండు" అని ప్రోలరాజు దీక్షితులవారికి జవాబునిచ్చెను.

దీక్షితులవారికి ప్రోలుఁడు తనమాట కాదనినందుకు నొప్పిగలైను ప్రోలునకుఁ గావలసినది రాజ్యవిస్తరణముకాని, జైనమతనిరాసము ప్రధానముకాదు. జైనము ప్రజలలో మిగిలియున్న నాతనికి బాధయులేదు. బేతన వలెనే ఈతఁడును ఇఱుమతస్థుల యాదరముఁ జూఱగొని ద్వంద్వనీతినిఁ బాలింపఁదలంచినాఁడు, వీరశైవ వ్యాప్తికి కంకణముకట్టుకొన్న దీక్షితుల

చారికి ప్రోలరాజు నడక నచ్చలేదు. ప్రోలుఁడున్నంతకాలము శైవమత విజృంభణము విశృంఖలముగ జరుగనేరదు. కాన మతవ్యాప్తి శరవేగమున జరుగవలెనన్న తనమాటకడ్డుగఁ బ్రోలుఁడుండరాదు. అందులకై ప్రోలుని రాజ్యమునుండి తప్పించి యాతని కుమారుని రుద్రదేవుని రాజుగాఁ జేసి నచోఁ దమ కార్యము సుసాధ్యముఁ గావింపనగునని దీక్షితు లూహసేసిరి.

బాలశివదేవునిఁ బిలిచి దీక్షితులవారు తనయూహఁదెలిపి సాధక బాధకము లిటుచర్చించిరి.

దీక్షి:— శివా! రుద్రదేవుని స్వయంభూదేవుని సంరక్షణములో నిన్నాళ్లు నిలిపినది, ఆతనికి వీరశైవమందలి భక్తిని పరాకాష్ఠ వహింపఁ జేయుటకే. అపైని నాకుమారు నచితేంద్రు నాతనికిఁ దోఁడుచేసినది కూడ నాతనిమనసు వీరశైవమున నూఱుపాళ్ళు నిలిపియుంచుటకే. ప్రోలునికాలమున మనమనుకొన్నంత మతవ్యాప్తి జరుగనేరదని యేనాఁడో యూహించి వాని తరువాతివాఁడైన మన కామితము నకుఁ దోడ్పడగలఁడని యిట్లుచేసితిని.

శివ:— గురుదేవా! అతిబాల్యమునుండియు రుద్రదేవుని ప్రోలుని కంటఁ బడకుండఁజేసిన కారణమిదియేనా?

దీక్షి:— అదియొకకారణము, మఱియొక ప్రబలకారణముగూఁడ గలదు.

శివ:— అది నేను వినఁదగునా!

దీక్షి:— నీవు వినఁగూడనిదేమున్నది! నీవు నాహృదయముకన్న భిన్నుఁడవుకావు. నీభుజమూలమున వీరశైవము భావి యాధారపడి యున్నది. నా యనంతరమున వీరశైవవ్యాప్తికి నీవే వారసుఁడవు. చెప్పెదను వినుము. రుద్రదేవుఁడు పితృగండమునఁ బుట్టినాఁడు. ఆతని జాతకమునుబట్టి యాతఁడు తండ్రినిమించిన ప్రయోజకుఁడు కాఁగలడు. కాని యాతనిచేతిలోఁ దండ్రికి గండముకలదు. తండ్రి

కొడుకు లిరువురుఁగలిసియున్న తండ్రికి కొడుకుచేతిలో నెట్టిప్రమాదము సంభవించునో యను భయమున వారి కలయిక జరుగకుండ విద్యాభ్యాసమను నెపమున, యుద్ధశిక్షణాభ్యాసమను నెపమున రుద్రదేవుని ప్రోలునుండి దూరముచేసియుంచితిని.

శివ:— జాతకఫలము నాపశక్యమగునా ?

దీక్షి:— పూర్తిగానాప నెవరితరమునుగాదు. కాని గ్రహవీక్షణములోని క్రూరతను తగ్గించుటకు శాంతివిధానములు, తీసికొనవలసిన జాగ్రత్తలు కలవు. ప్రోలునకు దెలియకుండ నట్టి శాంతివిధానములన్ని జరిపించితిని. ఎందుకైనమంచిదని యింకను ఇరువురను వేఱుగనుంచుటకు, శివకటాక్షముఁ బ్రసరింపించుటకు స్వయంభూదేవుని సంరక్షణాభారమున రుద్రుని నిలిపితిని.

శివ:— ఇఁక వారి సమాగమునకు ఆలస్యము జరుగనీయకుఁడు. మన కార్యమునకు రుద్రుని జాతకఫలము దోడ్పడిన మంచిదేకదా!

దీక్షి:— శివా! నీయూహ నాకర్థమెనది. మనమేమియుఁ జేయకుండగనే ప్రోలుఁడు రుద్రునిచేతిలో నంతమొందుటకు వారిని గలిపియేయుంచుట మంచిదందువా !

శివ:— ప్రోలుఁడు మనకార్యముల కడ్డుగానున్నపు డాతనిఁ దొలగించుకొనుట కిది మంచియుపాయముగదా !

దీక్షి:— ఇప్పుడట్లు జరుగఁగూడదు. ఇన్నాళ్ళు నేనే రుద్రుని ప్రోలునుండి వేఱుచేసినసంగతి యందఱికిని విదితమే. ఇప్పుడు ప్రోలుఁడు రుద్రునిచేతిలో మడిసినచో నీకార్యమునకు రుద్రుని నేనే ప్రోత్సహించి చేయించితినని ప్రజలు నమ్మవచ్చును. ఆపైని ప్రోలునకు నాకు తఱచు మాటపట్టింపులు, భేదాభిప్రాయము వచ్చుచున్నట్లు రాజోద్యోగులు పసికట్టిరి. ఆకారణమున ప్రోలునివధ నేనే చేయిం

చినటు ప్రచారము లేవఁదీయుదురు. ప్రజలకు మనపైని దురభిప్రాయము గలిగినచో మతవ్యాప్తికి మనమాట వారు పాటింపరు. ఈకార్యము మన మతవ్యాప్తికి ప్రబలమైన ఆటంకమును కలిగించును. అంతేకాదు, తండ్రిని జేతులార చంపుకొంటినే యను విచారమున రుద్రుడు రాజ్యభారము వహింపక విరక్తుఁడైనచో రాజ్య మరాజకమును కావచ్చును. కాన అయూహ సరికాదు.

శివ:-- గురుప్రభూ! మీరు చెప్పినది సత్యముగనేయున్నది. నేనే తొందరపడి యూహించితిని. మఱి ప్రోలుఁడుండఁగనే అతని కుమారుని రాజ్యమునకుఁదెత్తురా! అప్పుడుమాత్రము ప్రోలుని మాటకాదని రుద్రుఁడు మనమాట జెవిఁబెట్టునా! అసలు ప్రోలఁడుండగా రుద్రుని రాజుసేయుటెట్లు?

గురు:— అదే నేను నాలోచించుచున్నాను. రుద్రునిఁజూచుటకు ప్రోలుఁడు తహతహపడుచున్నాఁడు. అతనినిఁక రుద్రునిఁజూడకుండఁ జేయఁజాలము. నేఁడో రేపో అతఁడు మనకుఁ జెప్పకుండనే స్వయంభూ దేవాలయమునకేగి రుద్రుని రహస్యముగ నిద్రచేయునపుడైన జూచి రావలెనని తలఁచుచున్నట్లు రాణితో సంభాషించునప్పుడు తెలిసికొని అంతఃపుర పరిచారికయొకతె నాకుఁదెలిపినది. అనుమతి లేనిదే స్వయంభూలింగము నెవరు స్పృశించినను శిరశ్చేదముఁ జేయునదిగా రుద్రునకు రాజే యాజ్ఞయిడియున్నాఁడు. ప్రోలుఁడు రహస్యముగ దేవాలయముఁజేరిన రుద్రుని వలన తప్పక ముప్పు రాఁగలదు. నీవు రహస్యమున ప్రోలుని వెన్నంటి ఆ యాపత్తు నుండి తప్పింపవలెను.

శివ:— ఇదేమిస్వామి! మీ మాటలు నాకర్థమగుటలేదు. ప్రోలుని ప్రాణములను మనమై రక్షించుటయా!

దీక్షి:— నేను చెప్పియుంటినిగదా! రుద్రుని చేతిలో ప్రోలుడు మడిసిన అనింద మనపై వచ్చిపడునని, ఇది మనము కాచుకొనకున్న నెట్లు? పరిస్థితులు నేర్పుతో మనవైపున కనుకూలముగాఁ ద్రిప్పుకొనవలెను.

శివ:— సరే! నేను ప్రోలుని వెన్నంటియుండి తమ యాజ్ఞ పాలింతును. ఆపైని జరుగునదేమి! మనకార్యసానుకూలత యెట్లు జరుగఁగలదు?

దీక్షి:— చెప్పుచున్నాను వినుము. రుద్రుఁడు ప్రోలుని చంపఁబోవుట, నీవు రక్షించుట జరిగినచోఁజాలును. నేను ఆపరిస్థితిని మన కను కూలముగఁ ద్రిప్పుదును. ప్రోలుని మరణము, నాఁడే స్థిరపడినట్లు నచ్చఁజెప్పి శివైక్యభావనము నొసఁగి ప్రోలుని రాజ్యత్యాగముఁ జేయించి రుద్రునకు పట్టాభిషేకముఁ జేయింతును.

శివ:— ప్రోలుని తపోదీక్షకుఁబంపి ఆతనిని రాజ్యముననే లేకుండఁజేయుట మంచిది కదా!

దీక్షి:— కాదు, తపోదీక్ష ఆతనికిఁ గుదురునదికాదు. ఆతఁడు బ్రతికి యుండిన రాజ్యము నంటిపెట్టుకొనియే యుండును. కుమారుని రాజ్యపాలనమునకుఁ దోడ్పడును. ఆతని పాలనముఁ జూచుచు బ్రతికియున్నన్నాళు నాతనియొద్దనే యుండగలఁడు. ప్రోలుని జీవితకాంక్ష కాకతీయ మహాసామ్రాజ్య స్థాపనముగదా!

శివ:— ఇఁక మనకార్యమునకు రుద్రుని మనము వశపరచుకొనుట యెట్లు! తండ్రి కొడుకు లేకమైన మనపనికి ప్రబలాఘాతముగదా!

దీక్షి:— ప్రోలుఁడు రాజ్యమున నుండకుండ నాతనిని దూరప్రాంత శత్రు లతో యుద్ధములకుఁ దలపడుటకు పురికొల్పవలెను.

శివ:— శత్రువిజయము గావించుకొని వచ్చి యాతఁడు మనకార్యములఁ గాదనకూడదా!

దీక్షి:— అచ్చట కుతంత్రము సేయకతప్పదు. వెలనాటిపై నాసగొలిపి ప్రబలుఁడగు చోడరాజుపై కాతని నల్పబలముతో నెదిరింపఁజేసి యుద్ధములో నాతడు హతుఁడగునట్లు చేయవలెను.

శివ:— వెలనాటి యుద్ధమునకు రుద్రదేవుఁడు తండ్రి వెంటఁబోకుండఁ జేయుటెట్లు! వెలనాటి చోళుడే, ప్రోలుని జయించినచో కాకతి

రాజ్యము విచ్ఛిన్నమై మనప్రయత్న మసలే కూలిపోవునుగదా! చోడరాజు నాశ్రయించి తిరిగి మనపని సాగింపవచ్చుననియా మీ యూహ! మీ యూహలోని తికమిక నాకర్థమగుటలేదు.

దీక్షి:— నీవు సరిగా నూహింపకున్నావు. రుద్రదేవుఁడు తండ్రి వెంట యుద్ధమునకుఁ జనకుండ నాతనిని ముందే పితృవధోద్యోగమునఁ గల్గిన పాపమును బరిహరించుకొన విశ్వేశ్వరదేవు నారాధించుటకు వారణాసికిఁ బంపింపవలెను. ఆపైని ప్రోలునిఁ బ్రోత్సహించి వెలనాఁటిపై యుద్ధమునకుఁ బంపవలెను. కాకతిరాజ్యము కాక మఱేరాజ్యమును మన వీరశైవ మతవ్యాప్తికి ప్రోద్బలము నీయఁ జాలదు. చోళుఁడు ప్రోలునిజంపినంత కాకతిరాజ్యము విచ్ఛిన్నము కాకుండ రుద్రుఁడు తీర్థయాత్రనుండి తిరిగి వచ్చువరకు మనము కాపాడవలెను. ఆపైని తండ్రిని జంపెనన్న పగ వృద్ధిచేసి రుద్రుని చేత చోళుని జంపించు యత్నముతో మనము కృతార్థులము కాఁగలము.

శివ:— సెభాష్! గురుదేవా! మీపథకము బహుప్రశస్తముగా నున్నది. ఇదియంతయు నొక నాటకమువలె జరిగిపోవలెను.

దీక్షి:— మఱి దానికి నాంది నీవు జరుపవలెను. ప్రోలుని రహస్యముగ వెన్నంటియుండి స్వయంభూదేవాలయమున మన పథకము కనుకూల పరిస్థితులు గల్పింపవలెను.

శివదేవుఁడు గురునాజ్ఞను మహానందముతో శిరసావహించెను గురు శిష్యులు మతవ్యాప్తికి తమ భావిపథకము నభినందించుకొనుచు నిష్క్రమించిరి.

ఇరువదియైదవ ప్రకరణము.

# సమాగమము.

జగద్దేవుని నిర్గమనముతో ప్రోలరాజునకు ప్రాంత శత్రువుల నెల్లర జయించినట్లయినది. ఒక్క సైనికుడుకూడ మరణింప నక్కరలేకుండ జగద్దేవుని పలాయితునిఁ జేయఁగలిగిన దీక్షితులవారి యఖండ మేధాసంపత్తి కాతఁడు విస్తుపోయినాఁడు. ఇదంతయు స్వయంభూదేవునికిఁ దనపైనిఁ గల అనుగ్రహ విశేషముగా నాతఁడు భావించికొనినాఁడు. స్వయంభూదేవుని యవతరణము మొదలుకొనియే తన రాజ్యము విస్తరిల్లినది. స్వయంభూదేవుఁడు కాకతీయ రాజ్యవిస్తరణమునకే యవతరించినాఁడు. అతని నెంతఁగొల్చిన నంత తనకభివృద్ధికలదని రాజు నిశ్చయించుకొనెను.

జగద్దేవుని నిర్గమనముతోఁ బ్రోలునకు భక్తి యపారమై స్వయంభూదేవుని మనసార నభిషేకించి లోనిభక్తి వెలువరింప నాతఁడువ్విళ్లూరెను. కాని తనకు స్వయంభూదేవుని దర్శించుటకు గురునను జ్ఞ కావలెను. స్వయంభూదేవుని తన కుమారుఁడు రుద్రదేవుడు సంరక్షించుచున్నాడు. కుమారుని తాను జూడకుండ, గురుదేవుఁడు నిషేధించుచున్నాడు. గురువట్లెందుకు చేయుచున్నాఁడో స్పష్టముగ తనకు బోధపడుటలేదు. నాఁడు తాను స్వయంభూదేవుని దర్శించితీరవలెను. గురునకుఁ దనకోరిక దెలిపిన నాతఁడింతలో దానిని సాగనీయఁడని, కుమారుని ముఖకమలమును జూడవలెనని చిరకాలమునుండి తీరని వాంఛగానున్నది. నాఁడు స్వయంభూదేవుని సేవించి సుతముఖకమల దర్శనమును గావింపవలెనని యాతఁడు నిర్ణయించుకొనెను. బహిరంగముగఁ బోయినచో గురుఁడు తనకుఁ దెలుపకుండ వెడలినందుల కాగ్రహింపఁగలఁడు. దానితో తనకు, గురునకు లేనిపోని కలఁత లారంభమగును. గురుధిక్కారముచేసినట్లు ప్రజలు తలంతురు. దానివలన బ్రజలలో నలజడి కలిగి రాజ్యమున

శాంతి భద్రతలు లోపింపఁగలవు. కాన నోరుతెఱుగకుండ రహస్యముగఁ బోయిరావలెను. తన కుమారుఁడు రుద్రదేవుఁడుకూడఁ దన్ను జూడకుండఁ దానాతనిఁ జూడవలెను. తన్ను రుద్రుఁడు చూచినచో నావిషయము గురునకు దెలియకమానదు. అప్పుడు పరిస్థితులు విషమించును. కాన నాఁటి యర్ధరాత్రి రుద్రదేవుఁడు స్వయంభూదేవుని సన్నిధిని నిద్రించు సమయమునఁ దానుపోయి స్వయంభూదేవుని సేవించి పుత్రునిజూచి మనసు తృప్తిపఱచుకొని రావలెనని ప్రోలరాజు పరిస్థితుల నన్నిటిని కూలంకషముగఁ జర్చించుకొని యొక నిర్ణయమునకు వచ్చినాఁడు.

జగద్దేవాదుల తిరోగమనముతో స్వయంభూదేవునిపైనిఁ గన్నువేసిన వారందఱు నిర్జితులైనారని తెలిసి దేవాలయ పాలనమున పాలకుల శ్రద్ధ తగ్గినది. రాత్రి కాపలా తీసివైవఁబడినది. గర్భాలయమున రుద్రదేవుఁడు మాత్రము దైవసన్నిధి నొంటరిగాఁ బరుండుచుండెను. ఇన్నాళ్లు నిద్ర యెఱుఁగని రుద్రుని కన్నులకు కొన్నాళ్లనుండి నిద్రలభించినది.

ఒకనాఁటి నడిరేయి ప్రోలరాజు స్వయంభూ దేవాలయమును రహస్యముగఁ బ్రవేశించెను. గురునాజ్ఞ ననుసరించి బాలశివదేవుఁడు ప్రతి క్షణము ప్రోలుఁడెఱుఁగనట్లుగ మాఱువేషమున నాతని వెన్నంటియే యుండెను. ప్రక్కప్రక్కలఁబడి ప్రోలునకు ముందుగనే శివదేవుఁడు గర్భాలయముఁ బ్రవేశించి రుద్రదేవుఁడు నిద్రించుచోటున తలుపుప్రక్క నెవ్వరికిఁ గనుపడకుండ నిలఁబడియుండెను.

నరము

అర్ధరాత్రి, ప్రశాంతసమయము. నిద్రాదేవి యందఱను ...త్తు పరమ నాలింగనముఁజేసికొని సుఖపెట్టుచుండెను. ప్రోలుఁడు న... స్వయంభూదేవుని దర్శనము చేసికొనఁగల్గుచున్నందుకు ...యెంతబాగుండునని మునమండెను. స్వయంభూదేవుఁ డవతరించిననాఁటి... రుదేవుని, ముప్పాం పరంపర లభించెను. తన చిరకాలవాంఛితము క్షే...ము. భూదేవుఁడు దీర్చెను.

దేదీప్యమానముగ వెలిగిపోవుచున్న స్పర్శవేదిలింగమును దూరము నుండి చూచి ప్రోలుఁడు భక్తితన్మయుఁడయ్యెను. కనులుమూసి చేతులు జోడించి ధ్యానములో మునిగినాఁడు. తన్మయతతో కనులుమూసికొనియే యాతఁడు త్వరితగతి లోనికిఁబోవుచుండెను. ప్రోలుఁడు కనులుమూసికొని వచ్చుచుండుట శివదేవుఁడు చూచినాఁడు. గర్భాలయమున దారిలో రుద్రదేవుఁడు వెల్లకిలఁబరుండి గాఢనిద్రలో నున్నాఁడు. ప్రోలుఁడు రుద్రునిఁ దప్పించుకొనిపోవు మెలఁకువలో లేఁడు. ప్రోలుఁడు రుద్రునిపైఁ బడఁ గలడు. రుద్రుడు హఠాత్తుగా లేవఁగలఁడు. అదే ప్రమాదసమయము. శివదేవుని మెదడులో గురునాజ్ఞ మెదలుచుండెను. రెప్పలెత్తుకొని చూచుచు శివదేవుఁ డప్రమత్తుడై రుద్రదేవుని హస్తములపైనే చూపు నిల్పుకొని యుండెను.

ప్రోలుఁడు భక్తిమెకమన దారి చూచుకొనకుండ అంగలు వైచుకొనుచు వచ్చెను. అడ్డముగ పరుండిన రుద్రదేవుని గుండెపై నాతని కుడి పాదము బరువుగ పడినది. రుద్రుఁడు త్రుళ్ళిపడి 'దొంగ దొంగ' అని యఱచుచు సమాంతము మొలనున్న బాకు నొరనుండి పెఱికి చేయెత్తి ప్రోలుని గుండెలో పొడువఁబోయినాఁడు. ఇంతలో వెనుకనుండి శివదేవుఁ డాతని మణికట్టు గట్టిగ పట్టుకొనినాఁడు. రెండుచేతులు పెనఁగులాడినవి. ప్రోలుఁడు కనులుతెఱచి ప్రమాదమును గుర్తించి యిరువురచేతులు కలిపి నొత్తి పట్టుకొనెను. అంతలో నా యలజడివిని చుట్టుపట నిదురించువారు జూడవలెను. పిమ్మట రుద్రదేవుఁడు శివదేవుని గుర్తించి పెనఁగులాట స్వయంభూదేవ్తన గుండెత్రొక్కిన ప్రోలునివంక కోపోగ్రదృష్టుల నిగుడింపలెనని యాతని లోకరినొకరెఱుఁగరు. చూచి చిరకాలమౌట గుర్తించ గురుఁడు తనకుఁ దెల్పివదేవు నెఱుఁగుదురు. తన కొడుకు దేవాలయమున తనకు, గురునకు లేనిక్షతనే కొడుకని ప్రోలుఁ డెఱుగఁడు. వచ్చినవాఁడు నట్లు ప్రజలు తలంతరుద్రుఁడెఱుగఁడు.

శివదేవుఁడు రుద్రునిజూచి 'రుద్రదేవా! వీరు మీతండ్రి. శ్రీమన్మహా మండలేశ్వర కాకతి ప్రోలరాజులవారు అభివాదనమొనర్పుము' అని పలికి ప్రోలునివంకజూచి 'చిరకాలమునుండియుఁ జూడ నువ్విళ్ళూరిన కుమార రుద్రదేవుఁడీతఁడే. ఆలింగనసౌఖ్య మనుభవింపుఁడు' అని పలికి మందహాసముచేసెను. రుద్రదేవుఁడు తన తప్పును గుర్తించి 'క్షమింపుఁడు తండ్రీ' యని సాష్టాంగపడెను. ఆనందబాష్పములతో మూర్ధాభిషేక మొనర్చుచు ప్రోలుఁడు రుద్రు లేవనెత్తి గాఢాలింగనము కావించుకొనెను. ముక్తాహార, కర్పూర, సాంద్రపరాగ ప్రసరంబు, చందనము, చంద్ర జ్యోత్స్నయు, సాటిరాని పుత్రగాత్ర పరిష్వంగ సుఖంబును ప్రోలరాజు పరిపూర్ణముగ ననుభవించెను.

తండ్రి కొడుకుల హఠాత్సమాగమమును ప్రక్కల జేరినవారందరు నాశ్చర్యముగఁజూచి యానందాశ్రులురాల్చిరి. ఒకింత మనసులు కుదుటఁ బడి తేలికపడినపిదప నందఱు స్వయంభూదేవుని సన్నిధానమునకుఁజని సాష్టాంగపడిరి, తనకు శత్రువిజయము చేకూర్చుటయేకాక పుత్రునితోఁ గూర్చినందులకు ప్రోలుఁడు స్వయింభూదేవుని పెక్కువిధముల స్తుతించి కొనియాడెను. శివుఁడే శివదేవుఁడై తమ తండ్రికొడుకుల ప్రాణములఁ గాపాడినాఁడని విశ్వసించి ప్రోలరాజు శివదేవు నాలింగనముఁజేసికొని "శివదేవా! నీకు నేనును రుద్రుండునుగూడ నెన్నిజన్మంబులకు ఋణము తీర్చుకొనలే" మని పలికెను. రుద్రదేవుఁడు తండ్రిని జంపఁబోయిన నేరము నకు ఖిన్నుఁడై పితృహత్యనుండి రక్షించిన శివదేవుని సాక్షాత్తు పరమ శివుఁడుగనే భావించి పాదాభివందనముచేసెను.

ఈ యానందసమయమున గురుదేవుఁడుండిన యెంతబాగుండునని శివదేవుఁడు కనులు చెమరింపఁబలికెను. వెంటనే గురుదేవుని, ముప్పాం బను రప్పించుటకు ప్రోలుఁడు సేవకుల కాజ్ఞయిడెను.

ఇరువది యారవ ప్రకరణము

# రుద్రుని పట్టాభిషేకము.

తెల్లవారునంతలో నెల్లవారికి పితాపుత్రుల సమాగమవార్త చేరినది. ప్రోలుని వార్తనందుకొని ముందు రామేశ్వరదీక్షితులవారు, ఓపప రాజ్ఞి ముప్పాంబ ఓరుగంటి స్వయంభూదేవాలయము చేరుకొనిరి వెనువెంటనే అమాత్యులు, సేనాపతులు, ప్రముఖోద్యోగులు వచ్చిరి. ఆపిమ్మట యావత్పురజనులు వచ్చిరి. రుద్రుఁడు ప్రోలునిఁ జంపబోయెనని, శివదేవుఁ డడ్డగించెనని ప్రజలు నాశ్చర్యముగఁ జెప్పుకొనిరి. స్వయంభూలింగావతరణమునాఁటివలె నానాఁడును ప్రజాసమూహమున నుత్సాహము కట్టతెగి ప్రవహించినది. రామేశ్వరదీక్షితులవారు ప్రోలుని, రుద్రదేవుని, శివదేవుని వెంటఁబెట్టుకొని ఆలయగోపురముపైని నిలఁబడుటతో 'శివసంకల్పోభవ, శివసంకల్పోభవ' అను రాజు నాశీర్వదించు పలుకులు ప్రజల నోటనుండి యొక్కుమ్మడి వెలువడి మిన్నునంటినవి. దీక్షితులవారు కరసంజ్ఞతో ప్రజల కోలాహలమాపి చెఱియొక చేతితోడను ప్రోలుని, రుద్రుని పట్టుకొని ప్రజలనుద్దేశించి జరిగిన పరిస్థితిని వివరించెను.

రుద్రదేవుని జాతకములో పితృవధాయోగమును గుర్తించి తాను పితాపుత్రులను వేఱుసేసి గ్రహశాంతులు రహస్యముగ జరిపించుటయు, రుద్రునకు స్వయంభూదేవుని సేవ చిరకాలము లభించునట్లు దేవాలయ రక్షణమునకు నియోగించుటయు, పుత్రవ్యామోహమును పట్టఁజాలక ప్రోలుఁడు స్వయంభూదేవాలయము నర్ధరాత్రమునఁ బ్రవేశించుటయు, ప్రోలునకుఁ దెలియకుండ ననుసరించియుండి ప్రమాదము రాకుండఁ గని పెట్టి యుండునదిగా శివదేవుని దాను నియోగించుటయు, దైవదర్శనముతో భక్త్యావేశము గలిగి ప్రోలుఁడు దారిలోఁ బరుండిన రుద్రునిఁ జూడక త్రొక్కుటయు, రుద్రుడు చోరునిగా భావించి ప్రోలునిపై కత్తిదూయు

టయుఁ శివదేవు డడ్డుపడుటయు, దీక్షితులవారు సవివరముగఁ దెలిపి నపుడు ప్రజలాశ్చర్యముతో విని ప్రోలుని ప్రాణరక్షణమునకు గురుదేవులు తీసికొనిన అమితశ్రద్ధాసక్తుల కానందించి చేతులెత్తి జోహారుచేసిరి. పితా పుత్రుల ద్వంద్వయుద్ధమున నిరువురుగతించి కాకతీయరాజ్య మరాజకమును గాకుండగా నదనునఁగాపాడిన శివదేవుని దీవించిరి. పితృవధాయోగము పితృ వధాప్రయత్న మాత్రముగా మార్చి జాతక తీవ్రతను తగ్గించినది రుద్రుని స్వయంభూదేవ సేవయేయని ప్రజలు స్వయంభూదేవుని వేనోళ్లఁ గొనియాడిరి.

రామేశ్వర దీక్షితులంత ప్రోలరాజువంకను ప్రజలవంకను దృష్టి సారించుచు "నేఁటి సంఘటనము దైవాయత్తము. జాతకఫలము కాదనుటకు వీలులేదు. స్వయంభూదేవుని కృపాకటాక్షమున అల్పప్రభావముతో నది తీరిపోయినది. నేఁటినుంచి ప్రోలరాజేంద్రుఁడు తాను నిజముగా శివైక్యము పొందినట్లే భావించి రుద్రదేవుని రాజ్యాభిషిక్తునిఁజేయుట యెంతయు శ్రేయస్కరము. అట్టిభావనము జరిగి తదనుకూలముగఁ బ్రవర్తించిన జాతకఫలము పూర్తిగా నెఱవేఱినట్లేయగును. అన్ని ఫలములు క్రియా పర్యవసన్నములు కానక్కఱలేదు. భావమాత్ర పర్యవసన్నములైనను అవి జరిగినట్లే యెంచఁబడును. కాన ప్రోలరాజేంద్రుఁడు మానసికముగ నేఁడే తాను శివైక్యమును బొందినట్లు భావించుట యుత్తమము" అని యింకను నేదో చెప్పఁబోవుచుండగా ప్రోలరాజు అందుకొని "గురుదేవులుసెలవిచ్చినది నిశ్చయము. వారి యంగీకారముతో నేఁడే నేను శివైక్యభావమును మీ యెదుటనే స్వీకరించుచున్నాను. మరినేను శివైక్యము పొందుటకు ముందు రుద్రదేవుని రాజ్యాభిషిక్తునిఁజేయ నభిలషించుచున్నాను. మీయందఱి యంగీకారామోదము వెల్లడింప నభ్యర్థించుచున్నాను" అని యంజలిపట్టి ప్రజలనభ్యర్థించెను. ప్రజలందరు 'శివసంకల్పోభవ, శివసంకల్పోభవ' అని యాశీర్వదించి తమయామోదముఁ దెలిపిరి. రామేశ్వర దీక్షితులు

చెప్పిన చొప్పున ప్రోలుఁడు రుద్రుని రాజుచేయఁ బ్రకటించినందులకు జనులానందాశ్చర్యములఁ బ్రకటించిరి.

వెంటనే స్వయంభూదేవుని సన్నిధిని గురుదేవు నాధ్వర్యమున పట్టాభిషేకక్రియ లాంఛనప్రాయముగా జరుపఁబడినది. ప్రోలరాజు, ముప్పాంబ, కిరీటమును రుద్రదేవుని శిరమునఁబెట్టి ఖడ్గము నాతని చేతి కందించినతోడనే రుద్రదేవుఁడు కాకతీయ రాజ్యమున మూర్ధాభిషిక్తుఁడై నాఁడు. ప్రజలు మహోత్సాహముతోఁ దమ నూతన చక్రవర్తిని వీక్షించి 'ప్రతాపరుద్రదేవ మహారాజులుంగారికి జయము జయము' అని మిన్ను మన్ను నేకమగునట్లు జయఘోషలు గావించిరి.

అనంతరము కొన్నాళ్లకు అనుమకొండ నగరమున సర్వసామంత పౌర సమక్షమున రుద్రదేవుని పట్టాభిషేకోత్సవము యథావిధిగ జరుపఁ బడెను. సమస్తనదీనదసముద్ర జలములతో రుద్రదేవునకు మూర్ధాభిషేకము జరిగినది. స్వయంభూదేవునకు శతసహస్ర రుద్రాభిషేకములు జరుపఁబడి నవి. కాకతిదేవికి జాతర సంబరము మహోత్సాహమున నిర్వర్తింపఁబడి నది. పద్మాక్షి శ్రీమన్మహాదేవులకు పెక్కు సేవలు జరిపింపఁబడినవి. ప్రోలరాజేంద్రుఁడు నిర్మించిన దేవాలయమున నిట్లు శ్రద్ధాభక్తులతో పూజా మహోత్సవములు మహోత్సాహమున నిర్వర్తింపఁబడెను. పెక్కు దానధర్మము లొనరింపఁబడెను. ప్రతాపరుద్రదేవుని పట్టాభిషేకోత్సవము నైదు రోజులు జరిపించి అనేకములగు వేడుకలతో ప్రోలరాజు ప్రజల నానందసాగరమున నోలలాడించెను.

ఇరువదియేడవ ప్రకరణము.

# అస్తమయము.

ప్రతాపరుద్రదేవుడు రాజ్యాభిషిక్తుఁడైనది మొదలు రామేశ్వర దీక్షితులవారు అప్పటికే ప్రచారదశనందుకొని యాంధ్రదేశమున వ్యాపించిన వీరవైష్ణవ మతము ననుమకొండరాజ్యమునఁ గాలువెట్టకుండ వీరశైవమత విజృంభణముతో కాకతీయ మహాంధ్ర రాజ్యవ్యాప్తి సాధించుటకై సుస్థిర పథకములువేసి అనుమకొండరాజ్యము నెల్లెడల వానిని ముందుగా నమలు జరిపింప మొదలుపెట్టెను. ఊరూర శివాలయముల నిర్మించి శివసప్తాహములు జరిపించెను. వీరభద్రోత్సవములకు ప్రభల సంబరములని పేరుపెట్టి తెల్లని వస్త్రములతో రజితాద్రులను నిర్మింపఁ జేసి కత్తులలో, శూలములతో, బల్లెములతో, వీరచేష్టితముల బ్రదర్శించు నుత్సాహకులగు భక్తులతో వాని నూరూరఁ ద్రిప్పించి వీరశైవ ప్రభలు దిగ్దిగంతముల వ్యాపింపఁజేసెను. శివకథలు పాటలుగా, పదములుగా వ్రాయించి భిక్షుకులచే నూరూర ప్రచారము సేయించెను. భేదభావము నశించి సర్వవర్ణములవారు నైక్యపడుటకై అనులోమ ప్రతిలోమ వివాహములును, సర్వవర్ణ సహపంక్తి భోజనములను బ్రారంభింపఁజేసెను. జైనుల నేరి త్రోసివేసెను. బ్రాహ్మణమత మణఁగారఁజేసెను.

శత్రువులు లోపలికిఁ జొరకుండుటకై మాలమాదిగలను, బోయలను, పాలెగాండ్రను సైన్యములుగా నేర్పరచి ప్రతిగ్రామమునకు తూర్పు దిక్కున నెడముగా పాళెము లేర్పఱచి శత్రువులు వచ్చినంత కొమ్ములతో, పింజలతో, తప్పెట్లతోఁ బ్రజల మేల్కొలిపి కఠారులతో యుద్ధము సేయుటకు నిలువరించెను.

పోలుఁడెంత శివైక్యమును భావించుకొని విరక్తుఁడైనను రుద్రదేవునకు రాజకార్యములందు సలహాల నొసంగుచు తోడ్పడుచునే యుండెను.

రుద్రుఁడును తండ్రిమాటఁ గాదనకుండఁ బాలించుచుండెను. గురుదేవుఁడు జైనులనేరివైచి రాజ్యమునుండి వెడలనడఁచుట, బ్రాహ్మణులఁ దలయెత్తి కుండఁజేయుట ప్రోలునకుఁ బొత్తిగ గిట్టలేదు. జైనులున్నంతవరకు వీర శైవమత విజృంభణముద్వారా కావలసిన కాకతి రాజ్యవిస్తరణమున కాటం కములు గలుగుచునేయుండునని గురుదేవుని యాశయము. ఆయాశయ మాతనిలో నెంతగాఢముగా నున్నను ప్రోలుడు పూర్తిగ సాగనీయిక యెప్పటి కప్పు డడ్డుకొనుచునే యుండెను.

బేతరాజు జైనుల కెంతగా హితుఁడైనను శైవుల నాదరించి ద్వంద్వ నీతినిఁ బాలించెను. అట్లే ప్రోలరాజు రాజ్యవిస్తరణకాంక్షఁజేసి శైవుల కెంతగా హితుఁడైనను జైనులను కాదనకుండఁ బాలించుటకు నిశ్చయించు కొని గురుని చెడనాడుకొనకుండ ద్వంద్వనీతిని బాలించుకొనివచ్చెను. రుద్ర దేవుని పట్టాభిషేకముతోఁ బరిస్థితులు తారుమారగుచుండుట ప్రోలుఁడు సహింపలేకుండెను. అందుచే శివైక్యభావమును సడలించుకొని ప్రోలుఁడు రాజ్యపాలనమున జైన బ్రాహ్మణ హింస గలుగకుండ రుద్రుని హెచ్చ రించుచు దీక్షితులవారి మాటలఁగాదని రుద్రదేవుడు స్వతంత్రించునట్లు హెచ్చరించుచుండెను.

దీక్షితులవారికి తండ్రి కొడుకు లేకమై తనమాట జరుగనీయకుం డుట బాధాకరమైనది. శివైక్య భావముతో ప్రోలుని స్తబ్ధునిఁజేసి కూర్చుండఁబెట్టవచ్చు ననుకొన్న తనయాలోచన వ్యర్థమైనది. ప్రోలుఁడు బ్రతికియున్నంతవరకు వీరశైవ విజృంభణము తన యిష్ట ప్రకారము జరుగదు. ఒకమూల వీరవైష్ణవము ముంచుకొని వచ్చుచున్నది. సరిహద్దు రాజ్యములలో నప్పుడే వీరవైష్ణవము పొంగి శైవముతోఁదలపడినది. వీరశైవము విజృంభింపకున్న వైష్ణవము దానిని మ్రింగివేయును. యావ దాంధ్రముఁ బాలింపఁజేయుటకు కాకతిరాజుల నాధారముగఁ జేసికొని వీరశైవ మతవ్యాప్తికై పెద్దయాసపెట్టుకొన్న తనకుతాను పెంచి పెద్దచేసిన

ప్రోలరాజే మార్గమున కవరోధముగ నిలుచుట దీక్షితులవారు సహింపలేక పోయినారు. వ్రణదుష్టమైనవ్రేలును ఖండించివేయకున్న శరీరమంతయుఁ గుళ్లిపోవునట్లు ప్రోలునస్తమింపజేయకున్న వీరశైవము కాకతి రాజ్యము నందు రూపుమాయునని యాతఁడు నిశ్చయించి ప్రోలునిపైని తనకుఁగల సహజప్రేమను జంపుకొనినాఁడు.

ఒకనాఁడు దీక్షితులవారు రుద్రునిఁజేరి పితృవధోద్యోగమునఁగలుగు పాతకమును వెంటనే కాశీవిశ్వేశ్వరుని సేవించి తీర్థయాత్రలతో నివర్తింపఁ జేసికొనుట యుత్తమమని బోధించెను. రుద్రదేవుని కది యుక్తమని తోచినది. ఒక సంవత్సరము తీర్థయాత్రలు సేవించుకొని తాను వచ్చు వరకు తండ్రిని రాజ్యపాలనమున కొప్పించెను. కతిపయమిత్ర పరివార పరివృతుఁడై బాల్యస్నేహితుఁడగు అచితేంద్రునితోఁగూడి రుద్రదేవ మహా రాజు కాశీయాత్రకు బయలువెడలెను.

రుద్రదేవునకుఁ బ్రతినిధిగా ప్రోలుఁడు రాజకార్యములఁదీర్చు నవ సరముల రామేశ్వరదీక్షితులు రాజాభిమతముగా జైన బ్రాహ్మణ మతాదర మును దెచ్చిపెట్టుకొని యాతని కానందమునుగొల్పెను.

దీక్షితులవారు రుద్రుడు యాత్రనుండి రాకుండఁగనే ప్రోలుని లేకుండఁజేయుట కాలోచించి యొకనాఁడు వెలనాడుపై దాడి వెడలఁ జేయుటకు ప్రోలున కుత్సాహమెక్కించెను. ప్రోలుఁడపజయము నెఱుఁగని వాఁడగుట చోడరాజుపై యుద్ధమునకు సిద్ధపడెను. వీరశైవ మతవ్యాప్తితో నింకఁ బనిలేకుండనే రాజ్యవ్యాప్తి సాగింపవచ్చునని అతనికిఁ దోచినది. తన సైన్యబలముతో వెలనాడు జయించి గురుని సిద్ధాంతము రాద్ధాంతము సేయవలెనను నుబలాట మాతనిని దూరముననున్న వెలఁనాడుపై యుద్ధ మున కుసిగొల్పినది. గురుఁడును రాజ్యవ్యాప్తికిఁక ముందుగా మతవ్యాప్తి జరుగవలసినపనిలేదనియు సైన్యబలము చేరునంతవరకే మతబల మవసర పడునుగాని సైన్యబలము పుష్టిగనున్నపుడు ముందుగనే శత్రువు నోడించి

పిమ్మటనే మతమును ప్రజలలో వ్యాప్తికిఁ దేవచ్చుననియుఁ గొంతబిగువు సడలించి రాజాభిమతప్రాయమును బలపఱుప నటించెను.

రుద్రుఁడు రాకుండగనే వెలనాడు జయించి నూతన రాజ్యముతో రుద్రునకు స్వాగతము నొసంగవలెనని గురుఁడు మాటలతో ప్రోలునకు మఱింత యుత్సాహము హెచ్చించెను. వెలనాడు జయించిన త్రిలింగరాజ్య సార్వభౌమత్వము కాకతీయులకుఁ దక్కునని ప్రోలుఁడు గుటకలుగ్రోలెను. ప్రోలరాజున కూహకలుగుట తడవుగా దీక్షితులు యుద్ధసన్నాహముఁ బూర్తి సేసి రణభేరీ మ్రోగింపఁజేసెను.

దీక్షితులవారిని రాజ్యకార్యనిర్వహణమును, దుర్గరక్షణమును బాలశివదేవుని జరుపవలసినదిగా నర్థించి ప్రోలరాజు వెలనాఁడు చోడ రాజుపై పరిమిత సైన్యముఁ దీసికొని యుద్ధమునకు బయలుదేరెను. అంత సైన్యము నొక్కమాఱుగఁ గొనిపోయిన వ్యయప్రయాస లధికమగుననియు రాజధాని రక్షణము సమర్థముగా నుండదనియు గాన నెప్పుడు వలసిన నప్పుడు అనుమకొండనుండి మూలబలములఁ బంపుదుననియు ప్రోలరాజు నకు గురుదేవుఁడు నచ్చఁజెప్పెను. ప్రతిక్షణము యుద్ధవార్తా విశేషములు ప్రోలుడు తన కెఱింగించుచుండుటకు నిర్ణయించి దీక్షితులు వెలనాఁడు ననుమకొండ రాజ్యములమధ్య అంచెలవారీగా వేగులవారిని నియమించెను.

వెలనాడును పాలించు రెండవ చోడరాజు బహుపరాక్రమవం తుఁడు. మహాసేనాపరివృతుఁడు. యువరాజగు గొంకరాజు తండ్రిని మించిన వీరుఁడు. మహాభిమాని. శత్రువుల పేరెత్తిన ప్రళయరుద్రునివలె కన్నుల మంటలెగఁజిమ్మును.

వెలనాటి చోడుని సేనాబలమును దీక్షితులు ప్రోలునకుఁ దెలియ నీయలేదు. విజయగర్వమును దలకెక్కించి యల్పసైన్యముతో అనల్ప సైన్యవృతుడగు చోళునిపైఁ దలపడఁజేసినాఁడు.

ప్రోలుఁడు తనపైనెత్తి పడవచ్చుచున్నాఁడని చోడరాజునకు ముందు గనే వార్త యందినది. ప్రోలుఁడు విజయముపై విజయమునంది బలపడిన వాఁడు గావున నాతనెదిరింపక సంధిసేసికొనుట యుత్తమమని చోడరాజు భావించెను. కాని యాతని కుమారుఁడు గొంకరాజందుల కంగీకరింపలేదు. వేగులవారివలన ప్రోలరాజల్ప సైన్యముతో వచ్చుచున్నాఁడనియు, రుద్ర దేవుఁడు తీర్థయాత్రలకేగి తిరుగుముఖమున నున్నాడనియుఁ రామేశ్వర దీక్షితులుగాని బాలశివదేవుఁడుగాని ప్రోలుని వెంటవచ్చుటలేదనియు, బహుసైన్యము రాజ్యరక్షణకై నిలుపఁబడి అవసరము వెంట ప్రోలునకుఁ బంప నిశ్చయింపఁబడినదనియు తెలిసికొని గొంకరాజు ప్రోలుని జయించుట బహుసులభకార్యమని తండ్రి నొడంబరచెను. ప్రోలు నప్పుడోడింపఁగలిగి నను ప్రబలుఁడగు రుద్రదేవునితో విరోధము భవిష్యత్తులో వెలనాడు మనుగడకే ముప్పుదెచ్చునని చోడుఁడు దూరాలోచనముచేసి చెప్పినను యౌవనమదమున గొంకరాజు వినిపించుకొనలేదు.

ప్రోలుఁడు తమ రాజ్యసరిహద్దులో నడుగిడుట తడవుగా నాతనికి నలుప్రక్కలను తమ సేనలు చుట్టుముట్టి చక్రవ్యూహము దీర్చుటకు గొంకరాజు సమాయత్తపరచెను.

ప్రోలుని సేనలు ముందువెనుక లరయక వెలనాఁడు సరిహద్దుఁ జేరుకొనెను. అంతలో వారికి నలుప్రక్కల చోడుని సైన్యములు చుట్టి వచ్చుచున్నటు తోచినది. ప్రళయకాలపర్జన్యగర్జానుకారియగు శత్రుభేరీనినా దము ప్రోలుని సైనికుల గూబలు బ్రద్దలుకొట్టినది. వారికేమిచేయుటకుఁ దోచక తమరాజును రక్షించుకొనుటకు మధ్యభాగమునకు ముద్దగా బ్రోగు పడిరి. ప్రోలునకు గర్తవ్యము తోచినదికాదు. అనుమకొండకు వార్తనంపు టకుఁగూడ శక్యముగాకుండునట్లు శత్రుసేనలు వర్తులాకారముఁ దీర్చి యున్నట్లు తెలిసి ప్రోలుఁడు హతాశుఁడయ్యెను. విక్రమించి వీరశయనము బ్రాపించుటకంటె చేయదగినది లేదని నిర్ధరించుకొనెను.

క్రమముగా చక్రవ్యూహము ప్రోలుని సైన్యమును సమీపించినది. తన రక్షణమునకై ప్రోగుపడిన సైనికులను ప్రోలుఁడు 'చెదరిపోయిన శత్రువులబారినుండి శక్యమయినఁ దప్పించుకొని అనుమకొండకు నొక్కఁడైన వార్తనందింప వెడలుటకు యత్నింపు' డని యెలుగెత్తి హెచ్చరించెను. శివసాయుజ్యమునందుటకు తనతోఁగలిసి వచ్చువారిని వెంటనిడుకొని శత్రుసేనలపైబడి ప్రోలరాజు వీరవిహారమున కుపక్రమించెను.

గొంకరాజు కాలరుద్రునివలె ప్రళయతాండవము సలుపుచున్న ప్రోలుని సమీపించుటకు జంకెను. ముందు సైన్యము నుసిగొల్పి వెనుక నుండి ప్రోలుని వీరవిహారము నుపలక్షించుచుండెను. ప్రోలుఁడొక్కఁడు నెంత విక్రమసంపన్నుఁడైనమాత్ర మేమిచేయఁగలఁడు. యుద్ధము చేసిచేసి ప్రోలుఁ డలసినసమయము గనిపెట్టి గొంకరాజు తన గుఱ్ఱమును ప్రోలుని పైకురికించినాఁడు. ప్రోలుఁడు శరీరాయాసమును గమనింపక యువరాజుతోఁ బోరున కుపక్రమించెను. అంతవరకు దనకు బాసటగానిలచిన వీరులు శివైక్యమునందిరి. తానిఁక కొలదినిమిషములలో పడిపోవునని తెలిసినంత ప్రోలుఁడు శివధ్యానమునమునిగి శిరస్సు గొంకరాజు ఖడ్గమున కందిచినాఁడు. సూర్యవంశ కమ్రరాజగు కాకతిప్రోలరాజు శిరము క్రింద పడుటతో తళతళమను కాంతిరేఖయొకటి బయలువెడలి స్వవంశ మూల పురుషుఁడగు సూర్యుని మండలమును భేదించుకొనిపోయెను.

ప్రోలరాజును జంపిన మహోత్సాహమున గొంకరాజు రుద్రదేవుఁడు యాత్రనుండి అనుమకొండఁ జేరకుండగనే సేనల ననుమకొండపైకెత్తి పడిన అనుమకొండరాజ్యమును సులభముగా వశపరచుకొనవచ్చునని యుత్సహించెను. కాని చోడరాజు తన కుమారుని ప్రయత్నము బలవంతముగనాపెను. రుద్రదేవుఁడే యక్కరలేదు; అనుమకొండలో దీక్షితులు, శివదేవుడు నుండగా కాకతిరాజ్యమును వశపఱచుకొనుట యెంతటివారికిని శక్యముగాదని పుత్రునకు నచ్చజెప్పి విముఖునిగావించెను.

పిమ్మట గొంకరాజు కుమారుని సంతుష్టికై ప్రోలుని తాను జయించి నట్లు శాసనము వ్రాయించుకొని శాసనఫలకములను ద్రాక్షారామమున భీమేశ్వరప్రీతిగా నెలకొల్పి తనరాజ్యమందెల్ల యుత్సవములు జరిపించెను.

వీరశైవ మతవ్యాప్తికొఱకై కాకతి ప్రోలుని అస్తమయమునకు తానే కారణుడైనను స్వశిష్యుని మరణము రామేశ్వర దీక్షితులవారి హృదయ మును కలంచివైచినది. అతని హృదయకుహరమున దుఃఖసముద్రము సుళ్లుదిరిగి పరవళ్లు త్రొక్కినది. కాని యాతఁడంతటిలోనే అంతయు శివ సంకల్పముగ నెంచి, భవిష్యత్కార్య మూహించి యొక కంటితోడ దుఃఖాశ్రువులు విడిచెను.

మహాంధ్ర రాజ్యస్థాపనాచార్యుఁడగు కాకతిప్రోలరాజేంద్రుని మర ణమునకు మతభేదములేకుండ నెల్లజనులు రెండు కన్నులతోడను దుఃఖా శ్రువులు రాల్చిరి.

# పురాణ వాఙ్మయాధారములు.

## అత్యర్కేందుకుల క్షత్రియులు అనుటకు ఆధారములు.

### (నాల్గవ ప్రకరణము)

శ్లో॥ సూర్యాధికారం వహతో విష్ణో రీశస్య వేధసః
మనుస్తస్యా భవత్పుత్రః ఛిన్నసర్వార్థ సంశయః
మనుంతరాధిపో విప్ర ! యస్య సప్తమ మంతరం
ఇక్ష్వాకు ర్నాభగో విప్ర ! శర్యాతిశ్చ కరూషకః
నరిష్యంతో ఒథ నాభాగః పృషధ్రో ధృష్ట ఏవ చ
ఏతే పుత్రా మనో స్తస్య పథ్వ గ్రాజ్యాధిపాలకాః
మిత్రావరుణయో రిష్టిం చకార కృతినాం వరః
యత్ర పంచాహృతేః హోతు రపచారా న్మహామునేః
ఇళానామ సముత్పన్నా మనోః కన్యా సుమధ్యమా
తాం దృష్ట్వా కన్యకాం తత్ర సముత్పన్నాం తతో మనుః
తుష్టావ మిత్రావరుణౌ వాక్యం చేద మువాచ హ
భవత్ప్రసాదా త్తనయో విశిష్టో మే భవే దితి
ఇళా సమభవ త్సద్యః సుద్యుమ్న ఇతి విశ్రుతః
పున శ్చేశ్వరకోపేన మృగయా మటతో వనే
స్త్రీత్వ మాసాదితం తేన మనుపుత్రేణ ధీమతా
తతః పురూరవం నామ చక్రవర్తిన మూర్జితం
జనయామాస తనయం యత్ర సోమసుతో బుధః
జాతే పుత్రే తతః కృత్వా సో ఒశ్వమేధం మహాక్రతుం
పురుషత్వం తతః ప్రాప్త స్సుద్యుమ్నః పార్థివో ఒభవత్

( మార్కండేయ పురాణమున 108 వ అధ్యాయమును,
దౌర్వాసదేవీ ఉపపురాణమున గౌరీసంహితయందు
ద్వితీయఖండమున 42 వ అధ్యాయమును.)

అయం పురూరవా నామ సర్వలోకనమస్కృతః
ధర్మేణ పాలితా తేన సర్వలోక హితైషిణా
చామరగ్రాహిణీ కీర్తిః సదా చైవాంగవాహికా
విష్ణుప్రసాదా ద్దేవేంద్రో దదా వర్ధాసనం తదా
ధర్మార్థకామాన్ ధర్మేణ సమమే వాభ్యపాలయత్
ధర్మార్ధకామా స్తం ద్రష్టు మాజగ్ముః కౌతుకా త్పురా
జిజ్ఞాసవ స్తచ్చరితం కథం పశ్యతి న స్సమం
భక్త్యా చక్రే తత స్తేషాం అర్ఘ్యపాద్యాదికం నృపః
ఆసనత్రయ మానీయ దివ్యం కనకభూషణమ్
నివేశ్యా థాకరో త్పూజాం ఈష ద్ధర్మే ఽధికాం పునః
జగ్మతు స్తేతు కామార్థా వతికోపం నృపం ప్రతి
అర్థ శ్శాప మదా త్తస్మై "లోభా త్త్వం నాశ మేష్యసి
త్వద్వంశ్యాశ్చ వినా హ్యర్థా న్భవిష్యంతి కృషీవలాః
వణిజ స్త్వక్త్రరాజన్యాః భిన్నాచారాః మహావ్యధాః
యావ త్త్వత్సంతతౌ యోగీ రుద్రో భవతి కశ్చన
ప్రతాపరుద్రనామ్నాతు యదా రాజా మహీతలే
ఉద్భవిష్యతి ధర్మాత్మా క్షత్రధర్మపరాయణః
అతః పరం రాజయోగో రాజేయానాం న విద్యతే"

(దౌర్వాస దేవీపురాణము 56 వ అధ్యాయము)

(శాపాంతే భరత స్యాథ) ఊర్వశీ బుధసూనుతః
అజీజన త్సుతా నష్టౌ నామత స్తాం నిబోధత
అయు ర్దృఢాయు రశ్వాయు ర్ధనాయుశ్చ ధృతి ర్మతిః
శుచి ర్వర శ్శతాయుశ్చ సర్వే దివ్యబలౌజసః
అయుషో నహుషః పుత్రః వృద్ధశర్మా తతః పరః
రజీ రసో విపాప్మా చ వరాః పంచ మహారథాః
ఆయోఃపుత్రాశ్చ తే సర్వే మహావీరా మహారథాః

స్వర్భానుతనయా జ్ఞాతాః అయాయా నామ పార్థివాః
ఆయా ఇతి చ తేషాం హి నామోపపద మిష్యతే
అథ త స్యాత్మజాతేషు తృతీయో రజిసంజ్ఞికః
మహా నసో హి రాజర్షిః మాన్యో ఒభూ త్సర్వభూతలే
స చ పుత్రశతా నీహ జనయామాస పంచ వై
రాజేయ మితి విఖ్యాతం రాజా రాజాయవా ఇతి
రాజేయమితి విఖ్యాతం క్షత్రమింద్ర భయావహం
యత్ర దైవాసురే యుద్ధే సముత్పన్నే సుదారుణే

* * *

అస్మిం స్తు సమరే రాజన్ తిష్ఠ త్వం రాజసత్తమ !
స తథేతి బ్రువ న్నేవ దేవై ర ప్యభిభోదితః
భవిష్య సీంద్రో జి త్వైవం దేవై రుక్త స్తు పార్థివః
జఘాన దానవాన్ సర్వాన్ యే వధ్యా వజ్రపాణినా
తతో రజిం మహావీర్యం దేవై స్సహ శతక్రతుః
రజిపుత్రో ఒహ మి త్యుక్త్వా పునరే వాబ్రవీ ద్వచః
ఇంద్రో౽సి తాత! దేవానాం సర్వేషాం నాఽత్ర సంశయః
యస్యాహ మింద్రః పుత్ర స్తే ఖ్యాతిం యాస్యామి కర్మభిః
స తు శక్రవచ శ్శ్రుత్వా వంచిత స్తేన మాయయా
తథైవే త్యబ్రవీ ద్రాజా ప్రీయమాణ శ్శతక్రతుం
తస్మిం స్తు దేవై స్సదృశే దివం ప్రాప్తే మహీపతౌ
రాజేయా ఇతి విఖ్యాతాః తతః పంచశతాత్మజాః
పదం తల్లేభిరే పిత్ర్యం యద్వై స్థానం శతక్రతోః
శతకే ష్వత్ర తేషాం వై పంచై వాసన్ ప్రధానతః
కమ్రః కీర్తి స్తథా కాంతః కమనో ఒరిష్ఠ ఏవచ
ఏతే పంచ తు విఖ్యాతాః రాజేయా వీర్యవైభవైః
దాయాద మింద్రా దాజహ్రూ రాజ్యం త్యక్తనయం రజేః
సమాక్రామంత బహుధా స్వర్గలోకం త్రివిష్టపం
(దౌర్వాసదేవీపురాణము 42 వ అధ్యాయము)

ఏవం ద్వాపరతే పుత్రా యాచమానాయ నో దదుః
త్రివిష్టపం మహేంద్రాయ ... .... ... ...
గురుణా హూయమానే ఒగ్నౌ బలభి త్తనయాన్ రజేః
అవధీ ద్భ్రంశితాన్ మార్గా న్న కశ్చి దవశేషితః
(భాగవతము నవమస్కంధము)

వైవస్వతమనో స్సూనోః ధృష్టస్య హి సుతో ఒభవత్
నాభాగ ఇతి విఖ్యాతో వంశనామ్నా సుధీమణిః

* * *

తస్య పుత్ర స్తతో జాతో నామ్నా ఖ్యాతో భనందనః

* * *

అజాయత సుత స్తస్య వత్సంప్రో నామ నామతః

* * *

తస్య తస్యాం సునందాయాం పుత్రా ద్వాదశ జజ్ఞిరే
తేషాం జ్యేష్ఠో మహావీర్యః ప్రాంశు రాసీ న్నరాధిపః

* * *

ప్రజని స్తస్య పుత్రో ఒభూత్ .... .... ....
ప్రజనే స్తనయాః పంచ ఖనిత్ర ప్రముఖా మునే

* * *

క్షుపః ఖనిత్రపుత్రస్తు .... ... ... ... ....

* * *

తస్య పుత్రో ఒభవ ద్వీరః .... ... .... ....
తస్యాపి నన్దినీ నామ వైదర్భీ దుహితా భవత్
వివింశం తనయం తస్యాం జనయామాస స ప్రభుః

* * *

తస్య పుత్రః ఖనిత్రో ఒభూత్ మహాబల పరాక్రమః

* * *

అపుత్ర స్స మహీపాలో మృగయా ముపచక్రమే
పుత్రార్థే పితృయాగాయ మాంసకామో మహామునే
(మార్కండేయపురాణము 110అధ్యాయముమొ॥ 118అధ్యాయము వరకును
దౌర్వాసదేవీ పురాణమున 42 వ అధ్యాయము మొదలు
51 వ అధ్యాయము వరకును,)

*　　*　　*

తత స్స నృపతి ర్గత్వా గోమతీం పాపనాశినీం
గోమంతికే భగవతీం భవానీం పాపనాశినీం
తుష్టావ భక్తిభరితః ప్రణమ్య శిరసా ముహుః

*

ఇతి స్తుతా మహాదేవీ దేవదేవీ త్రిలోచనా
త్రిపురా శాంభవీ మాయా మహాలక్ష్మీ శివప్రియా
ఆవిరాశీ త్పుర స్తస్య గౌరీ గురుకృపోదయా
ఖనిత్ర! గోత్రేమే తే సన్తి పంచ శతాని వై
యాని పూర్వం రజే రాసం రాజేయాహ్వాని పార్థివ !
యాని చేంద్రేణ శప్తాని లోభా ద్భ స్మాభవ త్పురా
యేషాం ధర్మప్రసాదేన పూర్వేషాం విద్యతే ధృతిః
తా నానయస్వ భద్రం తే తే పుత్రా స్సంతు తే నృప !
తానేవ పుత్రాన్ గృహ్ణీష్వ శూరా నాత్మకులోద్భవాన్
స్వ స్యాపత్యం స్వగోత్రస్యాపత్యం సర్వం సమం స్మృతమ్
తేషాం కర్మప్రధానానాం కుమారో భవితా గురుః
విప్రక్షత్రవిశాం ధర్మాన్ వ్యాఖ్యాస్యతి యథోచితమ్

*　　*　　*

క్వచి ద్విట్ధర్మ సంస్పృష్టం గోత్రం తే భువి భాస్యతి
ఇత్యు క్త్వాంతర్దధే గౌరీ దేవదేవీ త్రిలోచనా

(దౌ. 51 వ అధ్యాయము.)

రంభస్య తనయేష్వేష బలి ర్బలవతాం వరః

* * *

శప్తో దధీచినా ప్రాప్తమృగావస్థా మిమాం మునే

* * *

తాప త్స మృగతాం హిత్వా దధౌ రూపం మహీపతేః
అథ తం ప్రాహ రాజాస్మి రాజేయో బలిసంజ్ఞకః

* * *

యే గౌర్యా తవ నిర్దిష్టాః యే చ శాపా శ్చతక్రతోః
భస్మతాం ప్రాపు రున్మత్తాః లోభావిష్టధియో నృప !
తే హ్యత్ర శైలసంకాశాః భస్మభూతా భవంతి హి
తా నుత్తారయ ధర్మేణ కీర్తివర్జ్య ముపాయతః
కీర్తిస్తు నిహంతి స్సాక్షాత్ నికృ త్యేంద్ర స్స్వతేజసా
అన్యే సర్వేఽపి కమాద్యాః తార్యంతే నాత్రసంశయః
తతో ఽలర్క ముపాతిష్ఠ దత్తాత్రేయానుగతం తదా

(దా. 52 వ అధ్యాయము.)

* * *

అలర్క ఇతిధర్మజ్ఞః ఖ్యాతిం లోకేషు యాస్యతి

* * *

తస్మి న్నత్రాగతే రాజ్ఞి తత్పాదరజసా వృతమ్
రామపాద రజస్పర్శా దహల్యేవ భవే దిదమ్
దివ్యమాల్యాంబరధరం దేవగంధర్వసన్నిభమ్
ఉత్థితం భస్మనిచయా త్పూర్వేషాం ద్రక్ష్యసే కులమ్
సర్వే గంధర్వసంకాశా స్సర్వే క్షత్రియసత్తమా
కీర్తి క్రమముఖా స్తేఽమీ రజో ఽలర్కపదోద్భవమ్
ప్రాప్య పుణ్యం భస్మభూయం విహాయ ద్రుత ముత్థితాః
పూర్వరూపం సమాస్థాయ ద్రక్ష్యసే పురత స్తవ
తే హి లోకే మహీపాల వ్యాప్య సర్వదిశో నృపాః

రాజిష్యంతి రాజేయాః వర్ధమాన కులక్రమాః
అంగా న్వంగాన్ కళింగాన్చ మగధాన్ కురు జాంగలాన్
పాండ్యాం శ్చేలాం శ్చ పాంచాలాన్ బర్బరాన్ కేకయాన్ ...
కొంకణాన్ టెంకణాన్ లాటాన్ మహారాష్ట్రాంశ్చ మాలవాన్
నేపాళానపి సౌవీరాన్ సౌరాష్ట్రాన్ కుకురా నపి
ఆంధ్రాన్ కర్ణాట తుండీరాన్ మరూన్ ప్రాగ్జ్యోతిషానపి
మత్స్యాన్ సింహాం స్తథా చౌడాన్ ద్రవిడానపి కేరళాన్
కోసలాంశ్చ విదర్భాంశ్చ దశార్ణాన్ నిషధానపి
విరాటాఙ పప్లవాన్ హూణాన్ కిరాతాన్ యవనానపి
శకాన్ పుళిందాన్ మలయాన్ కాంభోజాన్ బాహ్లికాం స్తథా
గాంధారాంశ్చ కురూం శ్చైవ మైథిలా నుత్కలానపి
సారస్వతాన్ కాన్యకుబ్జాన్ గౌడాన్ చేదీంశ్చ హైహయాన్
వ్యాప్య తేజఃప్రతాపాభ్యాం చరిష్యంతి దరాభుజః
కమ్రనామా నాయకాఖ్యాః ప్రచరిష్యంతి వై నృపాః
కమ్రా ఇతి చ రాయాయా రాజేయా శ్చేతి సర్వతః
మయా వ్యాహ్రియమాణాని గోత్రాణి హరిసత్తమ
త వాత్మజానాం శృణు మే లోకే సంపరివర్తతామ్
కాకాః పాకాః కాకతయః కాకలాశ్చ తథా పరే
రంగవ శ్శృంఖలా రాయా చోలాః కేలా స్తథైవహి
కమ్మాః కామాః కామకాశ్చ కామకాయనకాస్తథా

* * *

ఇతి నామ్నా చరిష్యంతి రజేః పుత్రా స్తవాత్మజాః
వృద్ధి మేష్యం త్యమి నీపాః భూమ్యాం బహుసహస్రశః
భిభ్రాజ చ్ఛలమర్తిగండ కులజః రుద్రావతారః ప్రభుః
కో ప్యేషాం కుల మున్నయ న్నతితరాం రాజష్యతి క్ష్మాతలే
శ్రీ వీరాభిధయా శ్రియా పరమయా దేదీప్యమాన స్స్వయమ్

రాజేయానాం సమృద్ధిస్తుతదంతా పరికీర్తితా
మహాలక్ష్మ్యాం మహాదేవ్యాం తథా నారాయణే ఒపి చ
విశేషాచ్చ మహాదేవే భక్తిభాజో భవిష్యథ
యావ ద్వ శ్శాంభవీ భక్తిః వైష్ణవీ శాక్తికీ చ వా
ప్రకాశతే నిరాఘాటం తావ ద్వః క్షత్రతా భువి
యదా క్షీణగతిం ప్రాప్తా భక్తి ర్వో భూతిభావినీ
తదైవ క్షత్రధర్మో వః లోప మేష్య త్యసంశయం
అథ లోకే విశాం ధర్మః శూద్రాణా మపి చానఘ
భవిష్యతి హి వో ధర్మః క్షత్రాణా మపి నిశ్చితం
(సౌర్వాసదేవీపురాణము 57, 58 అధ్యాయములు)

"శ్లో॥ తాదృ క్కర్ధ్యమనేక భాగ్యవిభవా విద్రాది బృందారకైః
క్షోణ్యాం క్రీడితు మిచ్ఛయా శ్చిరతరం సంప్రార్థితః పద్మభూః
అత్యర్థ్యేందుకుల ప్రసూతి మసృజ ద్వ్యం కాకతీయాన్వయం
తస్మిన్ సంప్రతి వీరపుంగవపుషా జాగర్తి లక్ష్మీపతిః"
* ప్రతాపరుద్రయశోభూషణము, కావ్యప్రకరణము.

*Prataparudra Yosho Bhooshanam : Published with foot notes as First Edition of Bombay Sanskrit and prakrat Series No LXV by Department of Public Instruction in Govt Press Bombay 1909.

"ఈశ్లోకమున 'ప్రసూతి' అను పాఠము : మద్రాసు ఓరియంటలు లైబ్రరీలోని తాళపత్ర గ్రంథములలో నొకదానియందున్నది. ఈతాళపత్ర గ్రంథము గ్రంథాక్షరలిపిలో 238 పుటలందున్నదనియు, సుమారు 130 సంవత్సరములకు పూర్వము లిఖింపబడియున్నట్లు కన్పట్టుచున్న దనియు, ఇది పరిశుద్ధమైన మాతృకయనియు ఇది 1893 A. D. కు పూర్వమే మద్రాసు ఓరియంటలు లైబ్రరీకి ఇయ్యబడిన దనియు ఆగ్రంథము నందలి Introduction లో తెలుపబడియున్నది. దీనినిబట్టిచూడ 'ప్రసూతి' పాఠమే కవిప్రోక్తమని. 'ప్రశస్తి' అను పాఠము తర్వాతివారు కల్పించినదని స్పష్టముగా తెలియుచున్నది.

## ప్రచ్ఛన్నక్షత్రియులు అనుటకు ఆధారములు.
## (అయిదవ ప్రకరణము)

మహానంది ర్మహారాజో రాజ్యం కుర్వ న్మదోత్కటః
స రాజా రాజకన్యాం చ హ్యేకాం శూద్రకులోద్భవాం
కన్యాం గృహీష్యతి ముదా పత్నిత్వేన తత శ్మ్రణు
మహానందిసుతో రాజన్ శూద్రాగర్భోద్భవో బలీ
మహాపద్మపతిః కశ్చి న్నందః క్షత్రవినాశకృత్
సర్వదేశస్థితం క్షత్రం పాలయిష్యతి మూఢధీః
జ్యోతిఃపుర్యాం మహానందీ నంద స్థాప్య మహామనాః
సర్వరాజ్యాభిషేకం తు కరిష్యతి న సంశయః
మహానందీ మహారాజో మృతి మేష్యతి కాముకః
సర్వరాజ్యాధిపత్యం తు ప్రాప్య నందో మహాబలః
సర్వదేశస్థితం క్షత్రం స్వవశం తు కరిష్యతి
నందో మహాబలో వీరో మహాపద్మపతి ర్విభుః
సర్వరాజన్య కర్మాణి మదాంధ స్తు కరిష్యతి
మహాపద్మం తు నగరం తస్య నామ ద్వయం భవేత్
ఉపప్లావ్యం జ్యోతిపుర మిత్యాహు ర్వేదవాదినః
మహాపద్మాఖ్యనగరే స్థిత్వా నందో మహాబలః
శాసిష్యతి న సందేహ స్సర్వదేశస్థితా న్నృపాన్
తే తు తస్య నమస్కారం న కరిష్యంతి భూమిపాః
శూద్రాగర్భోద్భవత్వాచ్చ వేదోక్తవిధిహీనతః
క్షత్రవంశోద్భవాభావా న్న కరిష్యంతి తస్య తు
నమస్కారం హి రాజేంద్ర సర్వదేశస్థితాః నృపాః
తస్మా త్కోపాత్ పద్మపతిః నందో బలపరాక్రమః
సర్వదేశస్థితం క్షత్రం జేతుం వై స గమిష్యతి
అక్షౌహిణీబలౌఘేన వృతో నందో మహాబలః

స్థితం జయపురే వీరం విరాటకులసంభవమ్
జేతుం గజపతిం యోగ్యం ప్రథమం తు గమిష్యతి
రాజ్ఞో గజపతే ర్దూతం స నందః ప్రేషయిష్యతి
గత్వా దూతో గజపతిం దృష్ట్వా వాక్యం కరిష్యతి
నందరాజస్య దూతోఽహం తేనైవ ప్రేషితో ఽస్మ్యహం
నందవాక్యాని రాజేంద్ర ! శృణు ధీరమనాః ప్రభో !
మమ కార్యో నమస్కార స్త్వయా త్వత్కులజై రపి
న కరోషి తథా రాజ స్నద్యైవ వ్యాప్తబాంధవమ్
స జ్ఞాతి రాజ్యహీనం చ కరిష్యామి న సంశయః
కరం ద త్వాతిశీఘ్రేణ పూర్వస్మాచ్చ విశేషతః
సంఘీవ తిష్ఠ రాజేంద్ర! మిత్రబాంధవసంయుతః
శ్రుత్వా గజపతి స్సమ్య గ్దూతవాక్యం స భూపతిః
మంత్రిభి స్సహ సంమంత్ర్య స్వదేశస్థాంశ్చ భూపతీన్
సమానీయ చ తై స్సాకం సమంత్రిశ్చ సభూపతిః
ఏష నందో హి బలవాన్ యుద్ధే జేతుం న శక్యతే
తస్య చక్రు ర్నమస్కారం తే భూపా నందభూపతేః
తం హిత్వా నందభూపాలః సర్వసైన్యసమావృతః
ఆర్యావర్తాదికాన్ దేశాన్ గమిష్యతి చ రాజితాన్
ఏవం తాం స్తాం చ భూపాలా న్నమిష్యతి న సంశయః
మమ కార్యో నమస్కార ఇతి వాచం సుదారుణాం
సూర్యవంశోద్భవా భూపా శ్శ్రుత్వా రోషసమన్వితాః
యుద్ధాయై హి తే సర్వే కరిష్యంతి హి నిశ్చయమ్
తేషాం నామాని వక్ష్యామి శృణు భూప సమాహితః
సాంఖశ్చ దావలశ్చైవ నాగపుర్యధిపా వరా
మందకః కటకాధీశః పత్తిపాతశ్చ భూపతిః
గయాధీశాధిపో వీరో దండకారశ్చ భూపతిః

దండకారశ్చ కేదారదేశరాజశ్చ వీర్యవాన్
చిత్రకూటాధిపో వీరో మంధనాధశ్చ భూపతిః
అంధతీదేశనాధశ్చ కాకలో హీరభూపతిః
బ్రహ్మావర్తాధిపో వీరో రంతిలారశ్చ వీర్యవాన్
ఏతే చాన్యే చ బహవ స్సంభూయ క్షత్రియోత్తమాః
నందభూపేన భూపాలాః యుద్ధం కృత్వా దినత్రయం
జితా స్తేన మహారాజ ... ... .... ....
కారాగృహప్రవిష్టాశ్చ కారయిష్యతి శాసనాత్
కారాగృహే వర్తమానా స్స్వాచారపరివర్జితాః
క్షత్రవేష విహీనాశ్చ శస్త్రాస్త్రపరివర్జితాః
స్నానసంధ్యావిహీనాశ్చ శూద్రాచారైకతత్పరాః
శూద్రానీతోదకం సమ్య గ్గృహ్యమానాశ్చ భూమిపాః
మత్స్యమాంసాదనాశ్చైవ శూద్రా ఇవ శిఖావృతాః
కారయిష్యంతి రాజాన శ్శాసనా న్నందభూపతేః
ఏకచ్ఛత్రాం స పృధివీ మనుల్లంఘితశాసనః
సంవత్సరశతం నందః పాలయిష్యతి మేదినీం
కారాగృహే వర్తమానాః పంచాశద్వత్సరా త్పరం
సాంఖ్యప్రముఖరాజానో హైన్యవృత్త్యైకజీవినః
నందస్య చ నమస్కారం కృత్వా ముక్తాశ్చ తేన వై
నియోజితాశ్చ తేనైవ నందేనైవ దురాత్మనా
కృషికర్మ పరాశ్చైవ భవిష్యంతి న సంశయః
కించిత్కాలం హి తత్రైవ స్థిత్వా సాంఖ్యముఖా నృపాః
వింధ్యస్య దక్షిణే భాగే సముద్రప్రాంత మండితాన్
కళింగాంధ్రవిదర్భాంశ్చ దేశా నాగత్య భూమిపాః
తదాదిభూమిపాలాశ్చ సూర్యసోమసముద్భవాః
పూర్వోక్తేన ప్రకారేణ భవిష్యంతి న సంశయః

దాక్షిణాత్యాశ్చొత్తరికాః ప్రాచ్యా పూర్వదిశిస్థితాః
సోమాన్వయసముద్భూతాః తస్య నందస్య భూమిపాః

(మార్కండేయపురాణ భవిష్యోత్తర ఖండములోని మహాపద్మ చరిత్రము.) ఈమహాపద్మునే కాకవర్మ అని కాలాశోకుండని చరిత్ర గ్రంథములు పేర్కొనినవి.

మహానందిసుతో రాజన్ శూద్రాగర్భోద్భవో బలీ
మహాపద్మపతిః కశ్చి న్నందః క్షత్రవినాశకృత్
తతో నృపా భవిష్యంతి శూద్రప్రాయా స్త్వధార్మికాః
ఏకచ్ఛత్రాం స పృథివీ మనుల్లంఘితశాసనః
శాసిష్యతి మహాపద్మో ద్వితీయః భార్గవో ఇవ.

(భాగవతము ద్వాదశస్కంధము. ప్రథమాధ్యాయము.)



రాయల ముద్రణాలయము, తణుకు,